నరిశింహారావు



# భారతి

వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు

జనవరి 1982 వెల : రూ. 4/-

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



జనవరి 1982

సంపుటము : 59 సంచిక : 1

విడిప్రతికి వెల నాలుగు రూపాయలు



కీ॥ శే॥ శివలెంక శంభుప్రసాద్ గారు
సంపాదకుడు 1938_'72

# స్వవిషయం

భారతి అభిమానులందరికీ కొత్త సంవత్సరం శుభాకాంక్షలు తెలుపుకుంటున్నాము. డిసెంబరు సంచిక వెలువడటానికి కొంత ఆలస్యం అయింది. ఇక మీద భారతి ప్రతినెలా సక్రమంగా వెలువరించటానికి తగిన ప్రయత్నాలు చేస్తున్నాము.

రచయితులు, రచయితలు ఎప్పటిలాగే ఆదరాభిమానాలతో తమ రచనలు పంపుతున్నారు. వారందరికీ కృతజ్ఞులము. ఇంతకుముందే ఎన్నోసారులు మనవి చేసుకున్నట్లు 'భారతి' తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబంగా ఉండాలని మా ఆశయం. భారతికి రాసే వారందరూ ఈ ఆశయాన్ని గుర్తించి రాయవలసిన విషయాలన్నిటినీ గురించీ రచనలు పంపగలరని ఆశిస్తున్నాము. కవిత్వం, కథలు, సాహిత్య విమర్శ, చరిత్రకి సంబంధించిన వ్యాసాలు మొదలయినవి మాత్రమే కాకుండా శాస్త్రాలకి సంబంధించిన రచనలు కూడా ప్రచురిస్తే 'భారతి'కి మరింత నిండుతనం రాగలదు.

భారతి అభివృద్ధికి రాసేవారి, చదివేవారి సహకారం అవసరం.



# విషయానుక్రమణిక

## జనవరి 1982





# కుపిత ప్రణయిని

(* గజల్)

## డా॥ దాశరథి

చేరువలో లేకున్నా చిరు నగవులె చాలు
చెలిమి చేయదలచ కున్న, చిరు తగవులె చాలు

అడుగగానె ఔనని నన్నాదరించకున్నా
పిలిచిననూ పలకని నీ బిగువులె చాలు

మమత పొంగు నవ మధువు మా కిడకున్నా
మధువు తడికి మెరిసే నీ పెదవులె చాలు

సన్న జాజి తీవ చెంత సరసం లేకున్నా
నన్ను చూచినంతనె నీ పరువులె చాలు

ఎద పొలాన విత్తు నాటి వదిలేశావు
వలపు పంట రాకున్నా కరువులె చాలు.

---

* గజల్ = ఒక పారసీ ఛందః ప్రక్రియ

---



# వికసించే గీతం

## శ్రీ గుడిహాళం రఘునాథం

ఒంటరిగా ఉన్న నన్ను
ఓ వైపు ఆకలి బాధిస్తుంటుందా,
నా కడుపు
దీనత్వాన్ని మోసుకొని
కళ్ళలోకి ప్రవహిస్తుంటుంది
నుదుట్ని బాధాతరంగాలు తాకి
కళ్ళు రాలి పడుతున్నట్టుంటాయ్.
నన్ను కొనాలని ఆ రూపాయి తహతహలాడుతుంటుందా
అప్పట్నుంచీ - రూపాయి భయం
రూపాయిలోంచి తొంగిచూసే సింహం భయం
నా నుంచి నా శ్రమఫలాన్ని తెగ్గోసే
అధర్మ చక్రం భయం
నరాల్లో, అవయవాల్లో వణుకు భయం
నా చేతుల్లో కెత్తుకున్న గీతం జారి
కిందపడి
ముక్కలు ముక్కలౌతుందని భయం
నా వళ్ళంతా గాయాల్తో చిట్లుతుందని భయం
దిక్కుతోచక నిర్జన స్థలాల్లోకి నడుస్తూ వెళ్తానా,
ఏవో సంగీతాలు
రెక్కలు టపటప లాడిస్తూ వచ్చి
గుండెలపై గాయం రెట్టల్ని రాలుస్తాయ్
గాయాల్ని తుడుచుకుంటూ
మళ్ళీ ఊళ్ళోకి పరిగెత్తు కొస్తానా
వెలుగులన్నీ ముడుచుకొని ముడుచుకొని
ఓ పైపుకు వొరిగిపోతాయ్
వెలిగిన దీపాలు అప్పుడే ఆరిపోతాయ్.

దాహం వేసి 'నల్లా'ను సమీపిస్తానా
నల్లా తెల్లమొహం వేసుకొని నిలబడుతుంది
దిగులు దిగులుగా రోడ్డుపై నడుస్తుంటానా
సరిగ్గా - అప్పుడు కనబడతావు నువ్వు
నేనొంటరిని కాదని తెలుస్తుంది.
మాటల్లో జల్లుల్నీ
మాటల్లో అగ్నుల్నీ కురిపించి
ఇంద్రధనుస్సుల్ని తయారుచేస్తాం.
స్నేహాన్ని 'వాయ్‌లీన్'పై వాయించుకుంటాం
మనచుట్టూ మనలాంటి వాళ్ళే
రావడం మొదలెడతారు.
మాటలు దీపాల్ని వెలిగిస్తాయ్
చర్చలు అగ్నుల్ని రగిలిస్తాయ్
ఇప్పుడు కూడా పరిగెత్తడం ఖాయం
కానీ మనమంతా కలిసి
దిగులుగా కాదు,
ఉత్సాహంగా.
ఇప్పుడు నన్ను చూసి
రూపాయిలోని సింహం తోకముడుచుకుంది
అధర్మచక్రం కదలటం మానేసింది.
ఇప్పుడు
నా చేతుల్లో
పగిలిముక్కలయ్యేందుకు గీతం లేదు
అదిప్పుడు మా అందరి గొంతుల్లోనూ
పుష్పిస్తుంది !



శ్రీ తురగా కృష్ణమూర్తి

# చాళుక్య రాజరాజనరేంద్ర వీరవిజయాదిత్యుల సంతతి

1981వ సం॥ ఫిబ్రవరి నెల "భారతి"లో శ్రీ కొల్లూరు సూర్యనారాయణగారు దక్షారామ భీమేశ్వరాలయమున నున్న సోమలదేవి పద్య శాసనమును పరామర్శింపుచు "ఇతః పూర్వము కీ॥ శే॥ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు, వారి ననుసరించి కీ॥ శే॥ భావరాజు వారును ఆశాసన మొసంగిన సోమలదేవి, రేవలదేవికిని రాజరాజనరేంద్రునకు బుట్టినకుమార్తెయని నిర్ధరించిరి. కీ॥ శే॥ శ్రీ భావరాజువారు తర్వాత తమ అభిప్రాయమును మార్చుకొని, సోమలదేవి వీర విజయాదిత్యుని కుమార్తె యని గుర్తించిరి. శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారుకూడ రేవలదేవి విజయాదిత్యుని భార్యయను విషయమును స్పష్టపరచిరి అని వ్రాయుచు సోమలదేవి విష్ణువర్ధన విజయాదిత్యుని చిన్నభార్యయైన రేవలదేవి పుత్రిక అనుట స్పష్టమని సాయించిరి. ఈ చారిత్రక సత్యమెన్నడో సిద్ధాంతీకరింపబడియుండ శ్రీ సూర్యనారాయణగారీ సమస్యను మరల నెందులకు లేవనెత్తవలసివచ్చెనో తెలియరాదు. అయితే వారు తమ వ్యాసాంతమున వెల్లడించిన ఒక అభిప్రాయము మాత్ర మీ సమస్యను పునః పరిశీలన కెందులకై యుద్దేశింప బడినదో విశదము చేయుచున్నది. శ్రీ ముసునూరి సాంబశివరామ మూర్తిగారు రామచంద్రపురంలో జరిగిన ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెసు రెండవ వార్షిక సమావేశములో చదివిన "మఱుగువడిన విజయాదిత్య వంశము - తూర్పు చాళుక్య అంతర్గతము" అన్న వ్యాసమే వారి నీ రచనకు పురికొల్పి యుండవలెనని తోచుచున్నది.

శ్రీ ముసునూరి వారి సిద్ధాంత సాధనకు పునాది సోమలదేవి తల్లి రేవలదేవి. శ్రీకూర్మములోని చాళుక్య వంశమును వేంగి రాజరాజ విష్ణువర్ధనునితో ముడివెట్టుట కుపయోగింపబడినదే ఈ రేవలదేవి రాజరాజునకు రెండవభార్య అన్నవాదము. ఈవాదమును పురస్కరించుకొనియే వారు రాజరాజునకు అమ్మంగదేవి వలన రాజేంద్రచోళుడు (కులోత్తుంగ చోళుడు) అను కుమారుడు, కుంద వాంబ అను కుమార్తెయు కల్గిరనియు, రెండవభార్యయైన రేవలదేవి లన విజయాదిత్యుడనుకుమారుడు, సోమలదేవియను కుమార్తెయు కల్గిరనియు, ఈ విజయాదిత్యుని వంశమువారే శ్రీకూర్మములోని శాసనములలో ప్రసక్తింపబడిన చాళుక్యవంశమని తమసిద్ధాంతములో ప్రతిపాదించినారు. ఈ ప్రతిపాదనము రేవలదేవి, రాజరాజునకు రెండవభార్యయగు నెడలనే సమర్థనీయమగును; గాన - శ్రీ ముసునూరివారు తమ వాదనా పటిమతో నద్దానిని ధృవపరుపయత్నించిరి. అది శ్రీ సూర్యనారాయణగారికి నిరాధారమగు యూహగాతోచి, సోమలదేవి దక్షారామ శాసనమునుబట్టి రేవలదేవి విజయాదిత్యుని రెండవభార్యగా నిరూపింప శ్రమపడిరి :

అంతవరకు బాగుగానే యున్నది. శ్రీ ముసునూరి వారి ప్రతిపాదన ఆధారరహితమని, ఊహాజనితమని హేలగాకొట్టివేసిన శ్రీ సూర్యనారాయణగారు ఇంకొక అడుగు ముందునకువైచి, చాళుక్య రాజరాజ, విజయాదిత్య నరేంద్రుల సంతతి గూర్చికూలంకషముగా చర్చించియున్న సమంజసముగా నుండి యుండెడిది. ఆ పొంతబోక వారు సోమలదేవి విజయాదిత్యుని కూతురని మాత్రము రుజువు చేయ యత్నించి, సనామధేయయగు మరొక "సోమలదేవి" ప్రసక్తి దెచ్చి, వారి కుటుంబ వివరముల నిచ్చుటకు శ్రమపడిరి.

సోమలదేవి దక్షారామభీమేశ్వరాలయములోనిల్పిన శాసనము క్రీ॥ శ॥ 1065 నాటిది. అప్పటికి రాజరాజ నరేంద్రుడు చనిపోయి నాల్గుసంవత్సరములైనది. వీరవిజయాదిత్యుడు క్రీ॥ శ॥ 1061వ సంవత్సరములో రాజరాజు మరణించిన వెంటనే వేంగిసింహాసన మాక్రమించి ఇమ్మడిశక్తివర్మనభిషేకించి, వేంగీశ్వరునిగావించెను.

ఇమ్మడిశక్తివర్మ క్రీ॥ శ॥ 1062లో అనగా రాజరాజు చనిపోయిన పరుచటి సంవత్సరములోనే కాలగతినందెను. జనసంప్రార్థనమున ధర్మబుద్ధితో వీరవిజయాదిత్యుడు వేంగిసింహాసనమధిష్ఠించి పాలింప సాగెను. అప్పటికి రాజరాజకుమారుడు రాజేంద్రచోళుడు చక్రకొట్యమండలములో యుద్ధ నిమగ్నుడై తిరుగుబాటొనరించిన సామంతుల నణచ ప్రయత్నించుచుండెను. రాజేంద్రచోళుడు యుద్ధ విజయియై వేంగికి మరలివచ్చి పితృవ్యుని దుశ్చేష్టకు కినిసినను, వానినుండి వేంగీ సింహాసనమును స్వాధీనము చేసికొన సమర్థుడయ్యు, చోళదేశమున నాడు నెలకొనియున్న రాజకీయకల్లోల పరిస్థితులలో తాను మాతామహార్జితమగు చోళరాజ్య మ్ముద్ధరింప పట్టుదల వహించి దక్షిణమున కేగుచు పినతండ్రిని వేంగీశ్వరునిగా నంగీకరించి అతని ప్రేమాభిమానములకు పాత్రుడాయెను. రాజరాజునకింకొక కుమారుడే (శ్రీ మునునూరి వారి వాదన ప్రకారం విజయాదిత్యనామ్నుడు) యుండియున్నచో కుళోత్తుంగ చోళుడట్లు గావించి యుండెడివాడా ? కుళోత్తుంగుడు మాతామహార్జితగు చోళరాజ్య మనుభవింపయేగినను, పిత్రార్జితమగు వేంగీరాజ్యము నాక్రమింప ఈ విజయాదిత్యనామ్నుడు ప్రయత్నించియుండెడు వాడు కాడా ? అట్టి సంఘటన మేదియు జరిగి యుండినట్లు చారిత్రకాధారములు లేవు.

వీరవిజయాదిత్యుడు వేంగిని పాలించుచు వృద్ధాప్యములో మరొక కుమారుని గాంచెను. ఆతనిపై యెన్నియో ఆశలుంచుకొని విజయాదిత్యుడు అతని భావివేంగీశ్వరునిగా నభిషేకింప నెన్నో కలలుగాంచెను ; కాని - విధివైపరీత్యమువలన నాతడు తీవ్ర అనారోగ్యమునకు గురియాయెను. అతని స్వస్థతకై విజయాదిత్యుడు తీవ్రాందోళనకు పాల్పడి, అతని ఆయురారోగ్యాభి వృద్ధినిగోరి పంపిన భట్టోపాధ్యాయుడను సర్వశాస్త్రవేదికి మావిడ్డేరు, క్రుందుడి యను రెండు గ్రామముల సర్వకరపరిహారముగా, "సర్వసమస్య"గా ధారవోసెను. ఈ దాన వృత్తాంతము విజయాదిత్యుని ర్యాలి శాసనములవలన దెలియనగును. అందు విజయాదిత్యుడు తన్ను కవి యుధిష్ఠిరునిగా వర్ణించుకొని, గుద్దవాడి విషయ నివాసులగు రాష్ట్రకూట ప్రముఖ కుటుంబినుల సమావేశపరచి మంత్రి, పురోహిత, సేనాపతి, <u>యువరాజు</u>, దేవారిక సమక్షమున "తన సంతాన బలాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం" దానమిచ్చుచున్నట్లు

ల్లేఖింపబడినది. అది 1072 వ సంవత్సరమున జరిగినది. అప్పటికి యువరాజు (పేరు తెలియదు) సజీవుడయ్యే యున్నాడు. "సర్వ సమస్య" యనుటవలన దానములు విజయాదిత్యుని సంతానము జీవించుటకొరక సవనము (యాగము) చేయుట కొసగబడినట్లు తోచును.

ఎన్ని సవనములు చేసినను కవియుధిష్ఠిరుని యభిలాష ఫలించలేదు. విజయాదిత్యుని రెండవ కుమారుడు కూడ తండ్రి ఆశలెల్ల వమ్ముచేసి దివంగతుడయ్యెను. తుదకు విజయాదిత్యుడు పుత్రహీనుడయ్యెను.

ఈపైన పేర్కొన్న విషయములవలన తేలిన సారాంశమే మన - రాజరాజ నరేంద్రుని మరణముతో రాజేంద్ర చోళునకు దక్కవలసిన వేంగిసింహాసనము రాజరాజు సవతి సోదరుని పాల బడినదని, రాజేంద్ర చోళుడు పినతండ్రి యెడలగల గౌరవ ప్రపత్తిచే వేంగిసింహాసనము నాతనికి వదలి తాను మాతామహార్జిత మగు చోళరాజ్యసింహాసన మాక్రమింప దక్షిణమున కేగెననియు శ్రీ మునునూరివారి ప్రతిపాదనమే నిక్కమైన, రాజేంద్ర చోళుడాతని మాతామహార్జిత సామ్రాజ్యమగు చోళరాజ్యమును గైవస మొనరించికొన దక్షిణాది కరిగినను, తమ్ముడు ఒకడుండియుండిన (శ్రీ మునునూరి వారి ఊహ ప్రకారము విజయాదిత్యనామ్నుడు) వేంగిసింహాసనమునకాతని అభిషేకించి యుండి యుండుననియు ఒకవేళ వీరవిజయాదిత్యు డాయత్నమున కవరోధము కల్పింప దాయాది కలహము రేపియుండిన ఇరువాగుల మధ్య యుద్ధము ప్రజ్వరిల్లియుండి యుండవలెననియు అట్టిది జరిగినటు లెట్టి యాధారములు లేనందున శ్రీ మునునూరి వారి యూహ అర్థరహితమై, రాజరాజునకు రేవలదేవి వలన మరొక కుమారుడుద్భవించెననుట అబద్ధమని తెలుచున్నది. క్రీ॥ శ॥ 1076 లో విజయాదిత్యుడు వారసులు లేక మరణించుటచే కుళోత్తుంగ చోళుడు వేంగి రాజ్యపాలనమును వహించెను.

ఈపై కారణములవలన పూర్వ చాళుక్య వంశమున నాఖరి తరమువారైన రాజరాజ నరేంద్ర వీరవిజయాదిత్య భూపతుల తర్వాత వేంగి సింహాసనమెక్క పూర్వ చాళుక్య వంశజులైన వారసులు లేకుండబోయిరని స్పష్టమగుచున్నది. ఉన్న రాజరాజ

సుతుడు కుళోత్తుంగుడు చోళవంశపు వాడుగనే పరిగణింపబడినాడు. అతడు పూర్వ చాళుక్యాభిమానమును, అభిజాత్యమును గూడ వహింపక. చోళునిగనే వ్యవహరించినాడు.

ఏ విధిని జూచినను రాజరాజునకిర్వురు సుతులున్నట్లు రూఢి యగుటలేదు : ఉండిన – ఒకరికిమించి యెక్కు-వమంది భార్యలుండి యుండవచ్చును. అది ప్రభువుల ధర్మము. అట్లయినను – రేవలదేవి రాజరాజు రెండవ భార్యయని నిరూపింప జూచుట కుండేటి కొమ్ము సాధింప జూచుటయే :

ఇక రాజరాజుకుమార్తె కుందవాంబ, వీరవిజయాదిత్యుని కుమార్తె సోమలదేవుల వృత్తాంతపరయవలసియున్నది. తమిళ చారిత్రక గ్రంథములలో నేమున్నదోగాని కుందవాంబను గురించి యెట్టి విశేషములున్ను ఆంధ్రభూమిపై వినరాదు. కాని – సోమల దేవినిగూర్చి కొంత సమాచారమందు చున్నది.

సోమలదేవి ప్రశంసలు కొన్ని కొన్ని శాసనములలోగాన వచ్చుచున్నవి. ఆ శాసనములలో నుదహరింపబడిన వారలు రేవల దేవీ తనూజలా ? అని పరిశీలింప వలసియున్నది.

శా॥ శ॥ 1030 నాటి ఒక ముఖలింగ శాసనమున సోమలదేవి నామధేయ "గుణధామ సోమల మహాదేవీ మనో మానసహంసీయా త్రికలింగ మణ్డలపతేః శ్రీగంగ్గ చూడామణే" అని చోడ గంగుని "మనోమానసహంసి"గా వర్ణింపబడినది. (చూ– ద. హిం. శా V 1012.) ఈ శాసనమునుం డీమెను గూర్చి యితర వివరములు తెలియరావు. ఈ శాసనమును గూర్చి వివరణ నిచ్చిన డాక్టరు సి. వి. రామచంద్రరావుగారు "బహుశః చోడ గంగుని భార్య సోమలదేవి, రాజరాజనరేంద్రుని పుత్రిక సోమలదేవి (?) మనుమరాలై ఉండ వచ్చు"నని యూహించిరి : ఇది అసంగతమైన యూహ యని వేరుగా చెప్పనవసరము లేదు. ఏలనన – పూర్వ చాళుక్య ప్రభువు రాజరాజునకు సోమలదేవి యను పుత్రిక లేనేలేదని ఇంతకుముందే సహేతుకముగా నిర్ధరింపబడినది గాన. కావున చోడ గంగుని భార్య సోమలదేవి రాజరాజు కూతురు గాదు. మనుమరాలును గాదు. అనంతవర్మ చోడ గంగుని మునిమనుమడైన అనియంకభీమ III భార్య సోమలదేవి నామధేయ ఒకతె గలదు. ఆమె విషయమున గూడ డి. సి. సర్కా-రుగా రిట్టి అభిప్రాయమునే వెలిబుచ్చిరి : అదియు నసంగత విషయమని వేరుగా జెప్పబనిలేదు.

ఇక వీరవిజయాదిత్యుని కూతురు సోమలదేవిని గురించి వివారించవలసి యున్నది. రాజరాజ సుత కుందవాంబను గురించిన విషయము లేమియు నెరుగరాలేదని చెప్పియుంటిని. కాని – సోమలదేవి విషయమై అట్లు గాదు.

పెద కోమటి వేమభూపాల, మామిడి సింగనామాత్యుల గురువు "గురుశంకరమౌని"కృత గీర్వాణానువాద బసవపురాణము నకు "గురుపాదాఖ్యదేవు"డను నాతడు క్రీ॥ శ॥ 1592 లో కర్ణాట భాషలో టీకను వ్రాసి, దానికి "సర్వార్థదాయిని"యను నామమిడెను. ఈ గురుదేవుడు ద్రాక్షారామములోని కోటిపల్యారాధ్యదేవుని వంశములోని వాడని టీకా ప్రారంభమున చెప్పబడినది. దానినిబట్టి అతని వంశక్రమ మిట్లున్నది :—



ఈ కోటిఫలి ఆరాధ్యుల గురించి "పంచ బ్రహ్మోదయ భాష్య"మను సంస్కృత గ్రంథమున నిట్లుగలదు.

తద్ధి భూలోక పద్యేషు రేణుకాచార్య కోవిదః
ద్వాదశాబ్దం జరత్క్రాంచ పండిత ప్రవరాత్మజా॥
పురా కైలాసవ్యానోక్త ప్రసాద క్రమవర్తనే
రేవణారాధ్యః శ్రీ వీరశైవరత్న ప్రకాశకః॥
త్రిలింగదే కామ్యార్థం పురీశే రాజమందిరే
సోమలాదేవి వైవాహం కృతం శాస్త్రోక్త సమ్మతం॥
దంపత్యాశ్రమ సంయుక్తో వత్సర త్రీనో సమాచరతే
సోమలాగర్భ కంజేతు కోటిపల్లార్య యుద్ భవః॥

(త్రిలింగ దేశములోని రాజమహేంద్రవరమున సోమలా దేవి యను నామెను రేవణారాధ్యుడు శాస్త్రోక్త సమ్మతముగా వివాహమాడి, మూడు సంవత్సరములు దాంపత్య జీవితమును గడపగా, వారిరువురకు కోటిఫల్యా రాధ్యులు పుట్టిరి)

మల్లికార్జున పండితారాధ్యులకు దీక్ష నిచ్చిన దీక్షా గురువులును కోటిఫల్యారాధ్యులేయని పై గురుదేవకవియేగాక పాల్కురికి సోమనాథుడును చెప్పియున్నాడు.

.... .... .... దుర్వార సంసార
దూర వీర వ్రతోద్ధుర వర్తనుండు
* * * * *
* * * * *
పండితనతపాదపద్ముండు, సుకవి
మండలి విబుధ సమాజ పూజితుండు
ఆరూఢకీర్తిశుడగు కోటిపల్లి
యారాధ్యులనగ లోకారాధ్యమూర్తి (పండితారాధ్యచరిత్ర)

మల్లిఖార్జున పండితారాధ్యుల జన్మ వృత్తాంత మిట్లున్నది :-

.... .... వేంగి మహోర్వీ స్థలమున
ననమానలీల దక్షారామ మొప్పు
నప్పురంబున సముద్యన్మహామహిమ
నొప్పు శ్రీ భీమేశ్వరోరులింగంబు
రూఢిఁ దద్దేవు పురోహిత శ్రేష్ఠుఁ
డేడిత విద్వన్మహిష్ఠుండు వీర
భక్తిసత్తముడు సద్బ్రాహ్మణోత్తముఁడు
వ్యక్త వానసవంశ వర్ధనకరుడు
వాత్రుండు భీమన పండితేంద్రుండు
* * * *
జనియించె భీమాఖ్యసాధ్వి గౌరాంబ
జఠరంబున .... .... ....

మల్లిఖార్జున పండితారాధ్య లుద్భవించినట్లు చెప్పబడినది.

ఈ విధిని దక్షారామము, కోటిఫలి వేంగిస్థలి, రాజమహేంద్రవరములు ఆవాసములుగల బ్రహ్మక్షత్రియ వంశోద్భవుల మధ్య వైవాహిక విధులు జరిగినవన్న అందాశ్చర్య పడవలసినదిలేదు ; అట్టిది సుసంభవమని చెప్పుటకు కూడ సందేహింప బనిలేదు.

మల్లిఖార్జున పండితారాధ్యులు క్రీ॥ శ॥ 1130లో జన్మించి 55 ఏండ్లు జీవించి క్రీ॥ శ॥ 1185 లో మరణించి యుండవచ్చునని శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగారు సిద్ధాంతీకరించిరి. కనుక కోటిపల్లారాధ్యులు క్రీ॥ శ॥ 1080-1150 మధ్యకాలమున దక్షారామ సమీపస్థ కోటిఫలిగ్రామములో యుండి యుందురు. ఆ కాలమున రాజరాజు మనుమలు కుళోత్తుంగ చోళుని పుత్రులు వీరచోడ విక్రమచోళులు వేంగీశ్వరులుగా నున్నారు.

పంచ బ్రహ్మోదయ భాష్యవక్కాణమునుబట్టి కోటిపల్లారాధ్యులు, రేవణారాధ్యులకు సోమలదేవికి నుద్భవించిన వాడని తేలినది. అయితే ఈ సోమలదేవి యెవరు ?

వీరవిజయాదిత్యునకు రేవలదేవివలన కల్గిన సోమలదేవియే ఈ సోమలదేవియై యుండవలెను. ఏలనన - పైన ఉదహరించిన శ్లోకములలో రేవణారాధ్యులు త్రిలింగదేశములోని రాజమహేంద్రవరమునకు చెందిన సోమలదేవిని శాస్త్రోక్తముగా పెండ్లియాడి, దాంపత్య జీవనము నడపెనని, తత్ఫలముగ వారికి కోటిపల్లారాధ్యులు జనించిరని చెప్పబడినది. కోటిపల్లారాధ్యుల కాలము క్రీ॥ శ॥ 1080-1150 సంవత్సరములు. అప్పటికి రాజమహేంద్రవరమున రాజ్యము చేయుచున్నది రాజరాజు వంశస్థులు. అనగా వీరవిజయాదిత్యుని కుటుంబముకూడ రాజాంతఃపురవాసము చేయుచున్నట్లేగదా ! వీరవిజయాదిత్యుని కూతురు సోమలదేవి దక్షారామ

భీమేశ్వరునకు దాన మొనర్చినది క్రీ॥ శ॥ 1065వ సంవత్సరమున. అప్పటికి వీరవిజయాదిత్యుడు వేంగీపాలనమును సాగించుచున్నాడు. ఆ నాటికి సోమలదేవికి యుక్తవయసువచ్చి యుండవలెను. లేకున్న స్వతంత్రించి స్వామికి దానమిచ్చి శాసనము వ్రాయించియుండదు; కావున ఆ సంవత్సరమున కామెకు కనీసము 15 యేండ్ల వయసున్నదని యనుకొన్న ఆమె క్రీ॥ శ॥ 1050లో జనించియుండవలెను. కోటిపల్లారాధ్యులు క్రీ॥ శ॥ 1080 సంవత్సరమున పుట్టిన, అప్పటికి సోమలదేవికి 30 సంవత్సరముల ప్రాయ ముండవలెను. రేవణారాధ్యులు సోమలదేవితో 3 సంవత్సరములు దాంపత్య జీవితము నెరపిరన్న క్రీ॥ శ॥ 1076-77వ సంవత్సరమున నామె వివాహము జరిగియుండవలెను. అయినచో వీర విజయాదిత్యుని మరణమునకు ముందుగానే ఈ వివాహము జరిగినదని యనుకొనవలసి యున్నది. ఈ వత్సర సమన్వయము, సోమలదేవి, రేవణారాధ్యుల సమకాలీనత, ఆవాసముల సన్నిహితత్వము ఈ యూహ సేతకు యెడమిచ్చినవి.

సోమలదేవి వివాహము స్వజాతీయుడైన క్షత్రియ యువకునితోగాక నొక శైవమతాచార్యునితో జరుగుట ఆశ్చర్యజనకమే ; అయినను అట్టిది శాస్త్రసమ్మతమని, నిషిద్ధము గాదని మాత్రము చెప్పవచ్చును.

ఇట్టి వైవాహిక విధులు రాజలోకమున క్రొత్తలు గావు. అన్వయాభివృద్ధికి భూసురోత్తములు క్షత్రియ రాజకన్యలయందు ధర్మవిధి సంతతిని నిలుపు ఆచారముండినది. చాలుక్యవంశ సంజాతులను కులబ్రాహ్మణులకిచ్చి, వారివలన కలిగిన సంతతితో చాలుక్యవంశము నిలుపను, సంబంధ బాంధవ్యములను గలుపుకొను టాచారముగ నుండినటుల కీ॥ శే॥ శ్రీ భావరాజు వారు తమ గ్రంథములో నొకచోట వెల్లడించి యున్నారు (చూ - రాజరాజ నరేంద్రుడు - P. 144) ఈ సాంప్రదాయానుసారము విజయాదిత్యుడు తన అన్వయాభివృద్ధినిగోరి సోమలదేవిని రేవణారాధ్యుల కిచ్చి (ఈతడు రాజరాజునకు నన్నయవలెనే వీరవిజయాదిత్యునకు కుల బ్రాహ్మణుడై యుండియుండును) వివాహము చేసియుండును. ఇప్పట్టునగూడ నా కవియుధిష్ఠిరునకు విధి యెదురు తిరిగెను. సోమలదేవి వివాహమైన తర్వాత అనతికాలములోనే అనగా సంవత్సరమైన గడువకుండగనే వీర విజయాదిత్యుడు పరమ పదించెను. అతని మరణానంతరము మూడు సంవత్సరములకుగాని అనగా క్రీ॥ శ॥ 1079-80వ సంవత్సర ప్రాంతములగాని సోమల దేవి పుత్రవంతురాలుగా లేదు ;

అప్పటి రాజకీయ పరిస్థితులు కోటిపల్లారాధ్యుని మాతామహార్జితమగు వేంగీరాజ్యమునకు పట్టాభిషిక్తునిజేయలేకపోయెను. కాని - పితార్జితమగు శైవమత సామ్రాజ్యమునకు మాత్రము వారసునిగజేయ గల్గినవి. ఈ విధినివేంగీచాళుక్యుల తుది తరము వారైన రాజరాజు సంతతి వారు చోళులుగను, అతని సోదరుడు వీరవిజయాదిత్యుని సంతతి శైవమత పీఠాధిపతులుగను మారిపోయి యెవరి అధికార పరిధిలో వారు యశోవిరాజితులైరి.

ఈవ్యాస రచనలో శ్రీ ఎస్. ఎస్. సుందరేశ్వరరావుగారి "సంస్కృత బసవపురాణము - విశేషములు" అన్న వ్యాసము తోడ్పడినది. వారికి నానాకృతజ్ఞతలు.



# మానవులు : మధ్యాక్కఱలు

శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి

కోటానఁగోట్ల జీవముల ప్రోవులోఁ గున్కిపాట్లు గొని
యోటాఱు దుర్గముల్ నెట్టుకొనివచ్చి యుదయోజ్జ్వలముగ
నేఁటి కిచ్చటఁ జేరఁ గంటె? దళసరి నివు రూఁదికొంటి
వోటు! మానవ నవ శిశువ! ప్రేమ పయోరాశి వీవ.

అచరంబుల విరుద్ధచేతనస్థితి నణఁగారియుండి
ప్రచుర ముద్భిదములఁ బశులఁ బక్షుల స్పందానుభూతి
రుచిరమైన చిదంశ మొకఁడు నీలో నిరూఢిమైఁ బ్రజ్ఞ
పచరించుఁ; బ్రేమ నెచరించు; మానవార్భక! నిర్భరుఁడవు.

కడుపుపట్టిన తిండితినుట నిద్దురఁ గన్నారఁ గనుట
కడు విహారముసేఁత యనెడి కమనీయ కార్యక్రమంబు
చెడక సాగించుట సర్వజీవుల చేతనైనదియ;
గడుసుందనము నీది పరమ పురుషార్థ గణన వెల్గొందు.

'మానుషాద్దైవ్యముపైమి' యన్న యామ్నాయంపువాణి
తానుగా నీ పాలబుగ్గ వెల్వడి ధ్వనిత మ్మొనర్చు;
కాకనకన్న నీకాన్పు కమ్రరేఖా సుంగధిలము;
మానిసి నిసువ! మా యొడికి వచ్చితె! మనసుపండువుగ.

అమృతలోక విహార చణము భావన నమరించుకొంటి
వమరుల చెల్మి చిన్కులను జిత్తడి యయ్యె నీ గుండె;
కొమరారు నన్యోన్యభావమది మీది కూలంకషమ్ము;
సుమనోరమ మనుష్యయువక! సంస్కార సుందరుం డవుదు.

అసురభావము రేఁగినపుడు ఱొమ్మూఁది యవ్వలఁ ద్రోసి
నిసిమంటి బ్రతుకుకాక, యల చైతన్య నీరధి డాసి
మిసిమిమై మింటికి నెగయు మేల్చూపు మెఱుపులు వెఱపు
పస నీకు సహజంబు; మనుజ యువరాజ! భద్రమ్ము నీకు.

మున్ను గోపాలబాలునిపయి న్నేరముల్ సెప్పఁగ విని
యన్నది తనముద్దుఁగొమరు గుండెకు నద్దుకొం చపుడు
"మన్నెల! మఱి పదార్థము లేదె" యన్మాట యశోద;
యన్న! మానవశిశూ! మన్ను తిను జీవి వవుదువో? కావు.

సకలమౌ తత్త్వమ్ము తాను రాముండు సాధుమూర్తి తను
సుకము శోకము నిన్నుఁ గలసి యనుభవించునఁటె! చోద్యమ్ము!
ప్రకటితం బగు టిష్టపడక నీలోనఁ బరమపూరుషుఁడు
చకితుఁ డౌనొ! మనుష్యశిశువ! చరితార్థ జన్ముండ వీవు.

వేలకొలఁది యుగమ్ములను సృష్ట్యాది వెడలఁ జూచితివి
చాలఁగాలము స్వాదువులును జేఁదులు చవిచూచినాఁడ
వేలా! ప్రబోధింప ;దుర్మతుల నెంద ఔెందఅనేని
వ్రాలి తూలించు నక్షయ యశఃప్రభవమ్ము నీ సొమ్ము.

ఎల్ల భూతముల తియ్యమును వాంఛించు నే దయాపరుఁడు
ఎల్ల జీవముల నెయ్యమ్ముఁ గాంక్షించు నే క్షమారాశి
ఎల్ల లోకమ్ముల శాంతిఁ దలపోయు నే మానవుండు
తల్లిదేశము వాని కిది సదా మధూదయ కల్పవల్లి.

---

# మౌనం నుంచి వెలుగుకు

## శ్రీ సుంకిరెడ్డి నారాయణరెడ్డి

మౌనంగా ఉన్నపుడు చూడు,
చెలరేగిపోయే అంత పెద్దచెట్టు సైతం
సంతానంలేని వృక్షంలా
నిస్తేజంగా నిశ్చైతన్యంగా
నిలబడే ఉంటుంది!

మౌనంగా ఉన్నపుడుచూడు,
అంతగా చైతన్యాన్ని గుప్పించే మేఘాలుసైతం
నీటిమీద తేలే ఇసుకతెప్పల్లా
నిర్వీర్యంగా నిరుపయోగంగా
కరిగిపోతుంటాయి!!



మౌనంగా ఉన్నపుడుచూడు
పర్వతాలు పర్వతాలుగా ఎగిరిపడే సముద్రం సైతం
అంతా ఓ పిల్లాడై
అమాయకంగా తీరంతో
ఆడుకుంటుంది.

మౌనం కొన్నిసార్లు అందంగా ఉండొచ్చు
మౌనం కొన్నిసార్లు అమాయకంగా ఉండొచ్చు
మౌనం కొన్నిసార్లు గంభీరంగా ఉండొచ్చు
కాని, మౌనం మౌనమే

మౌనంగా ఉన్నమనిషి
భుజాలులేని తుపాకీఅయి నిరుపయోగమవుతాడు.

# ఈ రాత్రి

## డాక్టర్ ఐ. వి. యల్. నరసింహారావు

ఎంతకు తెల్లవార దిదియేమి ? తమస్సులు గుండెకోనలో
ఇంత ఘనీభవించె నని యిప్పు డెరింగితి గుడ్లగూబలై
బంతులుదీరి కోరికలు 'బల్బుల'వోలె వెలుంగుచుండె ; నా
చెంతకు చేరు ప్రేయసి యిసీ కనిపింపదు కాళరాత్రిలో.

ఈ రాత్రి 'కేబరే' నృత్యహేలాగతి - నర్తకి పొట్టకక్కుర్తి గుర్తు
ఈ రాత్రి కైపులో ఇంటికేగని భోగి - ఇల్లాలి కన్నీటివెల్లి గుర్తు
ఈ రాత్రి హత్యగావించబడ్డ గృహస్థు - కడలుకొన్న అరాజకమ్ము గుర్తు
పురవీధి నీ రాత్రి చెరచబడ్డ లతాంగి - అజ్ఞాతమగు ఆత్మహత్య గుర్తు
గుర్తు దొరకని రక్కెస కోరికలకు నిలువున బలైన బడుగు ప్రాణులను తట్టి
లేపి, ఒడిలోన చేర్చి లాలించు నిట్టి రాత్రి నెటుపిల్తు పటు కళరాత్రి యంచు.

ఈ రాత్రి భువనమోహిని వోలె చెలరేగి కందోయి కడు బైర్లు క్రమ్మజేసె
ఈ రాత్రి పసిపాప కేరింతలల్లు నందడి రేపి రగిలించె కడుపుతీపి
ఈ రాత్రి మాతృదేవీరాగ మటు చింది కూర్మి పయోధార గొంతుతడిపె
ఈ రాత్రి పరమజాగృతినొందు సంయమి పోల్కి చిన్ముద్రలో ముంచితేల్చె
లౌకికాలౌకికానుభవాకులమగు నా యెడంద నంతర్మథనమ్ము సాగ
వెలుగు చీకట్లుగా దోచు వెట్టిబ్రతుకు కాళరాత్రిగ సుఖదుఃఖకేళి వడుపు.

సుఖదుఃఖానుభవమ్ము లన్నవి మనస్సున్ బట్టి సాగున్ ; ముఖా
ముఖి పోటీపడి సౌఖ్యముల్ గెలిచినన్ మూణ్ణాళ్ళ ముచ్చట్లె యౌ;
అఖిలైశ్వర్యము లున్నవాడయిన దుఃఖాక్రాంతుడై కుందడే ?
నిఖిలార్తిం బడియున్ సుఖాత్ముడగు నిర్నిద్రున్ మదిన్ మెచ్చెదన్.



మళయాళీ మూలం : శ్రీ ఎస్. కె. పొట్టెక్కాట్ అనువాదం : శ్రీ బి. ఏ. రమణ

# పాత బాకీ

ఆఫ్రికాకు చెందిన కంపాలాలోని ఒక పెద్దదూది మిల్లు యజమానీ, లక్షాధికారీ అయిన మిష్టర్ వాట్సన్ నాకు వినిపించిన కథను నేను నా ఆఫ్రికన్ డైరీలో వ్రాసుకొన్నాను. (మిష్టర్ వాట్సన్ మళయాళీ. ఆఫ్రికా వెళ్ళిన తరువాత ఆ పేరు పెట్టుకొన్నాడు. అతని అసలుపేరు ఎవరికీ తెలియదు.) ఈ మధ్య నాదృష్టి దానిమీదకు మళ్ళింది. ఒకొక్కప్పుడు యదార్థగాథలు కూడా కట్టుకథలుకన్న విచిత్రంగా కనిపిస్తాయి. నిజానికి అది అద్భుతమైనవ్యక్తి అనదగ్గ మిస్టర్ వాట్సన్ జీవితానికి సంబంధించిన రహస్యం. ఈ కథ నూటికి నూరుపాళ్లూ నిజమేనని నా నమ్మకం. ఎందుచేతనంటే నాతో కట్టుకథను చెప్పవలసిన అవసరం అతనికి లేదు. కేరళలోని తన జన్మస్థలంపేరుగానీ, ఈ కథలోని పాత్రలపేర్లుగానీ, అతను నాకు చెప్పలేదు. తన కేరళ మిత్రుడు కంపాలాలోగానీ, ఉగాండాలోగానీ, ఈ కథ ఎవ్వరికీ చెప్పడని బహుశా అతనినమ్మకం కావచ్చును. ఒకవేళ కేరళవెళ్ళిన తరువాత ఈవృత్తాంతం, నవలగాగానీ, కథగాగానీవ్రాస్తే అతనికి అభ్యంతరం లేదు.

ఈ కథను నేను ఇప్పుడు ఎందుకు చెప్పవలసి వచ్చిందో వివరిస్తాను.

ఉగాండా మాజీ అధ్యక్షుడు జనరల్ ఇద్ది అమీన్‌చేత దేశంనుండి తరిమివేయబడ్డ మళయాళీలను ఈ మధ్య నేను కలుసుకొన్నాను. కంపాలాలోని పాతమిత్రులను గురించి వారిని అడిగేటప్పుడు మిష్టర్ వాట్సన్‌ను గురించి చెప్పమని అడిగాను. వాళ్లు మిష్టర్ వాట్సన్ నాలుగైదు సంవత్సరాల క్రిందటే తుపాకీతో కాల్చుకొని ఆత్మహత్య చేసుకొన్నాడని చెప్పారు. దీనికి కారణం ఎవ్వరికీ తెలియలేదు. అందుచేత అసాధారణమైనవ్యక్తి మిష్టర్ వాట్సన్ జ్ఞాపకార్థం ఈ కథ వ్రాస్తున్నాను.

కంపాలా పట్టణం సమీపంలో బుగాద్‌రాజా కుట్టిక్కోరామ్ రాజభవనానికి సమీపంలో ఒక కొండవుంది. మిష్టర్ వాట్సన్ అక్కడ పక్షులను వేటాడుతుండేవాడు. అక్కడవున్న ఒక గుడిసెలో ఒకనాటి రాత్రి అతను ఈ కథను నాకు వినిపించాడు.

చలిఎక్కువగా వుంది. ఎదురుగా విస్కీబోటిల్, ప్రాన్స్ ఫ్రై వున్నాయి. కొంతదూరంనుంచి ఆఫ్రికన్ గోమా నృత్యంతాలూకూ వాద్యాలు వినవస్తున్నాయి. మేము మాట్లాడడం ప్రారంభించాము. నేను నా డైరీ, జ్ఞాపకాలు; వాటి సహాయంతో వాట్సన్ చెప్పిన సంఘటనలను ఇక్కడ యథాతథంగా వ్రాస్తున్నాను.

ఆమె ఆ ప్రాంతానికి చెందిన సంపన్నుడైన ఒక కాంట్రాక్టరు ఇంట్లో పనిమనిషి. అసలు ఆమె ఒక మధ్య తరగతి కుటుంబంలో పుట్టింది. కాలం తెచ్చిన మార్పులవల్ల వున్నదంతా హరించుకుపోయి, పొట్టకూటికోసం తప్పనిసరిగా పనిమనిషిగా మారవలసివచ్చింది. ఆమెకు పద్దెనిమిదేళ్ళ కూతురువుంది.

కాంట్రాక్టరు ఆ ప్రాంతానికి చెందిన ఒక మంచికుటుంబంలో పుట్టాడు. అతని పాతవిరోధి ఒకడు తన పాతబాకీ చెల్లించలేదని కోర్టులో దావావేసాడు. కాంట్రాక్టరును ఏదోవిధంగా జైలుకు పంపాలని అతని పట్టుదల. తీర్పు అతనికిఅనుకూలంగానే వచ్చింది. ఈ అవకాశంరాగానే అతను కాంట్రాక్టరుకు అరెస్టు వారెంటు పంపాడు.ఈ రహస్య సమాచారం ముందుగానే తెలుసుకొన్న కాంట్రాక్టరు తలదాచుకోవడానికి ఒక చోటు వెదికాడు. అది పనిమనిషి ఇల్లు. ఆ యింట్లోనే అతను కొంతకాలం బయటి వాళ్ళకు ఎవ్వరికీ తెలియకుండా గడిపాడు.

మూడు నెలల తరువాత అతను బయటకు వచ్చాడు. మరో మూడునెలలు గడిచిన తరువాత పనిమనిషి కూతురుకు నాలుగోనెల అని తెలిసింది.

కాంట్రాక్టరుకు అప్పటికే భార్య, మూడు నెలలకొడుకు వున్నారు. గర్భవతి అయిన ఆ యువతిని పెళ్ళిచేసుకోవాలనేకోరిక అతనికి ఎన్నడూలేదు. అవమానం భరించలేక ఆమె ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకొంది.

అలాంటి పరిస్థితిలో కాంట్రాక్టరు ఆమెపట్ల కొంత సాను భూతి చూపించాడు. తన తెలివితేటలు ఉపయోగించి ఆమెను రక్షించాడు.

మరునాడు తనదగ్గర పని చేస్తున్న ఒక సామాన్యకుటుంబానికి చెందిన వ్యక్తిని పిలిచి అన్నివిషయాలూ వివరంగాచెప్పి, అతనిని ఒప్పించి తన స్వంతఖర్చుతో వాళ్ళిద్దరికీ పెళ్ళిచేసాడు. అతనికి మూడువేలరూపాయల రొక్కంకూడా ముట్టజెప్పాడు.

నౌకరు మొదట సంకోచించాడు, కొంత సిగ్గుపడ్డాడు. తరువాత బాగా ఆలోచించి అంగీకారం తెలియజేసాడు. వివాహం అయినతరువాత అతను ఆ యువతితో సముద్రం ఒడ్డునవున్న తన స్వగృహంలో మకాం పెట్టాడు.

నాలుగు నెలల తరువాత ఆమె ఒక మగబిడ్డను కన్నది. అతనే ఈ కథానాయకుడు.

ఒక సంవత్సరం తరువాత అమ్మమ్మ మరణించింది.

నేను అతనినే నా అసలు తండ్రి అని అనుకొని "నాన్నా" అని పిలిచేవాడిని. అతని దగ్గరే పెరిగాను.

నేను తరచు నా తల్లి వెంట కాంట్రాక్టరు ఇంటికి వెళ్ళేవాడిని. అతను నాతో మాట్లాడేవాడుకాదు. కనీసం నావైపు చూసేవాడుకాదు. కానీ కాంట్రాక్టరు భార్య మాత్రం నన్ను ఎంతో ప్రేమగా ఆదరించేది. నేను ఆమెను "అమ్మగారు" అని పిలిచేవాడిని. ఆమె కొడుకు నన్ను ఏడిపించేవాడు. అతని ఆటవస్తువులు నేను ముట్టుకుంటే చాలు, చేతిలో ఏ వస్తువుంటే దానితో నన్ను కొట్టేవాడు. ఒకసారి కత్తిని నాముఖంమీదకు విసిరాడు. నా కుడిబుగ్గమీదవున్న మచ్చ ఏర్పడడానికి కారణం యిదే. అంతలో అతని తల్లి పరి గెత్తుతూ వచ్చి నన్ను వూరుకోబెట్టింది.

ఆమె నాకు ఆటవస్తువులు యిస్తే ఆమె కొడుకు బయటకు పోయి, "నేను ఈ వెధవని చంపేస్తాను," అని అరిచేవాడు. నాతల్లి ఇవన్నీచూసి మారుమాట్లాడకుండా కన్నీరుకార్చేది. నాకు మాయింట్లో ఎన్నడూ శాంతి లభించలేదు. నా తండ్రి కాంట్రాక్టరు దగ్గర పనిచేసేనౌకరు. అతను తరచు తన యజమాని గొప్పగురించే చెప్పేవాడు. ఎప్పుడూ త్రాగి ఏదో గొడవ చేసేవాడు. అతనికి కొంతమంది రాక్షసులవంటి మిత్రులు వుండేవారు. మాఅమ్మను పెళ్ళిచేసుకోవడంవల్ల వచ్చిన మూడువేలూ వాళ్ళతో కలిసి త్రాగి ఆరునెలలలో ఖర్చుచేసాడు.

త్రాగడమే కాకుండా; అతనికి పేక ఆడడం, వ్యభిచారం మొదలైన యితర వ్యసనాలుకూడా వుండేవి.

చేతిలో చిల్లిగవ్వకూడా లేకపోవడంతో అమ్మను ఇంట్లో నుంచి బయటకు ఈడ్చి, "నువ్వు కాంట్రాక్టరు దగ్గరకుపోయి వందరూపాయలు తీసుకురా. వాడికొడుకును ఇక నేను పోషించలేను" అని కొట్టేవాడు.

అమ్మకు నామీద నిజంగా ప్రేమవుందా అంటే, నేను ఖచ్చితంగా చెప్పలేను. నా జీవితంలోని అన్ని అనర్థాలకూ; కష్టా లకూ కారణం వాడే; అని ఆమె భావించి వుండవచ్చును. ఈరక మైన భావం ఆమె మాటలలో అప్పుడప్పుడూ ధ్వనించేది. ఏది ఏమైనప్పటికీ, నేను మాత్రం యౌవన ప్రారంభంలో అమ్మను ప్రేమించలేకపోయాను. నాపట్ల సానుభూతి, ప్రేమ చూపించిన ఒకే ఒక స్త్రీ కాంట్రాక్టరు భార్య. కష్టాలలో వున్నప్పుడు ఆమె నన్ను ఓదార్చేది. ఆమె నామీద ఎందుకు ఇంత ప్రేమ చూపించేదో నాకు తెలియదు. ఆమె తన భర్త, కొడుకు ఇద్దరూ చూడకుండా నాకు డబ్బు ఇచ్చేది. ఒకసారి "బాబూ! నువ్వు నా కడుపున పుట్ట వలసింది" అంది. అప్పుడు ఆమె కంఠం పూడుకుపోయింది. నాకు తెలియకుండా నాకళ్ళనుండి అశ్రుబిందువులు జారిపడ్డాయి. ఈనాటికీ ఈ సంగతి నాకు బాగా గుర్తు.

నాతల్లి అందం, యౌవనం ఆమె పాలిటి శాపంగా మారాయి. ఆమెకు ఇష్టం లేకపోయినా, నాతండ్రి కొందరు ధనవంతులను మా యింటికి తీసుకొని వచ్చేవాడు.

ఒకరోజురాత్రి చాలాగొడవ జరిగింది. నాన్నయింటికి క్రొత్త అతిథిని తీసుకువచ్చాడు. అమ్మ జబ్బుతో మంచం మీద పడివుంది. అపరిచితుడైన ఆవ్యక్తి బాగా నిషాలో వుండడం వల్ల ఒంటిమీద గుడ్డవున్నదీ లేనిదీ కూడా పట్టించుకోకుండా, మూర్ఖుడిలా నవ్వుతూ నిలబడ్డాడు. ఆ దృశ్యం నన్ను పిచ్చివాడిని చేసింది. నేను వంటగదిలోనుంచి కత్తి తీసుకువచ్చి, నాన్న తల మీద గట్టిగా ఆ కత్తితో పొడిచాను. నాన్న "అమ్మో" అనిఅరుస్తూ

నేలమీద పడిపోయాడు. నాన్న అతిథి భయంతో నోరుతెరచుకొని చూస్తూ వుండిపోయాడు. రెండోసారి కత్తిపోటు అతని నడుము మీదపడింది. అతనుకూడా క్రిందపడ్డాడు. నెత్తురు మడుగులో గిల గిలా కొట్టుకొంటున్న ఇద్దరినీ చూసి అమ్మ స్పృహతప్పిపడింది.

నేను బయటకు వచ్చాను. ఆ తరువాత ఏం చెయ్యాలో తెలియక సముద్రం ఒడ్డున పచార్లు చెయ్యసాగాను. ఎక్కడికైనా పోయి నన్ను నేను రక్షించుకోవాలనుకొన్నాను. అలా రెండుమైళ్లు నడిచాను. అప్పుడు నాకు, ఒకవేళ రెండు హత్యలనేరం అమ్మమీద మోపి, పోలీసులు ఆమెను అరస్టు చేస్తారేమో నన్న ఆలోచన వచ్చింది. నేనే నేరం చేసినట్టు అంగీకరించదలిచాను. వెంటనే తిరుగుముఖం పట్టాను. మూడుగంటలయ్యింది.

గదిలో అడుగుపెట్టగానే మరో క్రొత్త దృశ్యం కని పించింది. అమ్మ పురిత్రాడుకు వ్రేలాడుతోంది.

అమ్మ శవానికి నమస్కరించి బయటకు వచ్చాను. మరునాడు అరబ్బీ ఓడమీద బయలుదేరి కేరళను వదలిపెట్టాను. అప్పటికి నాకు పందొమ్మిదేళ్లు.

ఆ అరబ్బీ ఓడమీద నేను ఆఫ్రికా చేరుకొన్నాను. చివరకు ఉగాండాలోని లక్షాధికారి అయిన ఒక గుజరాతీ వ్యాపారి కొడుకుతో నాకు స్నేహం కుదిరింది. ఇప్పుడు ఆ వివరాలు చెప్పను. ఇరవై సంవత్సరాలలో; నేనూ ఆ గుజరాతీ మిత్రుడూ వ్యాపారంచేసి లక్షలుగడించాము.

సంవత్సరానికి ఒకసారి మా ఇద్దరిలో ఒకరు యూరోప్ విహారయాత్రకు వెళ్ళేవాళ్ళం. ఒకసారి నావంతు వచ్చింది. యూరోప్‌కు బదులు భారతదేశం వెళ్ళి కేరళ చూస్తే బావుంటుందని అనిపించింది. మా వీధి, నాబాల్యానికి సంబంధించిన స్థలాలూ ఒకసారి చూడాలన్న ఆలోచన కలిగింది. ఆ కోరికను చంపుకోలేక పోయాను.

నేను ఓడమీద బొంబాయి చేరుకొన్నాను. మూడోరోజుకు మావూరి సమీపంలోని పట్టణం చేరుకొన్నాను. అక్కడ ఒకచిన్న హోటలులో గదితీసుకొని పెద్దమనిషిలా వుండసాగాను.

మరునాడు ఉదయమే మావూరు వెళ్లాను. మాఘమాసం. సముద్రం ప్రశాంతంగా వుంది. వలలువెయ్యడానికి జాలరులు తాళ్లకడుతున్నారు.

సముద్రం నలువైపులా వేలకొద్దీ సముద్రపు కాకులు ఎగురుతున్నాయి. తూర్పున బాలభానుడు చిరునవ్వులు చిందిస్తు న్నాడు. సముద్రంలో నౌకలు బ్రేలానృత్యం చేస్తున్న రష్యన్ యువతులులా ఒకదాని ప్రక్కకు మరొకటి వస్తూ, మరుక్షణంలో నలువైపులా చెదరిపోతూ, విలక్షణమైన పద్ధతిలో ముందుకు సాగి పోతున్నాయి. ఇరవైయేళ్ళ క్రిందటి దృశ్యమే ఇది.

నేను మాగ్రామం వైపు నడిచాను. అక్కడ ఒకమర్రిచెట్టూ పురాతనమైన గుడీ వున్నాయి. వాటి సమీపంలో సిమ్మెంటుతో చెయ్యబడిన అరుగువుంది. అక్కడే ఇనప మిషన్ ఒకటివుంది. తుప్పుపట్టిన ఆ మిషన్ చూస్తే అది చేపలనుండి నూనెతియ్యడానికి ఉపయోగించేవారని తెలుస్తూంది. యజమాని ఈ పాతమిషన్‌ను నష్టం రావడంవల్ల విడిచిపెట్టాడేమోనని అనిపించింది.

సమీపంలోని గుడిసెముందు ఒక వృద్ధుడు కూర్చొని వున్నాడు. నేను అతని దగ్గరకు వెళ్ళాను. అతను "ఎవరూ?" అని అడిగాడు.

"చాలా దూరంనుంచి వచ్చాను" అన్నాను.

"ఏమిటి సంగతి?"

"ఇక్కడ భూమి కొనాలనుకొంటున్నాను. అందుకేవచ్చాను. నాకు ఇక్కడి భూమి నచ్చింది. దీని యజమాని ఎవరు? నాకు అతను ఈ భూమి అమ్ముతాడా?"

"ఓహ్; అదా! అది శాపగ్రస్తమైన భూమి. ఇరవై ఐదు సంవత్సరాల క్రిందట అక్కడ ఒక ఇల్లు వుండేది. ఒకరోజురాత్రి అక్కడ రెండుహత్యలూ, ఒక ఆత్మహత్యా జరిగాయి. ఈ సంఘటన జరిగిన నాలుగోరోజున వాళ్ళశవాలు సముద్రంఒడ్డున కనిపించాయి. ఈ హత్యలకూ, ఆత్మహత్యకూ కారణం ఎవ్వరికీ తెలియదు. ఈ ప్రాంతానికి చెందిన కాంట్రాక్టరు కొడుకే ఇవన్నీ చేసి వుంటాడని కొందరి అనుమానం. నిజం ఎవరికి తెలుసు? కాంట్రాక్టరు వేలంలో ఈ భూమీ, ఇల్లూకొన్నాడు. కాంట్రాక్టరు కొడుకు ఆ ఇల్లు పడగొట్టి చేపనూనె పరిశ్రమ పెట్టాడు. నాలుగైదు సంవత్సరాల తరువాత నష్టంవచ్చింది. కాంట్రాక్టరు గుండెపోటువల్ల మరణించాడు. అతనికొడుకు క్షయరోగంతో మంచం ఎక్కాడు. కాంట్రాక్టరు ఇల్లూ, ఆస్తీ ఐదువేలకు వేలంవేసారు. ఇప్పుడు మీరు అడిగిన భూమి కూడా అతనిదే." ముసలివాడు వివరంగా కథ

అంతావినిపించాడు. నాకు అతను చెప్పింది నిజమేనని అనిపించింది. కాంట్రాక్టరు భార్య ఇంకా బ్రతికివుందో లేదో తెలుసుకోవాలని అనిపించింది.

"కాంట్రాక్టరు భార్యలేదా?" అని అడిగాను. "ఉంది. పాపం ఆ తల్లికష్టాలలోవుంది. కొడుకువల్ల అంతా సర్వనాశనమయ్యింది. అతను క్షయతో బాధపడుతున్నాడు. ఇప్పుడు అటు తొంగిచూసే వాళ్లుకూడాలేరు. వున్నదంతా వేలంలో అమ్మిన తరువాత అతల్లి రోడ్డుప్రక్కన వుండవలసి వచ్చింది."

నేను సన్యాసి వేషం వేసుకొని గుడిదగ్గరవున్న అరుగుమీద కూర్చున్నాను. ఒక తెలివైన యువకుడిని డబ్బుఇచ్చి శిష్యుడిగా చేసుకొన్నాను.

గుడిదగ్గరకు ఒక సన్యాసి వచ్చాడనీ, ఆయన మంత్రించి యిచ్చిన భస్మం సకలరోగాలనూ నివారిస్తుందనీ పుకారు వూరంతా వ్యాపించింది.

రెండుమూడు రోజులలో గుడిదగ్గర జనం గుంపులు గుంపులుగా చేరసాగారు. రోజు రోజుకూ క్రొత్తవాళ్లు వస్తున్నారు.

కాంట్రాక్టరు కొడుకు లేవలేనిస్థితిలో వున్నాడు. సన్యాసిని కలుసుకోవడానికి అతను రాలేదు. సన్యాసి స్వయంగా అతని దగ్గరకు వెళ్ళాలావద్దా అన్నసమస్య వచ్చింది.

"సన్యాసి ఎవరి యింటికీరారు" అని శిష్యుడు సమాధానం చెప్పాడు.

చివరకు రోగితల్లి స్వయంగా తన దీనగాథ వినిపించడానికి వచ్చింది. నేను ఆమెవైపు పరీక్షగా చూసాను. ఆమె జుట్టుపండి పోయింది. ముఖం ముడతలు పడింది.

"నేను తప్పకుండా వస్తాను అమ్మా" అన్నాను. నాకంఠ స్వరం విని ఆమె వులిక్కిపడింది. నాముఖంలోని భావాలు మారి పోయాయి. నా కుడిబుగ్గమీద కత్తిపోటువల్ల ఏర్పడిన మచ్చను, విభూతిపూసి కనపడకుండా చేసాను.

నేను ఆమెవెంట వెళ్ళాను. ఆమె కొడుకును చూసాను. అతని పరిస్థితి హృదయవిదారకంగా వుంది.

నేను విభూతి మంత్రించి అతని కాళ్ళమీద, తలమీదా జల్లాను. నేను గుడ్డతో కట్టితెచ్చిన పాత్రను ఆమెకు అందిస్తూ ఇలా అన్నాను:

"రోగికి సేవచేస్తున్న తల్లి తప్ప ఈగదిలో ఇంకెవ్వరూ వుండకూడదు. అర్ధరాత్రి ఈ పాత్రతెరవాలి. అప్పుడు అందులో దివ్యఔషధులు కనిపిస్తాయి. అవి ఎలా వాడవలసిందీ అందులోని చీటీమీద వ్రాయబడివుంది."

అమ్మను చివరిసారిగా చూసి మాట్లాడకుండా, నా మనో భావాలు తెలియకుండా అక్కడనుంచి తిరిగివచ్చాను.

అమ్మకు ఇచ్చిన పాత్రలోని ఔషధులు రూపాయల కట్టలు అన్నమాట. ఆ మొత్తం లక్షరూపాయలు. వాటిలోపాటు జతపరచ బడ్డ చీటీలో ఇలా వ్రాసాను:

"ప్రియమైన అమ్మగారికి, ఇందులో లక్షరూపాయలు వుంచాను. దయచేసి స్వీకరించండి. ఇది ఒకపాత కథ.

నా అసలు తండ్రి అయిన కాంట్రాక్టరు నాతల్లికి గర్భస్రావం చెయ్యించివుంటే నేను ఈలోకాన్ని చూసి వుండక పోదును. నేను నాకు జన్మనిచ్చిన తండ్రికి ఋణపడివున్నాను. నాయెడల అమితమైన ప్రేమను చూపించిన క్రొత్త అమ్మకు కృతజ్ఞుడను. ఈ డబ్బుతో అమ్మ బాకీలు అన్నీతీర్చి, చిరకాలం సుఖంగా వుండాలని కోరుతున్నాను. ఇక శెలవు.

కృతజ్ఞతలతో....

మీ కుమారుడు."



# చైతన్యం

## శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

ఒక కోతే -
ఒళ్ళంతా చైతన్యమై పోతే,
తనువంతా ఆకుపచ్చనై పోతే,
తానొకచో నిలవ లేక పోతే,
పువ్వూ, మొవ్వూ, చెట్టూ, పుట్టా,
కొండా, కోనా, పక్షీ, పశువూ,
దానవులూ, మానవులూ, వీడూ, వాడా
కోతీ కోతీ అనిపోతే -
కోతి త్రేతాయుగం వేపు తిరిగి నవ్వుకొనేనట !

* * * *

అప్పుడు
లక్షల కాంతి తరంగాల ఆకాశ దూరమూ,
ఒక్క ఎగురు ఎగిరి
ఆకాశపు చిటారు అంచు వొంచి కొసాన ఉన్న
సూర్యా మామిడి పండును అందుకొన్న
హరిత హరి చైతన్యం
రెప రెప లాడింది, గగనమంతా నిండి, కళ్ళముందు
అది నిశాత శతారాఘాతం తిన్నా
తిన్నగా తిరిగి మేలుకొన్నది -
అది విశ్వ ప్రాణశక్తి కన్నది -
దానికి జరలేదు, రుజలేదు, చావులేదు -
బ్రహ్మాస్త్రమైనా దాన్నేమీ చెయ్యలేదు -

* * * *

ఆకాశమంతా వెలుగు దుమ్ము లేపుకొంటూ,
క్షణం తీరికలేకండా, సప్తార్చి స్యందనం మీద
సాగి కాలపాలనం నిర్వహించే
సూర్య భగవానులదగ్గర
ఉదయగిరిమీద ఒక అంగా, అస్తాచలంమీద
ఇంకొక అంగా కాంగా,
తరళరోదిశ్చక్రాల కిర కిర మధ్య కూడా
స్వరం తప్పకుండా సుస్వరంగా
వేదవిద్యనంతా పుక్కిటబట్టి
వెచ్చని వెలుగు చేయి మెచ్చుకోలుగా
వెచ్చంగా బుజం తట్టంగా
వికసించింది ఆ చైతన్యమే -

* * * *

అదే అదే
సరైన అవలంబం లేకపోయి,
ఆత్మ ప్రత్యయ రహితమై పోయి,
ప్రకృతి పరిమితమైపోతే
గుప్పెడుకోతై ముడుచుకుపోతుంది
అదే అదే
జాగృతమైతే
మహేంద్ర పర్వతపు బండలైనా బద్దలై
నీటి ఊట లుబుకుతాయి -
మహావృక్షాలూ పెళ్ళగిల్లి
ఆ మహా ప్రభంజన వేగం వెంట పడతాయి -
కాల సర్పాలూ కొండబండల్ని కరిచి కరిచి
కాకోల విషం కక్కుతాయి -
అప్పుడా చైతన్యం
ఎలాంటి సముద్ర పరీక్షలకైనా నిలుస్తుంది -
నిఖిల దేవకోటినీ నివ్వెర పరుస్తుంది -
ఉజ్జ్వలోజ్జ్వలంగా మెరుస్తుంది -
సజీవ సంస్కృత సువాసనా వాసితమైన ప్రేమలేఖై
సముద్రాల మీద ఎగురుతుంది -
కన్నీటి ఘోషతో, సముద్రవేదనతో గిలగిలలాడే
రెండు ప్రియ విరహాత్మఖండాలను కలుపుతుంది -
అరణ్యాలూ, అఖర్వపర్వతాలూ గడచి
అమృత సంజీవనులను మోసుకొచ్చి
మృత్యువును తరిమికొడుతుంది -
కమ్ముకొచ్చే రావణలంకను చెదర గొడుతుంది -
అయోధ్య వాకిట పచ్చతోరణం కడుతుంది -

* * * *

అందుకెంతో సంతోషించి మనసుపడి, మైథిలి
అయోధ్యాంతఃపురంలో ఆ కోతికి
మంచి ముత్యాలదండ బహూకరిస్తే,
అది ఆత్రంగా అందుకొని ముత్యముత్యమూ కొరికి
అందులో ఎక్కడా రామ మధురహాసం కనిపించక
బిక్కమొగం వేస్తే,
సీతమ్మకేమీ అర్థంకాక తెల్లమొగంవేసి
శ్రీరామ చంద్రులను చూస్తే,
ఆయన ఫక్కుమన్నాడట -
ఆ మహత్తర చైతన్యాన్ని గుప్పెడు కోతిగానే
అరచేతిలోకి తీసుకుని
ఇష్టంగా ముద్దుగొన్నాడట -

* * * *

అవునది వికృతమైనదే
హనువుదెబ్బతిన్నదే
తోకకూడా ఉన్నదే
గుప్పెడు కోతే -
అయితే,
అది అణువణువూ, ఆపాదశిరమూ
రామ విద్యుద్ధ్వంతమైనప్పుడు,
నీలివెలుగు నిండిన కళ్ళతో పారిజాత చెట్టుకింద
పులకించి ఉన్నప్పుడు,
దివ్య లక్ష్యం వేపుతిరిగి ఉన్నప్పుడు,
అది హనుమంతుడు -
అతులిత బలవంతుడు, అనుపమాన ధీమంతుడు,
సర్వసద్గుణ శ్రీమంతుడు -
కాకపోయెనా,
చలచంచలంగా చూస్తూ
అటునించిటూ, ఇటునించటూ
అటూ, ఇటూ, ఎటో చెదిరిపోతూ
కొమ్మమీంచి కొమ్మమీదికి,
కొండమీంచి కొండమీదికి,
ఒకకోరిక అంచునించి ఇంకొక కోరిక అంచుకి
నాలో, నీలో, లోలో
ఎగిసిపోయే, ఎగిరిపోయే, తునిసిపోయే
గుప్పెడు మనసు ! !

# ప్రేమగుడి కట్టుకొని...

## డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు

అంతులేని
ఈ ఎడారిలో
ఏమిటి
ఆశ్చర్యం !
విచ్చుకొంటున్న గులాబీ పువ్వు.
రాళ్లూ రప్పలూ నిండిన
ఈ బంజరులో
ఏమిటి
ఆశ్చర్యం !
సుగంధ పరిమళాల పిల్లగాలులు.
బొమ్మజెముడిది
ముళ్ళ హృదయమిది
గాయం చేస్తుందేమో నని భయం !
అగాధంలో చిక్కుకుంటుందేమోనని ఒకటే అనుమానం !
కాని....
ఆ ఎర్రని మమతలు చూసాక
నులివెచ్చని ఆతీపి కథలు విన్నాక
ఆ పుణ్యస్మృతుల నెమరులో
వేదశృతుల సెలయేరులో
ఊహించని అలజడి !
ఊపిరి పోసుకొంటున్న క్రొత్త ఒరవడి !
అనురాగం పురివిప్పుకొని
ప్రేమ గుడి కట్టుకొని !

శ్రీ జంధ్యాల బాలగంగాధర తిలక్

# కేంద్రము - రాష్ట్రముల మధ్య ఆర్థిక సంబంధములు: విత్త సంఘము పాత్ర

భారతదేశం వంటి ఫెడరల్ వ్యవస్థ కలిగిన దేశములలో కేంద్రము రాష్ట్రముల మధ్యగల ఆర్థిక సంబంధము అత్యంత విశిష్టమయినది. దేశములో ముఖ్యముగా పన్నులద్వారా సమకూర్చబడిన నిధులు కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వములు తమ తమ బాధ్యతలు ఆధారముగా పంచుకొనవలెను. రాష్ట్రప్రభుత్వములకు కేంద్రమునుండి మూడు రకములుగా ఆర్థికవనరులు లభించును: (1) విత్త సంఘము (ఫైనాన్స్ కమీషన్) సలహా ననుసరించి కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వములకు విత్త వనరులు సమకూర్చును. (2) ప్రణాళికా సంఘము (ప్లానింగ్ కమీషన్) రాష్ట్రములకు ప్రధానముగా ప్రణాళికా ధ్యేయములు నెరవేర్చుటకు ఆర్థిక సహాయము చేయును. (3) ఈ రెండు సంఘములనుండి మాత్రమేకాక రాష్ట్రములకు కేంద్రప్రభుత్వము నుండి అనేక ఇతర కారణములవలన ఆర్థిక వనరులు లభించును. కేంద్రము రాష్ట్రముల మధ్యగల ఆర్థిక సంబంధములలో విత్త సంఘము యొక్క పాత్రావలోకనము చేయుట ఈవ్యాసము ప్రధానోద్దేశ్యము.

దేశములో పన్నులద్వారా కేంద్రమునకు వచ్చు నిధులు కేంద్రము, రాష్ట్రముల మధ్య వితరణము చేయుటలో కేంద్ర ప్రభుత్వమునకు ఉచితసలహాలిచ్చుటకు విత్త సంఘ మేర్పరుచవలెనని భారతరాజ్యాంగము 280 వ ప్రకరణములో నిర్దిష్టము గావింపబడినది. ఈ బాధ్యత నిర్వర్తించుటలో విత్త సంఘము న్యాయ నిర్ణేతగా వ్యవహరించవలెనని రాజ్యాంగములో స్పష్టము చేయబడినది. విత్త వనరులు తమంతట తాము సమకూర్చుకొనుటలో విభిన్న రాష్ట్రముల శక్తి సామర్థ్యములు వేర్వేరుగా నుండును. ఇది విభిన్న ప్రాంతముల మధ్య ప్రాంతీయ అసమానతలకు కారకమగును. కావున ఇట్టి అసమానతలు తగ్గించవలెనను ధ్యేయముతో మన రాజ్యాంగ నిర్మాతలు విత్త సంఘము ఏర్పరుచవలెనని పేర్కొనినారు.[1] ఈ క్రింద పేర్కొనబడిన మూడును విత్త సంఘము యొక్క ప్రధాన బాధ్యతలుగా రాజ్యాంగము నిర్దేశించినది:[2]

1. కేంద్రము, రాష్ట్రముల మధ్య వితరణము చేయవలసిన పన్నుల ఆదాయములో కేంద్రము రాష్ట్రముల మధ్య భాగములునిర్ణయించుట; సరియగు ప్రాతిపదికల ఆధారముగా విభిన్న రాష్ట్రముల మధ్య ఈ నిధులు వితరణము చేయుటకు భాగములు నిర్ణయించుట;
2. కేంద్ర ప్రభుత్వము యొక్క సమగ్ర నిధి (కన్సాలిడేటెడ్ ఫండ్) నుండి రాష్ట్రములకు సహాయ గ్రాంట్లు (గ్రాంట్స్ - ఇన్ - ఎయిడ్) ఇచ్చుటకు సరియగు నియమములు సూచించుట;

సక్రమమగు విత్త వనరుల విధానము దృష్టిలో నుంచుకొని రాష్ట్రపతిచే కోరబడు మరి యే యితర విషయము పైనను సలహాలిచ్చుట.

ఈ విధముగా చూచినపుడు భారత దేశములో విత్తసంఘము ఒక విలక్షణ మయిన సంస్థగా కన్పించును. రాజ్యాంగము ద్వారా ఏర్పరుచబడిన అతి తక్కువ సంఘములలో విత్త సంఘ మొకటి. ఇటువంటి సంఘము ఒకటి రెండు దేశములలో తప్ప ఏ యితర ఫెడరల్ రాజ్యాంగ వ్యవస్థ లోను కన్పించదు. ఆస్ట్రేలియాలో కామన్‌వెల్త్ గ్రాంట్స్ కమిషన్ అను పేరిట మన విత్త సంఘము వంటి సంఘ మున్నది. కాని ఈ సంఘము వివిధ రాష్ట్రములకు కేవలము గ్రాంట్లు ఇచ్చుట గురించి మాత్రమే సలహాలిచ్చును. ఈ సంస్థ సంవత్సరమున కొకసారి ప్రభుత్వమునకు వార్షిక నివేదిక సమర్పించును. ఇంతేకాక ఇది మన విత్త సంఘమువలె చట్టరీత్యా ఏర్పరుపబడిన సంస్థకాదు. కామన్‌వెల్త్ ప్రతినిధులు, రాష్ట్ర ప్రతినిధులు, విశ్వ విద్యాలయ ప్రతినిధులు మున్నగు వారు ఈ సంస్థలో సభ్యులుగా నుందురు. ఇది ఒక స్వతంత్ర సంస్థ. నైగీరియాలో కూడా ఒక విత్తసంఘము కలదు. ఆ విత్తసంఘమునకు మన విత్త సంఘమునకు పోలికలు చాలా కలవు. నైగీరియాలోని విత్త సంఘ మిచ్చు గ్రాంట్లలో విద్యారంగమున కిచ్చు గ్రాంట్లు ప్రధానమైనవి. ఆస్ట్రేలియాలోని కమిషన్ ప్రధానముగా

వెనుక బడిన రాష్ట్రములకు మాత్రమే గ్రాంట్లు ఇచ్చును. ఈ రెండు మినహా మరి ఏ ఇతర దేశములోను మన రాజ్యాంగ మేర్పరచిన విత్త సంఘము వంటి సంఘము కానరాదు.[3]

మన రాజ్యాంగము ననుసరించి ప్రతి 5సం. లకు కాని అంతకు తక్కువ వ్యవధిలో గాని ఒక విత్త సంఘ మేర్పరుచ బడు చున్నది. రాజ్యాంగము అమలు లోనికి వచ్చిన వెంటనే 1951లో ప్రథమ విత్త సంఘము నియమింపబడినది. ద్వితీయ విత్త సంఘము 1956 లోను, తృతీయ సంఘము 1960 లోను, చతుర్థ సంఘము 1964లోను, పంచమ సంఘము 1969లోను, షష్ఠమ సంఘము 1972లోను, సప్తమ సంఘము 1977లోను నియమింపబడినవి. ఈ ఏడు విత్త సంఘముల గురించిన ముఖ్యమయిన వివరములు పట్టిక సంఖ్య 1 లో పొందు పరుపబడినవి.

ఈ సందర్భములో దేశములో రాజ్యాంగము అమలులోనికి రాక పూర్వము కేంద్రము రాష్ట్రముల మధ్య విత్త వనరుల వితరణ మెట్లున్నదో అవలోకించుట ఆవశ్యకము. భారత ప్రభుత్వము 1919 చట్టము (గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్టు 1919) అమలులోనికి రాక పూర్వము కేంద్రము, విభిన్న రాజ్యముల మధ్య విత్త వనరుల సంబంధములు అంత సంతృప్తికరముగా లేవు. 1871 వరకు దేశములోని ఆదాయ వ్యయములకు సంబంధించిన విషయములు పూర్తిగా కేంద్ర ప్రభుత్వాధీనములో నున్నవి. విభిన్న రాజ్యములకు సమానముగా నిర్ణీత నిధులు గ్రాంట్లు రూపములో కేంద్ర ప్రభుత్వము సమకూర్చెడిది. భౌగోళికముగాను, ఆర్థికముగాను అసమానముగా నున్న పెక్కు రాజ్యములకు సమానముగా గ్రాంట్లు ఇచ్చుట సమంజసము కాదు గావున ఆ పద్ధతి చిరకాలము కొనసాగలేదు. 1871లో విత్త వనరుల విషయములో కేంద్రప్రభుత్వ విధానము వికేంద్రీకరణము గావింపబడినది. క్రొత్త విధానము ననుసరించి పోలీసు, కారాగారములు, విద్య, ఆరోగ్యము, రోడ్లు మొదలగు ఎన్నో శాఖలకు సంబంధించిన ఆదాయ వ్యయ అధికారములు రాజ్యముల కప్పగించబడినవి. అంతేకాక నిర్ణీత నిధులు గ్రాంట్లు రూపములో రాజ్యముల కీయబడినవి. 1877లో భూమిశిస్తు ఎక్సైజు, స్టాంపు సుంకము, శాంతి భద్రతలు మొదలయిన మరెన్నో విభాగములు రాజ్యములఅధీనములోనికి వచ్చినవి. 1882లో గ్రాంట్లు పద్ధతి రద్దయినది. అన్ని అంశములు కేంద్రప్రభుత్వము అధీనములో నుండు శాఖలు; రాజ్యముల అధీనములో నుండు శాఖలు; వాటిపైవచ్చు ఆదాయము కేంద్రము, రాజ్యములు పంచుకొనవలసిన శాఖలు అని మూడు గ్రూపులుగా విభజింపబడినవి. ప్రతి 5 సం.ల కొక మారు అనగా 1887లోను, 1892లోను, 1897లోను ఈ విధానము సమీక్షింపబడినది.

భారతప్రభుత్వము 1919 చట్టము అమలులోనికి వచ్చినప్పటి నుండి భారత ప్రభుత్వము 1937 చట్టము అమలులోనికి వచ్చునాటి వరకు అనగా 1919 నుండి 1937 మధ్య కాలములో కేంద్రము, రాజ్యముల మధ్య విత్త వనరుల సంబంధములు పలుమారులు చర్చింపబడినది. 1919 చట్టము ననుసరించి ఆదాయపన్ను, సాధారణ స్టాంపు సుంకము కేంద్రప్రభుత్వమునకు కేటాయింపబడినవి. ఎక్సైజు, భూమిశిస్తు, నీటి పారుదల మొదలయిన విభాగములు రాజ్యములకు కేటాయింపబడినవి. బొంబాయి రాష్ట్రము ఆదాయ పన్నుపై వచ్చు ఆదాయము రాజ్యములకు పంచవలెనని కోరగా ఆకోరిక పరిశీలనార్థము కేంద్ర ప్రభుత్వము లార్డు మెస్టన్ కమీషన్‌ను నియమించినది. మెస్టన్ కమీషన్ బొంబాయి రాష్ట్రము కోరికను ఆమోదించలేదు.

పట్టిక సంఖ్య - 1

**భారత దేశములో విత్త సంఘములు**

| | అధ్యక్షుడు | నియామకము | నివేదిక సమర్పణ | నివేదిక వర్తించు కాలము |
|---|---|---|---|---|
| I ప్రథమ విత్త సంఘము | శ్రీ కె. సి. నియోగీ | 1951 | 1952 | 1952–57 |
| II ద్వితీయ ,, | శ్రీ కె. సంతానమ్ | 1956 | 1957 | 1957–62 |
| III తృతీయ ,, | శ్రీ ఎ. కె. చందా | 1960 | 1961 | 1962–66 |
| IV చతుర్థ ,, | శ్రీ పి. వి. రాజమన్నార్ | 1964 | 1965 | 1966–69 |
| V పంచమ ,, | శ్రీ మహవీర్ త్యాగి | 1969 | 1969 | 1969–74 |
| VI షష్ఠమ ,, | శ్రీ కె. బ్రహ్మానంద రెడ్డి | 1972 | 1973 | 1974–78 |
| VII సప్తమ ,, | శ్రీ జె. యం. షేలత్ | 1977 | 1978 | 1978–83 |

భారత ప్రభుత్వము 1935 చట్టము ననుసరించి భూమిశిస్తు; నీటిపారుదల, మత్తుపానీయములు, మత్తుమందు వగైరా మత్తు వస్తువులపై విధించు సుంకము, వ్యవసాయాదాయ పన్ను, స్టాంపు సుంకము మొదలగు పెక్కురకముల ఆదాయము రాజ్యములకు చెందినది. కార్పొరేట్ పన్నులు, కస్టమ్సు సుంకములు, రైల్వే, టెలిగ్రాఫ్, టెలిఫోన్, రేడియో మొదలయినవి పూర్తిగా కేంద్ర ప్రభుత్వమునకు చెందినవి. 1936లో నియమింపబడిన ఒట్టో నిమియార్ కమీషన్ ఆదాయపన్నుపై వచ్చు ఆదాయములో 50శాతము రాజ్యములకు వితరణము చేయవలెనని సూచించినది. జనాభా ప్రాతిపదిక ఆధారముగాను, ఆదాయపన్ను వసూలు ఆధారముగాను విభిన్న రాజ్యముల మధ్య ఈ వితరణము చేయవలెనని సూచించినది. తదనుగుణముగా మొత్తము వితరణము చేయవలసిన నిధులలో 15 శాతము మద్రాసు రాష్ట్రమునకు, 20 శాతము బొంబాయి రాష్ట్రమునకు, 20 శాతము బెంగాల్ రాష్ట్రమునకు, 8 శాతము పంజాబుకు, బీహారుకు 10 శాతము, అస్సామ్, సింధు, ఒరిస్సా రాష్ట్రములకు 2 శాతము చొప్పున వితరణము చేయవలెనని సూచించినది. ప్రభుత్వము ఈ సూచనల నంగీకరించినది. అంతేకాక మనకు స్వతంత్రము వచ్చు నాటివరకు ఇదే విధముగా విత్త వనరుల పంపకము గావింపబడినది. 1947లో దేశ విభజనము జరిగినపుడు ఈ వితరణములో కొద్ది మార్పులు గావింపబడినవి.

రాజ్యాంగము అమలులోనికి వచ్చిన పిదప మొదటి విత్త సంఘము నియమించుటకు పూర్వము అనగా 1950లో విత్తవనరుల వితరణము విషయములో శ్రీ సి. డి. దేశముఖ్ అభిప్రాయములు కోరబడినవి. శ్రీ దేశముఖ్ శ్రీ ఒట్టో నిమియార్ కమీషన్ సూచనలలో స్వల్ప మార్పులు గావించెను. ఆ మార్పులు దేశవిభజనము దృష్ట్యా అవశ్యకము. శ్రీ దేశముఖ్ సలహాలు ప్రభుత్వము ఆమోదించినది. తదుపరి ప్రథమ విత్త సంఘము నియామకము జరిగినది.

భారత రాజ్యాంగము ప్రకారము విత్త సంఘము యొక్క ప్రధాన బాధ్యతలలో పేర్కొనదగినవి ఏమనగా 1. కేంద్రము, రాష్ట్రముల మధ్య ఆదాయపన్ను; ఎక్సైజు సుంకముల వితరణము గురించి కేంద్ర ప్రభుత్వమునకు సలహాలిచ్చుట. ఇంతేకాక ఎస్టేట్ సుంకము, టెక్స్‌టైల్స్, పొగాకు, పంచదార మొదలగు వానిపై ఎక్సైజు సుంకములకు బదులుగా విధించబడు అమ్మకపు పన్ను, రైల్వేఛార్జీలపై విధించబడు పన్నులు – మొదలగు పన్నుల నిధుల వితరణము గురించికూడా అపుడపుడు విత్త సంఘము సలహాలు కోరబడినవి. ఈ విధముగా ఆదాయపన్ను, కేంద్ర ఎక్సైజు సుంకము, అదనపు ఎక్సైజు సుంకము, ఎస్టేట్ పన్ను, రైల్వే ప్రయాణీకుల ఛార్జీలపై విధించు సుంకము విత్త సంఘము పరిధి లోనికి వచ్చును. టెక్స్‌టైల్స్, పంచదార, పొగాకులపై అదనపు ఎక్సైజు సుంకము విధించవలెనని 1956లో తీర్మానింపబడినది. ఇదే విధముగా ఎస్టేట్ పన్ను చట్టము 1953లో అమలులోనికి వచ్చినది. కావున ఈ రెంటిపై వచ్చు ఆదాయము రాష్ట్రములకు వితరణము చేయుట ద్వితీయ విత్త సంఘము నాటినుండి మాత్రమే ఆరంభమయినది. రైల్వే ప్రయాణీకుల ఛార్జీలపై విధించబడు సుంకమునకు సంబంధించిన చట్టము 1961లో రద్దు గావింపబడినది. కావున తృతీయ విత్త సంఘము ఈ సుంకముపై వచ్చు ఆదాయమునకు బదులుగా రు. 12.5 కోట్లు గ్రాంట్ల రూపములో రాష్ట్రములకు వితరణము చేయవలెనని సలహా ఇచ్చినది. నాల్గవ, అయిదవ, ఆరవ విత్త సంఘములు ఇదే విధముగా సూచించినవి. సప్తమ విత్త సంఘము ఇందు కొంచెము మార్పు గావించినది.

2. రాజ్యాంగము 275 వ ప్రకరణము ననుసరించి పరిపాలనా దక్షతలోను, సమాజసేవలు కల్పించుటలోను రాష్ట్రములు కనీస స్థాయికి చేర్చవలెనను ధ్యేయముతో రాష్ట్రములకు సహాయగ్రాంట్లు ఈయవలెను. ఆ గ్రాంట్లు ఇచ్చుట గురించి తగిన సలహాలు విత్త సంఘము నుండి గ్రహించవలెనని రాజ్యాంగము నిర్దేశించినది. కావున ఇది విత్త సంఘము యొక్క రెండవ ప్రధాన బాధ్యత. ముఖ్యముగా ఏయే రాష్ట్రములకు గ్రాంట్లు ఇవ్వవలెనో, ఎంత మొత్తము గ్రాంట్ల రూపములో ఇవ్వవలెనో విత్త సంఘము నిర్ణయించును. రాష్ట్రముల మూలధన వ్యయమునకు ఇవ్వబడు గ్రాంట్లు, ఋణములు విత్త సంఘము పరిధిలోనికి రావు. కేవలము రాబడీ వ్యయమునకు సంబంధించు గ్రాంట్లు గురించి మాత్రమే విత్త సంఘము సలహాలిచ్చును. ప్రణాళికా గ్రాంట్లు ఇచ్చు విషయములోకూడా విత్త సంఘము పాత్ర పరిమితమయినది. ఈ విషయములో విత్తసంఘము అపుడపుడు కేవలము హామీకత్తుబాధ్యత స్వీకరించును. కేంద్రము, రాష్ట్రములమధ్య ఆర్థిక సంబంధములలో ఋణములు, ఇతర గ్రాంట్లు ప్రధానమైనవి. కానీ ఇవి విత్త సంఘము పరిధిలోనికి రావు. ఈవిధముగా చూచినపుడు విత్త సంఘము పాత్ర మిక్కిలి స్వల్పముగా కన్పించును.

ప్రణాళికా సహాయము, క్రొత్త పన్నులు విధించుట ఇంకను ఇతర పద్ధతులద్వారా నిధులు సమకూర్చుట మొదలగు విషయములలో ప్రణాళికా సంఘము నిర్ణయములు తీసికొనును. విధిగా నిర్ణయింపబడిన అభివృద్ధి ప్రణాళికా వ్యయమునకు అభివృద్ధేతర ప్రస్తుత ప్రణాళికలకు సహాయ మిచ్చుటలో విత్త సంఘము బాధ్యత వహించును. సామాజిక సేవలపై వ్యయము, విధిగా నిర్ణయింపబడిన వ్యయము కావున ఇది విత్త సంఘము పరిధిలోనికి వచ్చును.

ముఖ్యముగా గమనించదగ్గ విషయమేమనగా పన్నులరేట్లు నిర్ణయించుటలోను తత్ఫలితముగా పన్నులద్వారా నిధులు సమకూర్చుటలోను విత్త సంఘము యొక్క పాత్ర శూన్యము. నిర్దిష్టమయిన పన్నుల ద్వారా సమకూర్చబడు నిధుల వితరణము మాత్రమే విత్తసంఘము బాధ్యత.

విత్త వనరుల వితరణములో ఈ క్రింద పేర్కొనబడిన నాలుగు ప్రధాన అంశములు దృష్టిలో నుంచుకొనవలెనని ప్రథమ విత్త సంఘము భావించినది:

1. కేంద్రము నుండి రాష్ట్రములకు నిధుల వితరణము చేయునపుడు దేశరక్షణ, ఆర్థిక సుస్థిరత మొదలయిన తన ప్రధాన బాధ్యతలు నిర్వర్తించుటలో కేంద్రప్రభుత్వమునకు నిధులలో ఏ మాత్రము లోటు కలగకుండా చూడవలెను.

2. నానాటికి అభివృద్ధి చెందుతున్న అభివృద్ధి ప్రణాళికా కార్యక్రమములు, ఇతర బాధ్యతలు సక్రమముగా నిర్వర్తించుటకు తగినన్ని నిధులు రాష్ట్ర ప్రభుత్వములకు సమకూరునట్లు చూడవలెను.

3. రాష్ట్రములకు నిధులు వితరణము చేయుటద్వారా రాష్ట్రముల స్వయం ప్రతిపత్తి, స్వేచ్ఛలకు ఆటంకము కలుగరాదు. అంతేకాక రాష్ట్ర ప్రభుత్వములు నిధులు తమంతట తాము సమకూర్చుకొనుటకు, ఉన్న నిధులు సక్రమముగా వినియోగించుటకును దోహదము చేకూరునట్లు విత్త సంఘము నిధులు వితరణము గావించవలెను.

4. విభిన్న రాష్ట్రముల మధ్య ఆర్థిక అసమానతలు తగ్గించుట విత్త సంఘము యొక్క మరొక మహోద్దేశ్యము.

దాదాపు అన్ని విత్త సంఘములు ప్రథమ విత్త సంఘము యొక్క ఈ అభిప్రాయములతో ఏకీభవించినవి.

విభిన్న విత్త సంఘములు తమ కర్తవ్యములనెట్లు నెరవేర్చెనో అవలోకించెదము. రాజ్యాంగము ఆదాయపన్ను, ఎక్సైజు సుంకము, గ్రాంట్లు - అని మూడిటిని వేర్వేరుగా పేర్కొన్నది గావున ఈ మూడిటి పేరిట వివిధ విత్త సంఘముల సలహాలను సూక్ష్మావలోకనము గావించెదము.

## ఆ దా య ప న్ను

రాజ్యాంగము 270 వ ప్రకరణము ననుసరించి ఆదాయ పన్నుపై వచ్చిన ఆదాయము కేంద్రము, రాష్ట్రములు విధిగా పంచుకొనవలెను. ఆదాయపన్ను పేరిట లభించు మొత్తము స్థూల ఆదాయములో (i) కేంద్రపాలిత ప్రాంతములనుండి లభించినపన్ను ఆదాయము, (ii) కేంద్రప్రభుత్వ మిచ్చు పారితోషికముపై లభించిన పన్ను ఆదాయము, (iii) కేంద్ర ప్రభుత్వము తనకై ప్రత్యేకముగా విధించిన సర్‌ఛార్జిపైవచ్చు ఆదాయము, (iv) పన్ను వసూలు చేయుటకయిన ఖర్చులు మినహాయించి మిగిలిన ఆదాయము కేంద్రము రాష్ట్రముల మధ్య వితరణము గావించవలెను. ప్రథమ విత్త సంఘము ఆదాయ పన్నులో 55 శాతము మాత్రమే వివిధ రాష్ట్రములకు పంచవలెనని సూచించినది. ద్వితీయ సంఘము 60 శాతము, తృతీయ సంఘము మొత్తములో 2/3 వ వంతు రాష్ట్రములకు వితరణము చేయవలెనని సూచించగా, నాల్గవ, అయిదవ సంఘములు 3/4 వ వంతు వితరణము చేయవలెనని సలహాలిచ్చినది. ఆరవ విత్త సంఘము ఆదాయపన్ను రాబడిలో రాష్ట్రముల భాగము 80 శాతముగా నిర్ణయించినది. ఏడవ సంఘము ఈ భాగమును 85 వరకు వృద్ధిచేసినది. ఈ విధముగా విత్త సంఘములు రాష్ట్రముల ఆర్థిక అవశ్యకతలను బాగుగా గుర్తించి ఆదాయపన్నులో రాష్ట్రముల భాగము అభివృద్ధి చేసినవి.

విత్త సంఘముల బాధ్యతలు, వాటిని నిర్వర్తించు విధానము గమనించినపుడు రాష్ట్రప్రభుత్వములు కేంద్ర ప్రభుత్వముతో విత్త వనరులకై పోటీ పడుచున్నట్లు కనిపించును. అంతేకాక విభిన్న రాష్ట్రప్రభుత్వములు విత్త వనరులకై ఒక దానితో నొకటి పోటీపడుతున్నట్లు కన్పించును. విభిన్న రాష్ట్రముల మధ్య విత్త వనరులు వితరణము చేయుటకు అన్ని విత్త సంఘములు రెండు అంశములను ప్రాతిపదికలుగా గ్రహించినవి. అవి ఏమనగా : రాష్ట్ర జనాభా; రాష్ట్రము యొక్క పన్ను ఆదాయము. రాష్ట్ర జనాభాకు బదులుగా రాష్ట్ర ఆర్థికాభివృద్ధి ప్రధానఆధారసూత్రముగా గ్రహించవలెనని కొన్ని వెనుకబడిన రాష్ట్రములు కోరుచున్నవి. కాని అభివృద్ధి చెందిన రాష్ట్రములు అట్టి ప్రతిపాదనను వ్యతిరేకించుచున్నవి.[4] కావున నేటివరకు ఈ రెండు ఆధారసూత్రములలోను మార్పురాలేదు. కాని ఈ రెంటికీయబడు భారవిలువలు మారుతూ వచ్చినవి. ప్రథమ విత్త సంఘము వితరణము గావించవలసిన ఆదాయపన్ను నిధులలో 80 శాతము రాష్ట్ర జనాభా ఆధారముగాను, 20 శాతము పన్ను ఆదాయము ఆధారముగాను వితరణము చేయవలెనని సూచించినది. ద్వితీయ విత్త సంఘము రాష్ట్ర జనాభా భారవిలువ 90 శాతమునకు వృద్ధి చేయవలెనని, తత్ఫలితముగా పన్ను ఆదాయముయొక్క భారవిలువ 20 శాతము నుండి 10 శాతమునకు తగ్గించవలెనని భావించినది. తృతీయ, చతుర్థ సంఘములు ప్రథమ విత్తసంఘము యొక్క సలహాతో

ఏకీభవించగా, అయిదవ, ఆరవ, ఏడవ విత్తసంఘములు ద్వితీయ విత్త సంఘముయొక్క సూచన ఆమోదయోగ్యముగా భావించినవి.

పట్టిక సంఖ్య - 2

**ఆదాయపన్ను వితరణములో ప్రాతిపదికలు వాటి భారవిలువలు**

| విత్త సంఘము | ఆదాయపన్నులో రాష్ట్రముల భాగము (%) | ప్రాతిపదికలు, వాటి భారవిలువలు జనాభా (%) | పన్ను ఆదాయము (%) |
|---|---|---|---|
| ప్రథమ | 55 | 80 | 20 |
| ద్వితీయ | 60 | 90 | 10 |
| తృతీయ | 66.67 | 80 | 20 |
| చతుర్థ | 75 | 80 | 20 |
| పంచమ | 75 | 90 | 10 |
| షష్ఠమ | 80 | 90 | 10 |
| సప్తమ | 85 | 90 | 10 |

ద్వితీయ విత్త సంఘము కేవలము జనాభా ప్రాతిపదికపై ఆదాయపన్ను నిధులను పంపకము చేయవలెనని అంతేకాని రాష్ట్రముల వెనుకబడిన తనము, వెనుకబడిన వర్గములకు చెందిన జనాభా యున్నగు వానిని పరిగణనలోనికి తీసికొనరాదని భావించినది.[5] కాని ఆచరణములోని విధానమును పూర్తిగా వీడనాడలేక (జనాభా ప్రాతిపదిక భారవిలువ 100 శాతముగా వృద్ధి చేయలేక), జనాభా ప్రాతిపదిక భారవిలువను 80 శాతము నుండి 90 శాతమునకు పెంచినది. క్రమేణా ఈ శాతము 100 అగునని రెండవ విత్త సంఘము తలపోసెను. కాని అట్లుకాలేదు.

ఆదాయపన్ను రాబడి పంపకములో ఇప్పటివరకు రాష్ట్ర ఆర్థికాభివృద్ధిస్థాయి (లేక వెనుకబడిన తనము)నకు ఏవిధముగు ప్రాముఖ్యత ఈయబడలేదు. కేవలము జనాభా ఆధారముగాను, పన్ను వసూళ్ళపైనను ఆదాయపన్ను వితరణము ఆధారపడి యున్నది. కాని ఈ విషయములో రాష్ట్రార్థికాభివృద్ధి లేక అనభివృద్ధి పరిగణనలోనికి తీసికొనుట ఆవశ్యకమని పలువురుమేధావులు అభిప్రాయపడుచున్నారు.[6]

## ఎక్సైజు సుంకములు

కేంద్ర ఎక్సైజుసుంకములపై వచ్చు ఆదాయము కేంద్రము రాష్ట్రములు పంచుకొనవలెనని రాజ్యాంగము 272వ ప్రకరణములో పేర్కొనబడినది. కేంద్రమునుండి రాష్ట్రములకు చట్టరీత్యా నిధుల తరలింపులు ద్వారా లభించు ఆదాయములో కేంద్ర ఎక్సైజు సుంకముల పైవచ్చు రాబడి అత్యధికము.[7]

ఎక్సైజు సుంకములకు సంబంధించి ప్రథమ విత్త సంఘము పొగాకు, అగ్గిపుల్లలు, శాకాహార ఉత్పత్తి వస్తువులు పరిగణన లోనికి తీసికొన్నది. మొదనుండి రాష్ట్రములు ఎక్సైజు సుంకము విధించబడు అన్నివస్తువులు ఉమ్మడి వనరుల జాబితాలోనికి చేర్చ వలెనని కోరుచున్నవి. కాని ప్రథమ విత్త సంఘము అందుల కంగీకరించలేదు. స్వల్పాదాయమిచ్చు అసంఖ్యాక వస్తువులను పరిగణనలోనికి తీసికొనుటకు బదులు, అత్యధికాదాయమిచ్చు ఈ మూడు వస్తువులను పరిగణనలోనికి తీసికొనుట ఉచితమని ప్రథమ విత్త సంఘము అభిప్రాయపడినది. ద్వితీయ విత్త సంఘము ఈ వస్తువులు మాత్రమేకాక పంచదార, కాఫీ, తేయాకు, కాగితము, శాకాహార, మాంసాహార నూనెలు కూడా ఉమ్మడి వనరుల జాబితా లోనికి చేర్చినది. మిల్లుద్వారా ఉత్పత్తియగు టెక్స్‌టైల్స్, పంచదార పొగాకులపై, అమ్మకపు పన్నుకు బదులుగా అదనపు ఎక్సైజు సుంకము విధించవలెనని 1956లో తీర్మానింపబడెను. దీనివలన అధికముగా విక్రయింపబడు ఈ సామాన్య వస్తువులపై అమ్మకపు పన్ను వసూలు చేయుటలోగల ఇబ్బందులు నిర్మూలన మగుననియు, పన్ను ఎగవేత అరికట్టబడుననియు ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యము. రు. 50 లక్షలకు తక్కువ ఎక్సైజు సుంకము ఆదాయము నిచ్చు వస్తువులు, మోటారు స్పిరిటు మినహాయించి 1960-61లో ఎక్సైజు సుంకము విధించబడిన సమస్త వస్తువులపై లభించు ఆదాయము రాష్ట్రములకు వితరణము చేయవలెనని తృతీయ విత్త సంఘము భావించినది. కొన్ని నిర్దేశిత పన్నులు, సుంకములు, ప్రత్యేక సుంకములు మినహాయించి అన్నిరకముల ఎక్సైజు సుంకము విధించబడిన వస్తువులు చతుర్థ సంఘము వితరణార్థము పరిగణన లోనికి తీసికొన్నది. తరువాతి సంఘములు ఈ జాబితాలో మరికొన్ని వస్తువులు చేర్చినవి.

ఎక్సైజు సుంకముల మొత్తము రాబడిలో విభిన్న విత్త సంఘములు వేర్వేరు శాతములు రాష్ట్రములకు వితరణము చేయ వలెనని అభిప్రాయపడెను. ప్రథమ విత్త సంఘము ఈ రాబడిలో 40 శాతము రాష్ట్రములకీయవలెనని సలహాయిచ్చెను. కాని ద్వితీయ విత్త సంఘము 25 శాతము మాత్రము రాష్ట్రములకు వితరణము చేయవలెనని సూచించెను. దీనివలన మొత్తము రాష్ట్రములకు పంపిణీచేయబడు నిధులు తగ్గలేదు. ఏలనగా ప్రథమ విత్త సంఘము కేవలము 3 వస్తువులపై లభించిన ఎక్సైజు సుంకము రాష్ట్రములకు వితరణము చేయవలెనని తలచగా, ద్వితీయ సంఘము 25 వస్తువు

లను, తృతీయ సంఘము 35 వస్తువులను, తరువాతి సంఘములు ఇంకను ఎక్కువ వస్తువులను ఉమ్మడి వనరుల జాబితాలోనికి చేర్చినవి. తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠమ సంఘములుకేవలము 20 శాతము రాబడిని మాత్రమే రాష్ట్రముల భాగముగా నేటా యించెను. కాని సప్తమ విత్త సంఘము రాష్ట్రముల భాగమును 40 శాతమునకు పెంచెను.

ఎక్సైజు సుంకము రాబడిని కేవలము రాష్ట్ర జనాభా ఆధారముగా మాత్రమే విభిన్న రాష్ట్రములకు వితరణము చేయవలె నని ప్రథమ విత్త సంఘము యొక్క ఉద్దేశ్యము. ద్వితీయ విత్త సంఘము ఇట్లుకాక 90 శాతము రాష్ట్రజనాభా ఆధారముగాను, 10 శాతము ఇతర కారణముల ఆధారముగాను వితరణము చేయుట మంచిదని భావించెను. మూడవ సంఘము ఈ నిష్పత్తులను నిర్దిష్టముగా పేర్కొనలేదు. చతుర్థ, పంచమ సంఘములు 80 శాతము నిధులు, షష్ఠమ సంఘము 75 శాతము నిధులు రాష్ట్ర జనాభా ఆధారముగా వితరణము చేయవలెనని భావించగా ఏడవ విత్త సంఘము కేవలము 25 శాతము రాష్ట్ర జనాభా ఆధారముగాను, 25 శాతము రాబడి ఆదాయములో లోటు ఆధారము గాను, 25 శాతము దారిద్ర్య శాతము ఆధారముగాను మిగిలిన 25 శాతము రాష్ట్ర తలసరి ఆదాయము యొక్క విలోమానుపాతము ఆధారముగాను వితరణము చేయవలెనని సూచించెను.[8]

[ దిగువ పట్టికకు సంబంధించిన నోట్సు ]

* ఇందు 2/3వ భాగము జాతీయ తలసరి ఆదాయము కంటె తక్కువగానున్న రాష్ట్రములకు విధిగా వితరణము చేయవలెను.

§ రాష్ట్ర తలసరి ఆదాయము యొక్క విలోమానుపాతము

§§ రాబడి ఆదాయములో లోటు : 25 శాతము; దారిద్ర్య శాతము : 25 శాతము.

* *

దారిద్ర్య జనాభా శాతమును పరిగణనలోనికి తీసికొనుట ఇదే ప్రథమము. అంతకు ముందు ఏ విత్త సంఘము తన బాధ్యతలు నెరవేర్చుటలో దారిద్ర్య శాతమును పరిగణించలేదు.

## సహాయ గ్రాంట్లు

రాష్ట్రములకు సహాయ గ్రాంట్లు ఇచ్చుటలో ప్రథమ విత్త సంఘము సాధారణముగా పాటింపదగు నియమములు పేర్కొనినది. రాష్ట్రముల బడ్జటు అవసరములు, పన్ను వసూలు చేయగలశక్తి, వ్యయములో పొదుపు, సామాజిక సేవలస్థాయి, రాష్ట్రములప్రత్యేక

పట్టిక సంఖ్య - 3 కేంద్ర ఎక్సైజు సుంకము వితరణములో విభిన్న అంశములు

| | వస్తువుల సంఖ్య | ఉమ్మడి వనరులలో రాష్ట్రముల భాగము (%) | ప్రాతిపదికలు వాటి భారవిలువలు (%) | | |
|---|---|---|---|---|---|
| | | | జనాభా | ఆర్థికముగా వెనుకబడిన తనము | ఇతరములు |
| ప్రథమ విత్త సంఘము | 3 | 40 | 100 | — | — |
| ద్వితీయ ,, | 25 | 25 | 90 | — | 10 |
| తృతీయ ,, | 35 | 20 | నిర్దిష్టముగా పేర్కొనబడలేదు | | |
| చతుర్థ ,, | కంట్రోలు వస్తువులు, ప్రత్యేకముగా సుంకము నిర్దేశింపబడిన వస్తువులు మినహాయించి అన్ని వస్తువులు | 20 | 80 | 20 | — |
| పంచమ ,, | ,, మరియు 1972-74 సం॥లలో ప్రత్యేక సుంకము విధింప బడిన వస్తువులు | 20 | 80 | 20* | — |
| షష్ఠమ ,, | ప్రత్యేకముగా సుంకము నిర్దేశింపబడిన వస్తువులు మినహాయించి అన్ని వస్తువులు | 20 | 75 | 25 | — |
| సప్తమ ,, | ,, | 40 | 25 | 25§ | 50§§ |

కర్తవ్యములు, జాతీయ ప్రాధాన్యత కలిగిన ఇతర కార్యక్రమములు మొదలగునవి గ్రాంట్లు మంజూరు చేయునపుడు పరిశీలింపదగు విషయములు. తరువాత వచ్చిన సంఘములు మొదటి కమీషన్ యొక్క పై అభిప్రాయముతో ఏకీభవించినవి. కాని అన్ని నియమములు ఒకేసారి పాటించుట క్లిష్టముగాను, అనావశ్యముగాను అభిప్రాయపడినవి. ముఖ్యముగా బడ్జటు లోటు మాత్రమే మిగిలిన సంఘములు పరిగణించినవి. ఆరవ సంఘము సమాజసేవలపై తలసరి వ్యయము, మూలధన నిల్వలస్థాయి, పరిపాలనా దక్షత అధిక్యము చేయవలసిన అవసరము—ఈ మూటిని దృష్టిలో నుంచుకొని గ్రాంట్లు మంజూరు చేసినది. ఏడవ విత్త సంఘము రాజ్యాంగము 275 (1) వ ప్రకరణము ననుసరించి అన్నిరకముల నిధుల వితరణము పిదప రాష్ట్రముల బడ్జటు రాబడి ఆదాయములోని లోటు సవరించుటకు చివరి సాధనముగా గ్రాంట్లు మంజూరు చేయవలెనని భావించినది. ఈ విధముగా చూచినపుడు ఏడవ విత్త సంఘము గ్రాంట్లు మంజూరు చేయుటకు అతి ప్రాముఖ్యత ఈయ లేదని తెలియుచున్నది.

ప్రథమ విత్త సంఘము 13 రాష్ట్రములకు గ్రాంట్లు మంజూరు చేయవలెనని సూచించినది. విభిన్న విత్త సంఘముల ననుసరించి ఏ ఏ రాష్ట్రములకు గ్రాంట్లు లభించెనో పట్టికసంఖ్య 4 తెలియజేయుచున్నది. క్రింది పట్టికను చూచినపుడు గుజరాతు, మహారాష్ట్రలకు ఏ విత్త సంఘము గ్రాంట్లు ఇచ్చుటకు అంగీకరించ లేదనియు, ఆర్థికముగా వెనుకబడిన ఉత్తర ప్రదేశ్‌కు కూడా ఆరవ విత్త సంఘము తప్ప మిగిలిన ఏ విత్త సంఘము గ్రాంట్లు ఈయలేదనియు తెలియుచున్నది.

పట్టిక సంఖ్య 4

**విభిన్న విత్త సంఘముల ననుసరించి**
**గ్రాంట్లు మంజూరు చేయబడిన రాష్ట్రములు**

| విత్త సంఘము | రాష్ట్రములు |
|---|---|
| ప్రథమ విత్త సంఘము : | అస్సాము, బీహారు, హైదరాబాదు, మధ్యభారత్, మధ్యప్రదేశ్, మైసూరు, ఒరిస్సా, పెప్సు, పంజాబు, రాజస్థాన్, సౌరాష్ట్ర, తిరువాన్కూరు-కొచ్చిన్, పశ్చిమ బెంగాల్. |
| ద్వితీయ విత్త సంఘము: | ఆంధ్రప్రదేశ్, అస్సామ్, బీహారు, మధ్యప్రదేశ్, మైసూరు, ఒరిస్సా, కేరళ, పంజాబు, రాజస్థాన్, పశ్చిమ బెంగాల్, జమ్ము - కాశ్మీర్. |
| తృతీయ విత్త సంఘము: | ఆంధ్రప్రదేశ్, అస్సామ్, గుజరాతు, జమ్ము-కాశ్మీర్, కేరళ, మధ్యప్రదేశ్, మద్రాసు, మైసూరు, ఒరిస్సా, రాజస్థాన్. |
| చతుర్థ విత్త సంఘము: | ఆంధ్రప్రదేశ్, అస్సామ్, జమ్ము-కాశ్మీర్, కేరళ, మధ్య ప్రదేశ్, మద్రాసు, మైసూరు, ఒరిస్సా, రాజస్థాన్, నాగాల్యాండ్. |
| పంచమ విత్త సంఘము: | ఆంధ్రప్రదేశ్, అస్సాము, జమ్ము - కాశ్మీర్, కేరళ, మైసూరు, నాగాల్యాండ్, రాజస్థాన్, ఒరిస్సా, తమిళనాడు, పశ్చిమ బెంగాల్. |
| షష్ఠమ విత్త సంఘము : | ఆంధ్రప్రదేశ్, అస్సామ్, బీహారు, హిమాచల ప్రదేశ్, జమ్ము-కాశ్మీర్, కేరళ, మణిపూర్, మేఘాలయ, నాగాల్యాండ్, ఒరిస్సా, రాజస్థాన్, త్రిపుర, ఉత్తర ప్రదేశ్, పశ్చిమ బెంగాలు. |
| సప్తమ విత్త సంఘము : | హిమాచల ప్రదేశ్, జమ్ము-కాశ్మీర్ మణిపూర్, మేఘాలయ, నాగాల్యాండ్, ఒరిస్సా, సిక్కిం, త్రిపుర. |

కేంద్రము యొక్క స్థూల రెవిన్యూ ఆదాయములో విత్త సంఘము ప్రస్తుతము సుమారు 25 శాతము రాష్ట్రములకువితరణము చేయుచున్నది. విత్త సంఘము ద్వారా వితరణము చేయబడునిధులు రెండు రకములు : మొదటిది పన్నుల నిధులు, రెండవది గ్రాంట్లు. ఈ రెంటిలోను పన్నుల నిధుల భాగము అధికము. దాదాపు 20 శాతము పన్నుల నిధులే.

పన్నుల రాబడి వివిధ రాష్ట్రములకు వితరణము విషయములో రాష్ట్ర జనాభా ఆధారముగా 30 శాతము నిధులు, సగటు తలసరి రాబడి వ్యయము ఆధారముగా 30 శాతము, 10 శాతము నిధులు తలసరి సామాజికవ్యయము ఆధారముగను, మిగిలిననిధులు రాష్ట్రముల పన్నులు వసూలు ఆధారముగాను వితరణము చేయ వలెనని ఆచార్య వి. వి. భట్ సూచించెను.[9] కేంద్రపన్నుల

పట్టిక సంఖ్య - 5

**విత్త సంఘము ద్వారా కేంద్రము నుండి రాష్ట్రములకు వితరణము గావింపబడిన నిధులు**

( రు. కోట్లలో )

| విత్త సంఘము | కేంద్రము యొక్క స్థూల రెవిన్యూ ఆదాయము | విత్త సంఘము ద్వారా వితరణము గావింపబడిన నిధులు | | | |
|---|---|---|---|---|---|
| | | పన్నులు | గ్రాంట్లు | మొత్తము | (5) / (2) (%) |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| ప్రథమ | 2921 | 371 (88.1) | 50 (11.9) | 421 (100) | 14.4 |
| ద్వితీయ | 5271 | 822 (80.6) | 197 (19.4) | 1020 (100) | 19.3 |
| తృతీయ | 8737 | 1068 (81.0) | 250 (19.0) | 1318 (100) | 15.1 |
| చతుర్థ | 9158 | 1328 (75.9) | 422 (24.1) | 1750 (100) | 19.1 |
| పంచమ | 24656 | 4643 (86.7) | 711 (13.3) | 5354 (100) | 21.7 |
| షష్ఠమ | 48502 | 8251 (76.7) | 2510 (23.3) | 10760 (100) | 22.1 |
| సప్తమ | 80126 | 19297 (83.7) | 3766 (16.3) | 23063 (100) | 28.8 |

ఆదాయములో రాష్ట్రముల భాగము, విభిన్న పన్నులలో రాష్ట్రముల భాగములను గురించి ఏ విత్త సంఘము నిర్దిష్టమయిన ప్రాతిపదికలు పేర్కొనలేక పోయినవి.10 సప్తమ సంఘము కొన్ని ప్రాతిపదికలు సూచించెను. కాని అవి సంఘ సభ్యులందరకు ఆమోదయోగ్యము కాలేకపోయినవి. ఇదే విధముగా గ్రాంట్లు మంజూరు చేయుటలో పాటింప వలసిన నియమములు నిర్దిష్టముగా పేర్కొనబడలేదు.

ఈ విధముగా ఏ ఏ అంశముల ఆధారముగా నిధులు రాష్ట్రములకు వితరణము చేయవలెనను విషయముపై సమగ్ర దృష్టితో నిర్దిష్టమయిన నియమములు పేర్కొన వలసిన ఆవశ్యకత విదితమగుచున్నది. రాష్ట్రముల బడ్జటు లోటును భర్తీ చేయుట విత్త సంఘము యొక్క ప్రధాన ధ్యేయము కానేరదు. విభిన్న రంగములలో రాష్ట్రముల వెనుకబడిన తనము ఆధారముగా నిధుల వితరణము గావింపబడవలెను.

నేటి మన ఫెడరల్ వ్యవస్థలో ముఖ్యముగా కేంద్రము రాష్ట్రముల మధ్య ఆర్థిక సంబంధములలో విత్త సంఘము యొక్క పాత్ర విశిష్టమయినది. కేంద్రము నుండి రాష్ట్రములకు ప్రణాళికా సంఘము ద్వారా, విత్త సంఘము ద్వారా, ఇతర విధములుగా నిధులు పంపిణీ చేయబడును. ప్రణాళికా సంఘము పూర్తిగా ప్రభుత్వముచే ఏర్పరుచబడి ప్రభుత్వాధీనములో నుండు సంస్థ. కావున ప్రణాళికా సంఘము ద్వారా నిధులు పంపిణీ చేయునపుడు ప్రభుత్వము రాజకీయ కారణములకు ప్రాధాన్యత ఇచ్చుఅవకాశము కలదు. ఆర్థిక దృష్టిలో పరిశీలించినపుడు రాజకీయ కారణములు సముచితముగా నుండకపోవచ్చును. కావున అసమంజసముగు రాజకీయ శక్తులకు లోబడక వివిధ రాష్ట్రముల ఆర్థికాభివృద్ధి దృష్టితో నిధులు సముచితముగా పంపిణీ చేయుట కేవలము విత్త సంఘమునకే సాధ్యము. ఈ విధముగా చూచినపుడు విత్తసంఘమునకు ప్రణాళికా సంఘమునకంటె అధిక ప్రాముఖ్యత ఈయవలెను. కాని నిధుల వితరణములో విత్త సంఘముకంటె ప్రణాళికా సంఘము గురుతర బాధ్యత వహించుచున్నదని పట్టిక సంఖ్య 6 స్పష్టము చేయుచున్నది.

ఇటీవలి కాలంలో మొత్తము నిధులలో అధిక శాతము నిధులు విత్త సంఘము ద్వారా వితరణమగుచున్నట్లు కన్పించుచున్నది. ఇది సంతసించదగ్గ విషయమే.

పట్టిక సంఖ్య - 6

**కేంద్రము నుండి రాష్ట్రములకు వితరణము గావింపబడిన మొత్తము నిధులు**

( రు. కోట్లలో )

| | విత్త సంఘము ద్వారా | | | ప్రణాళికా సంఘము ద్వారా | ఇతరములు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| | పన్నులు | గ్రాంట్లు | మొత్తము | | | |
| 1951-56 | 344 | 103 | 447 (81.2) | 880 (61.5) | 104 (7.3) | 1431 (100) |
| 1960-61 | 668 | 250 | 918 (31.1) | 1344 (47.0) | 892 (21.9) | 2868 (100) |
| 1961-66 | 1196 | 394 | 1590 (28.4) | 2738 (48.9) | 1272 (22.7) | 5600 (100) |
| 1966-69 | 1282 | 500 | 1782 (25.0) | 1917 (26.9) | 1648 (48.1) | 5347 (100) |
| 1969-74 | 4562 | 859 | 5421 (35.8) | 4230 (28.5) | 4949 (35.7) | 15101 (100) |
| 1974-79 | 8337 | 2831 | 11168 (47.1) | 8793 (37.1) | 3761 (15.8) | 23722 (100) |

ముఖ్యముగా విత్త సంఘము తన బాధ్యతలు నిర్వర్తించుటలోను, రాజ్యాంగము ఆశించిన పాత్ర వహించుటలోను స్వతంత్రముగా వ్యవహరించలేక ప్రణాళికా సంఘముపై ఆధారపడుచున్నది. ఫెడరల్ వ్యవస్థలో కేంద్ర ప్రభుత్వము నిధులవితరణము ద్వారా విభిన్న రాష్ట్రములపై నియంత్రణ కలిగియుండును. అంతేకాక రాష్ట్రముల స్వయం ప్రతిపత్తిని దెబ్బతీయవచ్చు. ఈ దృక్పథముతో చూచినపుడు విత్త సంఘమునకు అత్యంత విశిష్టమయిన స్థానమీయవలసిన అవశ్యకత ఎంతయినాఉన్నది. కేంద్రము, రాష్ట్రముల మధ్య సహకారము, సత్సంబంధము, సుహృద్భావము కల్గించుట విత్త సంఘము యొక్క ముఖ్య బాధ్యత. అంతేకాక కేంద్రప్రభుత్వము యొక్క ఇష్టాయిష్టముల కనుగుణముగా ప్రవర్తించుట రాజ్యాంగములో నిర్దేశించిన ఆశయములకు అన్యాయము చేకూర్చుటయే అగును.

విత్త సంఘము ఒక తాత్కాలిక సంస్థ. సంఘము నియమింపబడిన నాటినుండి నివేదిక సమర్పించునాటివరకు మాత్రమే అస్థిత్వము కలిగియుండును. అనగా సాధారణముగా ప్రతిసంఘము యొక్క కాలపరిమితి కేవలము ఒకటి రెండు సంవత్సరములు మాత్రమే. అట్లు కాక విత్త సంఘము ప్రణాళికా సంఘమువలె శాశ్వత సంస్థగా రూపొందించబడవలెనని పలువురు అభిప్రాయపడిరి.

విత్త సంఘము, ప్రణాళికా సంఘముల మధ్య పరస్పర సహకారము ఎంతయినా అవశ్యకము. విత్త సంఘము తరువాత 5సం.ల గురించి, ప్రభుత్వ ఆదాయ వ్యయముల గురించి అంచనాలు తయారుచేసి వాటి ఆధారముగా నిధుల వితరణము గురించి సలహాలిచ్చును. విత్త సంఘము తాత్కాలికముగా నియమింపబడిన సంఘము కావున ఖచ్చితమయిన అంచనాలు చేయుటలో చాలా సమస్యలు ఎదుర్కొనవలసి వచ్చును. ఈ విషయములో ప్రణాళికా సంఘముయొక్క సహకారము ఎంతయినా అవశ్యకము. అంతేకాక విత్త సంఘము; ప్రణాళికా సంఘములు వేర్వేరుగా రాష్ట్రములకు గ్రాంట్లుఇచ్చుటవలన రాష్ట్రములమధ్య అసమానతలు, అవకతవకలు అధికమగుటకు ఎంతయినా అవకాశముండును. కావున ప్రణాళికా సంఘము, విత్తసంఘము పరస్పరము సహకరించుకొనవలెను.

ప్రణాళికలు తయారు చేయునపుడు రాబడి వ్యయము, మూలధన వ్యయము-రెండును సమన్వయము గావింపబడును. కాని మూల ధనము విత్తసంఘము పరిధిలోనికి రాదు. విత్తసంఘము ముఖ్యముగా ప్రణాళికేతర రాబడి అవసరములు గురించి మాత్రమే ఆలోచన చేయును. ప్రణాళికేతర మూలధన బడ్జటు లోటుపాట్లు విత్తసంఘము పరిధిలోనికి రావు. (ప్రప్రథమముగా ఆరవ విత్త సంఘము ప్రణాళికేతర మూలధన బడ్జటును కూడా పరిశీలించవలసినదిగా కోరబడినది). ఇంతేకాక ప్రణాళికా సంఘము, విత్త సంఘముల బాధ్యతలు పూర్తిగా వేర్వేరు కావు. కావున అపుడపుడు రెంటిమధ్య చిక్కులు ఏర్పడును. అట్టి పరిస్థితులలో ప్రణాళికా సంఘముదే పైచేయి అగును. అంతేకాక అన్ని పరిస్థితులలో ప్రణాళికా సంఘము విత్తసంఘము సలహాలకు విరుద్ధముగా నిధులు వితరణము చేయుటకు అవకాశమున్నది. ఈ విధముగా చూచినపుడు విత్తసంఘము యొక్క పాత్ర అతి స్వల్పమని తెలియుచున్నది.

ఈ సందర్భములో మూడవ విత్తసంఘము రెండు సూచనలు చేసినది. 1. విత్తసంఘము యొక్క పరిధి విస్తృతము గావించి బాధ్యతలు స్పష్టముగా పేర్కొనవలెను. 2. సరియగు సమయములో ప్రణాళికా సంఘమును విత్త సంఘములో విలీనము గావింపవలెను. విత్త సంఘము తన బాధ్యతలు నిర్వర్తించుటలో ప్రణాళికా సంఘము ఆటంకము కల్గించుచున్నదని దాదాపు అన్ని విత్త సంఘములు భావించినవి.12 కావున రెండిటి మధ్య పయోధ్యత కలిగించుట ఎంతయినా అవసరము. విత్తసంఘము సమర్పించు నివేదిక వర్తించుకాలము పంచవర్ష ప్రణాళికా కాలము ఒకేరీతిగా నుండుట ఎంతయినా అవశ్యకము. కాని అట్లు సంభవించుటలేదు. ఉదాహరణకు మొదటి మూడు పంచవర్ష ప్రణాళికల కాలము, మొదటి మూడు విత్త సంఘముల నివేదిక వర్తించు కాలముల మధ్య తేడా కలదు. అదే విధముగా ప్రస్తుతము ఆరవ పంచవర్ష ప్రణాళికా కాలము, ఏడవ విత్తసంఘము నివేదిక వర్తించు కాలములమధ్య ఎక్కువ భేదము కన్పించును. దీనివలన కొన్ని అనవసర సమస్యలుద్భవించును. దీనిని సరిచేయుట కష్టతరము కాదుకదా! ఈ విధముగా కొన్ని స్వల్ప మార్పులతో కేంద్రము రాష్ట్రముల మధ్య ఆర్థిక సంబంధములలో విత్త సంఘముయొక్క పాత్ర చాలా వరకు మెగురుపరచవచ్చును.

## అధోజ్ఞాపికలు

1. రిపోర్ట్ ఆఫ్ ది సిక్స్త్ ఫయినాన్స్ కమీషన్, పారా 2.2
2. భారత రాజ్యాంగం, ఆర్టికల్ 280 (1)
3. ఆస్ట్రేలియా, నైజీరియా, భారత దేశములలో విత్త సంఘముల గురించి సూక్ష్మముగా తెలిసికొనుటకు యు. కె. హిక్స్ రచించిన "ఫెడరల్ ఫయినాన్స్ ఇన్ ఎ డెవలపింగ్ ఎకానమీ,' ఎఫ్. ఎమ్. యు. అకేషనల్ లెక్చర్ 2 (ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్, న్యూఢిల్లీ) చూడుడు.
4. రిపోర్ట్ ఆఫ్ ది (సెవెన్త్) ఫైనాన్స్ కమీషన్ 1978, పుట 64.
5. రిపోర్ట్ ఆఫ్ ది సెకెండ్ ఫయినాన్స్ కమీషన్ పుట 104.
6. ఉదాహరణకు ఎన్. జె. రూవెరీ : "సెవెన్త్ ఫయినాన్స్ కమీషన్స్ రికమండేషన్స్, ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ, డిసెంబరు 1978, 23-30.
7. రిపోర్ట్ ఆఫ్ ది సెవెన్త్ ఫయినాన్స్ కమీషన్ పుట 63,65
8. సప్తమ విత్త సంఘ సభ్యుడయిన ఆచార్య రాజకృష్ణ ఈ నాల్గింటిలో కేవలము మూడు (జనాభా, దారిద్ర్యము, తలసరి ఆదాయము యొక్క విలోమానుపాతము) ప్రాతిపదికల ఆధారముగా విత్త వనరుల వితరణము గావించుట మరెంతో మంచిదని భావించెను. నోట్ ఆఫ్ డిసెంట్ బై ప్రొఫెసర్ రాజకృష్ణ ఎన్‌టైటిల్డ్ "ఎ మోర్ ఈక్విటబుల్ డిస్ట్రిబ్యూషన్ ఆఫ్ రిసోర్సెస్". ఇన్ ది రిపోర్ట్ ఆఫ్ ది సెవెన్త్ ఫయినాన్స్ కమీషన్.
9. వి. వి. భట్ : "ఆన్ ది మాగ్నిట్యూడ్ ఎండ్ ఎలొకేషన్ ఆఫ్ ఫెడరల్ ఎసిస్టెన్స్ టు ది స్టేట్స్ ఇన్ ఇండియా : సమ్ రేషనల్ క్రయిటీరియా", పబ్లిక్ ఫయినాన్స్ (1969)
10. ఎ. టి. ఈపెన్: "ఎ క్రిటిక్ ఆఫ్ ఇండియన్ ఫిస్కల్ ఫెడరలిసమ్", పబ్లిక్ ఫయినాన్స్ (1969).
11. రిపో. ఆఫ్ ది థర్డ్ ఫయి. కమి. పుట 80.
12. రిపో. ఆఫ్ ది ఫోర్త్ ఫయి. కమి. పారా 8.

ఈ వ్యాసమునందలి పట్టికలు విభిన్న విత్త సంఘముల నివేదికల ఆధారముగా తయారు చేయబడినవి. పైన పేర్కొన్న రచనలేకాక ఈ వ్యాస రచనకు ఈక్రింద పేర్కొన్న రచనలు ఉపకరించినవి. 1. డి. టి. లక్‌డావాలా : "ది ఫోర్ ఫయినాన్స్ కమీషన్స్ ఇన్ ఇండియా" ఇండియన్ ఎకనామిక్ జర్నల్ (1966); 2. కె. వి. యస్. శాస్త్రి : ఫెడరల్ స్టేట్ ఫిస్కల్ రిలేషన్స్ ఇన్ ఇండియా ; 3. ఎస్. చంద్రశేఖర్ : "ఇండియన్ ఫెడరల్ ఫిస్కల్ ఎడ్జస్ట్‌మెంట్", ఇండియన్ జర్నల్ ఆఫ్ సోషల్ సయిన్సెస్ (1973) ; 4. వి. కె. ఆర్. వి. రావు : "రేషనలైజేషన్ ఆఫ్ సెంటర్ - స్టేట్ ఫయినాన్షియల్ రిలేషన్స్ :. ఇష్యూస్ బిఫోర్ ది సిక్స్త్ ఫయినాన్స్ కమీషన్", ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ (1973) ; 5. అర్. జె. చెల్లయ్య ఇతరములు : "ట్రెండ్స్ ఎండ్ ఇష్యూస్ ఇన్ ఇండియన్ ఫెడరల్ ఫయినాన్స్" (నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఫయినాన్స్ ఎండ్ ఫిస్కల్ పాలిసీ, న్యూఢిల్లీ, 1978).



# జ్ఞాపకావృత్తి

శ్రీ పూలికుంట పార్థసారథిరెడ్డి

సాయంత్రాన్ని
కప్పులోకి వొంచి
సిప్ చేస్తూ
పెదవుల కంటిన
తెలిమబ్బు తునకల్ని
సుతారంగా తుడి చేస్తూ
రెటీనా కావలి కెమెరాలో
సిందూరంపై కూర్చున్న కాంక్షని
హృదయం క్లిక్ చేస్తూన్నపుడు
జ్ఞాపకాలు ప్రేలి
గుబులు పొగ మెలికల్లో
మనసు విరుచుకు పడుతుంది.

నరాలు వయెలిన్ తీగలౌతాయి.

విషాదం ప్రకంపిస్తూ
ముఖారి గొంతుకలో మూర్ఛనలు పోతుంది.
నాలోని నేను సైతం
అస్థిత్వం వెతుక్కుంటుందా క్షణంలో.
చివరికి
గతం మరకని తుడిచేందు కహం
నిశి గర్భాన దాగి
దాని రక్తాన్ని ఊపిరిని ప్రచుకుని
వెలి కావాలనే తపన
తొలి సంధ్యలో
పురుడు పోసుకుంటుంది.

అంతవరకూ సాక్షిగా వీక్షించిన గుడ్డిదీపం
ఒక్కసారిగా గదినంతా కలయజూసి
ఆఖరి శ్వాస నెగబీలుస్తూ అందించిన
ఆశిస్సులు
పదిగంటల పాశైనా ఎదగక ముందే
ఇటు సూర్యుడు
అటు వొరిగి జారిపోతూంటాడు.

మళ్లీ —
అంతరంగ పుటావర్తంలో
వెలుగు గీతల చిత్రాలు మునుగుతూంటే
కప్పులోకి సాయంత్రం వొంగుతుంది
రంగులు తేలుతూ !!
కెరటు కిరీటంతో కడలి పొంగుతుంది
నురగలు గ్రక్కుతూ !!



డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# శిశు వాక్కు - లక్షణావృత్తి

శ్రీ సర్దేశాయి తిరుమలరావుగారి (చూ. భారతి, అక్టోబరు 1980 పుట 73) లేఖాంతంలోని ఆశయాన్ని సఫలీకృతం చేస్తూ ఈ 'Notes' ని పాఠకులకు అందించడంలో రెండు శాస్త్రీయ ప్రయోజనాలు ఆశింపబడ్డాయి.

(1) శిశు వాగ్వ్యవహారాన్ని అర్థదృష్టితో పెద్దల భాషకన్నా భిన్నమైన స్వభావం కల్గిందిగా నిరూపించడం.

(2) శిశు వ్యవహారంలోని నిర్హేతుకత; సామ్య దర్శన లక్షణాల్ని ఆధారంగా భాషా నిర్వచనాన్ని, సమగ్రం చెయ్యడానికి ప్రయత్నించాల్సిన అవసరాన్ని గుర్తించడం.

ఈ రెండు అంశాల్ని సాధించడానికి లక్షణ (మెటఫర్) అనే పరోక్ష వాగ్వ్యాపార దశను ప్రమాణంగా వాడుకోవడం జరుగుతుంది. (చూ. అధస్సూచిక 1) - 'లక్షణ' అంటే విశేషార్థ కల్పనమని స్థూలంగా చెప్పుకోవచ్చు. అంటే వ్యవహారంలో ఒకఅర్థం వుండి, ఆ అర్థంలో కాకుండా మరో విశేషార్థంలో ఒక వాగ్రూపం ప్రవర్తిస్తే ఆ వ్యాపారాన్ని 'లక్షణ' అని అంటాం. ఆ అర్థ విశేషాన్ని లక్ష్యార్థం అని పిలవవచ్చు. ఇక్కడ రెండు సమస్యలున్నాయి. (a) వ్యవహారార్థం ఉండాలి. (b) విశేషార్థం కలగాలి. (a)ని ఆధారంగా (b) పుడుతోంది కాబట్టి రెండవదాని స్థితి మొదటిదాని ఉనికిపైనే ఆధారపడుతోందని అర్థం.

ఈ దృష్టితో శిశు వ్యవహారంలో ఇంతవరకా నా రచనల్లో గుర్తింపబడిన దశ - (1) వ్యావహారికార్థం లేని భౌతిక ప్రక్రియా జన్యమైన రూప నిష్పత్తికి సంబంధించింది కాగా — ఇక్కడ గుర్తింప బోయేది (2) వ్యావహారికార్థంతో పాటుగా శిశువులో వృద్ధిపొందే విశేషార్థ కల్పనకి సంబంధించిన రెండో దశ. అలాంటప్పుడు ఇది శిశువాగ్వ్యవహారం ఎలా అవుతుందన్న ప్రశ్న రావచ్చు.

ఈ విషయం స్పష్టం చెయ్యడానికి పెద్దలభాషలో విశేషార్థం ఎలా కల్పింపబడుతోందో ఒక ఉదాహరణం చూద్దాం. (నాగరకుల భాషలోకంటె జానపదుల భాషలో ఈ ప్రక్రియకు వ్యాప్తి అధికమని పరిశోధనలు నిరూపిస్తున్నాయి (చూ. అధస్సూచిక - 2).

'అమ్మో! ఆ ఆఫీసరు బకాసురుడు' అనే వాక్యం తీసుకొందాం బకాసురుడు భారతంలో ఒక పాత్ర. ఎంత తిన్నా తృప్తి మిగలని వాడనే భావంలో బకాసురుడిలోని రాక్షస భోజనత్వాన్ని ఆధారంగా పుట్టిన విశేషార్థం పైవాక్యంలో ఆ ఆఫీసరు లంచగొండితనాన్ని సూచిస్తోంది. వ్యవహర్త విశేషార్థాన్ని గుర్తించడం 'బకాసురుణ్ణి' గురించిన పరిచయం వుంటేనే సాధ్యం. పురాణపాత్రలు 'ఇడియమేటిక్ ఎక్స్‌ప్రెషన్స్'లో, 'మాడెల్స్'గా మిగులుతాయని అర్థం. మరో ఉదాహరణం.

'అం: గొర్రెలు తినేవాడు పోయి బర్రెలు తినేవాడొచ్చాడు'

ఒక అధికారి మారి మరో అధికారి (అతనికంటె ఘనుడు=దుర్మార్గుడు) ఆ సీటులోకి వస్తే చెప్పుకొనే మాటగా రూఢిలోకి వచ్చేసింది ఇది. (నానుడి అని ఇలాంటి వాటినే అంటాం- సామెత- జాతీయాలు ఇందులో భాగాలే- వీటన్నిటిని కలిపే అంశం ఇక్కడ మనం పరిశీలిస్తున్నాం)

పెరెంటిలోనూ వ్యవహారార్థాలు మాటునపడి సందర్భవశంగా విశేషంగా బోధపడే భావాలే ప్రధానమవుతున్నాయి. ఈ ప్రక్రియలో

| | | | |
|---|---|---|---|
| (a) | ఆఫీసరు | = | బకాసురుడు |
| | తినేవాడు | = | తినేవాడు |
| | లంచం/ | | మనుష్యుల్ని/ |
| | మనుష్యుల్ని | = | తిండిని |

( = అంటే సమానమని అర్థం. —> అర్థ గమన దిశ )

| | | | | |
|---|---|---|---|---|
| (b) | గొర్రెలు | ≠ | బర్రెలు | |
| | చిన్నవి | < > | పెద్దవి | (≠ అంటే |
| | తినేవాడు | = | తినేవాడు | అసమానమని |
| | మొదటి ఆఫీసరు | | రెండో ఆఫీసరు | అర్థం) |

(a)లో తినేవాడు (b)లో ఆఫీసరు లుప్తంగావున్న అంశాలు (గీట్లు కొట్టబడ్డ రూపాలు). (a) లో రెండు నామవాచకాల్ని - సమాన ధర్మాల్ని కలిగినవాటిని ప్రక్క ప్రక్కలో వుంచడంవల్ల - వాటికి అంతర్గతంగా వున్న సమానధర్మ క్రియ బోధింపబడుతోంది. ఇక్కడి లక్షణావృత్తి సమానధర్మాల్ని ఆధారంగా ఏర్పడుతోంది

(b) లో గొర్రెలకు, బర్రెలకు పరిమాణంలో, గుణంలో వున్న భేదాల్ని అధారంగా పోయి అన్న అసమాపక క్రియ సంధానాంశంగా వుండటంతో తినేవాళ్ళలోవున్న భేదం సూచింపబడుతోంది. మొదటి ఆఫీసరుకి, రెండో ఆఫీసరుకి మధ్య నున్న గుణ తారతమ్యం ఇక్కడ గ్రహింపబడుతోంది. ఇక్కడి లక్షణావృత్తి భేదాల్ని ఆధారంగా పుడుతోంది.

శిశువృద్ధ భాషలమధ్యన భేదం ఇక్కడేవుంది. శిశుభాషలో (a) వంటి సందర్భాలు కనిపిస్తున్నాయి తప్ప (b)వంటివిలేవు. అందే శిశువుల్లో సామ్యదర్శనం వున్నంతగా భేద పరిగణనం వుండదని నాపరిశీలనలో బయటపడ్డ సమాచారాన్ని బట్టితెలుస్తోంది. అందుచేత శిశువాక్కులోని లక్షణావృత్తి ప్రత్యేకంగా పరిశీలనీయం (చూ. అధస్సూచిక 3)

కాబట్టి శిశువ్యవహారాన్ని 1. సామ్యదర్శనం 2. భేద పరిగణనం అనే రెండు అంశాలకింద ఇక్కడ మనం పరిశీలించ వచ్చు.

సామ్య దర్శనం: రూపం, వ్యాపారం ప్రభావం అనే మూడు అంశాలకి సంబంధించింది శిశువు చేసే సామ్యదర్శనం. మాపిల్లల్లో సామ్యదర్శనం రూపంలో, కింద అంశాల్లో గుర్తింపబడింది.

(a) రామారావు : ఏ సినిమాలోని మగ నటుడికైనా పేరుగా (ఉదాహరణకు శంకరాభరణంలోని చంద్ర మోహన్‌కు కూడా 'రామారావు' అనడం పాప 2-3½ సం. మధ్య)

(b) సుజాత : ఏ సినిమాలోని నటికైనా పేరుగా ('గురు' చిత్రంలోని జయప్రదను 'సుజాత' అనడం- పాప 2-3½ సం. మధ్య)

(c) గోరింటాకు : ఏ సినిమాకైనా పేరుగా (నాకూ, రూపావతి మధ్య సంభాషణ ఇది- ఏ సినిమాకు వెళ్లాంతల్లీ! 'గోరింటాకు'. నిన్న ఏ సినిమా చూశాం? 'గోరింటాకు' (పాప 3-4 సం. మధ్య)

d) కుమారదేవి : ఇంటికి వచ్చే 20-25 సంవత్సరాలమధ్య నున్న ఏ యువతీ అతిథికైనా- ఇదే పేరిట పిలవడమే (పాప, బాబు 2-3 సం.)

(e) అప్పయ్య : బిచ్చగాడికి/బూచోడికి పర్యాయంగా (మరో పూర్లోనూ ఇదీ పేరే- మరోవ్యక్తికైనా- ఆ ఆకారంలాంటిది కనిపిస్తే (పాపలో 3½సం.దాకా)

(f) వినాయుడు : (<వినాయకుడు) - హనుమంతుడి బొమ్మను చూసి వినాయకుడని ఒకసారి అని, మరోసారి 'కోతి' అని పాప గుర్తించింది (2-3 సం. మధ్య) ఏనుగు బొమ్మను చూసి వినాయకుడని, మళ్ళీ కాదని, ఏనుగ్గా గుర్తించింది (3-4 సం. మధ్య) (భేద పరిగణనలో రెండు దశలు ఇక్కడ గుర్తింపబడ్డాయి)

(g) పాము/పురుగు : నల్లదారం/వంకర టింకరగా ఉన్న రబ్బరు మొ. ఏ కీటకమైనా పురుగే (బాబు 2-2½ సం.)

కింది అంశాల్లో భేద పరిగణనం గుర్తించాం. ఇందులోకొన్ని వర్గాలు కనిపిస్తున్నాయి. (ఇవిగుర్తించింది మొదట మా శ్రీమతిగారు. నేను చేసింది వర్గీకరణం మాత్రమే.

(a) కింది అంశాల్లో భేదం స్పష్టంగా గుర్తింపబడింది.
రస్కు x బిస్కెట్ x బ్రెడ్
పెన్ను x పెన్సిలు x బలపం x చాక్ పీసు
ఇడ్లీ x దోసె
కాఫీ x బోర్న్‌విటా (పాపలో 3-4 సం. మధ్య)

(b) కింది అంశాల్లో భేదం అస్పష్టతగా వుంది.
చపాతీ x పూరీ
కాఫీ x టీ
సూట్‌కేసు x మెటల్ బాక్సు (పాపలో 4 సం.లో కూడా)

(c) కింది అంశాల్లో భేదం అస్సల్లేదు
రేడియో = టేప్ రికార్డర్
బెల్లం కాఫీ = పంచదారకాఫీ (పాపలో 4 సం.లో కూడా)

బాబులో (2½ సం.) భేదం లేని చోట్లు ఎక్కువగా కని పిస్తున్నాయి. దేహభాగవాచకాల్లో కూడా అలాంటి భేదం కొన్ని చోట్ల గుర్తింపబడటంలేదు; (బొడ్డు - అలాంటి ఉదాహరణము). 14 నెలల ప్రాంతంలో 'అమ్మ' అని నన్ను, 'అప్ప/నాన్న' అని వాళ్ళ అమ్మను, పిలవడం జరిగింది. 14-24 నెలల మధ్యలో తాను 'పాప' అని, వాళ్ళ అక్కయ్య 'బాబు' అని అనడం గమనించాం. ఈ వ్యాసం తయారు చేస్తున్న రోజున (1-11-80)న మరోవిషయం గమనించాం. పూవు x చెట్టు నడుమ గమనించిన భేదాన్ని బాబు, చెట్టు x ఆకుల మధ్యన గుర్తించలేక పోయాడు. ఆకును 'చెట్టు'ని 'రిఫర్' చెయ్యడం గుర్తించాం.

దీన్నిబట్టి శిశువుల్లో మౌలికంగా సామ్యదర్శనమూ, బుద్ధివిక సనంతోపాటుగా భేద పరిగణనమూ వృద్ధిపొందుతాయని నేను గుర్తించాను. ఆయా వస్తువులతోపాటు పిల్లలకి ఉన్న సంసర్గ సాహచర్యాలు-సామ్యదర్శనానికి హేతువులుగా మారుతున్నాయని మనం గుర్తించవచ్చు.

మా పిల్లలిద్దర్లోనూ గమనించిన ప్రభావ సామ్యదర్శనం తియ్యకి సంబంధించింది. ఇద్దరికీ-అందరు శిశువులకిలాగానే 'తీపి' ఆహారంలో ప్రధానవస్తువు. తాగే ద్రవాలన్నీ దాదాపు తీయటివే. ఈ తీయదనం వాళ్ళిద్దర్లోనూ ఒకవైపు రూపసామ్యాన్ని, మరో వైపు ప్రభావ సామ్యాన్ని దర్శింప చేసిందనడానికి ఉదాహరణ లున్నాయి.

హోమియోపతి మాత్రల్ని 'తియ్యా' అని పిలవడం ఇద్దర్లోనూ వుంది. భేద పరిగణన లేకుండా 'మజ్జిగన్నాన్ని' కూడా

'తియ్యగావుంది' అనడం గుర్తించాం. తినడానికి బాగావున్న ఏ పదార్థమైనా 'తియ్య' అయిపోయింది. (పాపలో ఈ దశ 42 నెలల తర్వాత తగ్గిపోయింది-ఇప్పుడు అసలు లేదని చెప్పలేం కాని-మళ్ళీ ఎప్పుడంటుందో చెప్పలేం)

ఒకరోజున (1978లో) 'బిస్మిల్లాఖాన్' (షహనాయ్ విద్వాంసుడు) చిత్రపటాన్ని చూసి 'ఆ ఫోటో తియ్యగావుంది' అని మాపాప అనడంతో నాకు 'యురేకా' అని అరవాలనిపించింది. ఇది గుణ సామ్యదర్శనానికి నిదర్శనం. ప్రభావజన్యం. ('మాధుర్య' అంటే సంస్కృతంలో తీపు <మధు-తేనె; 'మాధుర్య' గుణాన్ని గురించిన అలంకారిక మీమాంస సాహిత్య శాస్త్రంలో చాలా ప్రధానం-చూ. అధస్సూచిక 4).

మా పిల్లలిద్దర్లోనూ ప్రక్రియకు సంబంధించిన సామ్య దర్శనం ఇంకా నేను గమనించలేదు. అది మరో అబ్బాయిలో గమనించాను. ఆ ఉదాహరణ ఇక్కడ ప్రస్తావిస్తాను.

ఒకరోజున ఆ అబ్బాయి (6 సం.) నాతోపాటు ఇంటిబయట వున్న కొళాయి దగ్గర నుంచున్నాడు. ఆ అబ్బాయి పక్కయింటి వాళ్ళ కుర్రాడు. చాలా చురుకైన పిల్లాడు. అసలే అనంతపురం, అందులో ఎండాకాలం. మరీ మెట్టైనా లొకాలిటీ. కుళాయిలో నీళ్లు ఎలా వస్తాయి చెప్పండి. బొట్టు బొట్టుగా కారుతూంటే ఆ అబ్బాయి నాతో ఇలా అన్నాడు:

'చూడు మామా! కొళాయి ఏడుస్తోంది పాపం' అని.

ఇదేదో సినిమా డైలాగులా వుంది - తప్పా! అనిపించేంత అసహజంగా వుంది నాకావాక్యం. ఏడవటంలో బొట్టు బొట్టుగా నీళ్ళు కారేదశ ఆ అబ్బాయికి బాగా అనుభవంలోవున్న ప్రక్రియ కాబోలు. దాన్ని కొళాయిలో దర్శించాడా బాలకవి (చూ. అధస్సూచిక 5). ఈ సంఘటన 1977లో జరిగింది. అప్పుడంత ఆశ్చర్యం కలగలేదు కాని, ఈ శిశువాగ్వ్యవహారాన్ని ఆలోచిస్తూ వుండగా 1978లో మా పాపలోకూడా ఈ సామ్యదర్శనం గుర్తించడంతో-ఈనాడు శిశువ్యవహారంలోని లక్షణావృత్తిని గురించి శాస్త్రీయంగా చర్చించడానికి అవకాశం దొరికింది.

ఈ విషయాల్ని ఇంకా కొంతమంది పిల్లలతో పోల్చిచూసి నిర్ధరించుకోవాల్సిన అవసరంవుంది. ఆ ప్రయత్నంకూడా ఇప్పుడు నా పరిశోధనా కార్యక్రమంలో భాగంగా సాగుతోంది.

భాషను సమగ్రంగా నిర్వచించాలంటే శిశువ్యవహారంలోని ఈ లక్షణావృత్తినికూడా స్వీకరించాల్సిన అవసరం వుంది. భాషలో సంకేతాలున్నాయి. సంకేతాలు యాదృచ్ఛికాలు- కాని శబ్దం, భావం అనువిద్ధంగా సంకేతంలో బంధింపబడివున్నాయి. అర్థం మాత్రమే సాంఘికం. మార్పుకి లోనవుతూ వుండే అంశం. భావంతో సంబంధం అప్రత్యక్షంగా వుంటూ- అర్థంతో సంబంధం లేని ఈ శిశువ్యవహార దశ వాక్కుని భావానికి ప్రత్యక్షీకరణంగా గుర్తించడంలో ప్రధాన ఘట్టం. ఈ పరిశీలన ఆ ప్రయోజనం కోసం చెయ్యబడింది.

## అధస్సూచికలు

1. 'లక్షణ' అన్న అలంకారిక పరిభాషకు సంబంధించిన మౌలిక పరిచయానికి చూ. కుంజున్ని రాజాగారి గ్రంథం (1963, 77). లక్షణకు సంబంధించి కింది నిర్వచనాలు ఈ సందర్భంలో చాలు. (అనువాదాలు ఇవ్వడంలేదు-చర్చ చాలా పెరిగే అవకాశం వుందికాబట్టి).

(a) పదార్థాన ప్రసిద్ధతయా ఉత్ప్రేక్ష్యతే ఇతిభక్తిర్ధర్మః తతః ఆగతో లాక్షణికోఽర్థః-(లోచనం పుట 28)

(b) తత్సంబంధాత్ ఫల నిష్పత్తేస్తేషు ఫలవదుపచారః (గౌతమ న్యాయసూత్రాలు 4-1-54, పుట 122)

(c) సహచరణ-స్థాన- తాదర్థ్య - వృత్త - మాన-ధారణ - సామీప్య - యోగసాధనాధిపత్యాలు విశిష్టార్థ హేతువులు. (న్యాయసూత్రాలు 2-2-64, పుట. 60)

(d) లక్షణా ఇతిచేద్వరం-లక్షణానకల్పితా-నయాగాభిధానం-లౌకికీహిలక్షణా-హాతోఽ ప్రసిద్ధ కల్పనా-
(శబరస్వామి బ్రహ్మసూత్ర భాష్యం.)
(కుంజున్నిరాజా పుటలు 262-63)

(e) అర్థ ప్రకరణాపేక్షో యోనా శబ్దాంతరైస్సహ యుక్తః ప్రత్యాయయత్యర్థం తంగేణమపరం విదుః
(భర్తృహరి, వాక్యపదీయం 2-264)

(f) ముఖ్యార్థబాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజనాత్ అన్యోఽర్థో లక్ష్యతే యత్సా లక్షణారోపితక్రియా
(మమ్మటుడు-కావ్యప్రకాశం 2-9)

(g) వాచకత్వాశ్రయేణైవ గుణవృత్తిర్వ్యవస్థితా
(ధ్వన్యాలోకం 1-18)

లక్షణతో 'ఉపచార', 'గౌణ', 'భక్తి'-ప్రక్రియల్ని సూచిస్తాయి. (వీటిపైన విశేషచర్చలకు చూ. బ్రహ్మానంద 1979)-, పాశ్చాత్య ఆలంకారిక సంప్రదాయంలో అరిష్టోటిలులో మొదటిసారిగా మెటఫరుకి సంబంధించిన శాస్త్రీయ వివరణ కనిపిస్తోంది.

"మెటఫర్ ఈస్ ది సింతసిస్ ఆఫ్ సెవరల్ యూనిట్స్ ఆఫ్ అబ్సర్వేషన్ ఇన్‌టు వన్ కమాండింగ్ ఇమేజ్, ఇట్ ఈస్ ది ఎక్స్‌ప్రెషన్ ఆఫ్ ఎ కంప్లీట్ అయిడియా, నాట్ బయి ఎనాలిసిస్, నాట్ బయి అబ్‌స్ట్రాక్‌ట్ స్టేట్‌మెంట్, బట్ బయి ఎ సడెన్ పర్సెప్షన్ ఆఫ్ యాన్ ఆబ్జెక్టివ్ రిలేషన్" (పొయటిక్స xxii, పుట 16, 17, చూడండి రీడ్ పుట 23, 1968)

అరిష్టోటిలు అభిప్రాయం ప్రకారం 'మెటఫర్' ని వాడటం భాషా పరిజ్ఞానం వుందనడానికి పరాకాష్ఠా లక్షణం. ఒకరినుంచీ నేర్చుకోబడేది కాదీప్రక్రియ. ప్రజ్ఞకు నిదర్శనం. సామ్యదర్శన జన్యం.

"సిన్స్ ఎ గుడ్ మెటఫర్ ఇంప్లయిస్ యాన్ ఇన్‌ట్యూటివ్ పర్సెప్షన్ ఆఫ్ ది డిస్సిమిలారిటీస్" (రీడ్ పుటలు 23, 1968)

(సోక్రటీసు, ప్లేటో, అరిష్టోటిలులు ముగ్గురూ 'ప్రిమిటివ్' భాషను భిన్న లక్షణాలు కలిగిందిగా భావించారు. వ్యక్తి దృష్టితో శిశువు 'ప్రిమిటివ్' నాగరక సమాజం దృష్టితో జానపదులు ప్రిమిటివ్. ఈ జానపద, శిశు సామ్యలక్షణాల్ని ఇంకా బాగా పరిశోధిస్తేకాని అరిష్టోటిలు అభిప్రాయంలోని సత్యం బాగా బోధపడదు).

ఇంతవరకు అరిష్టోటిలు సామ్యదర్శన దృష్టితో మాత్రమే 'మెటఫర్'ని పరిశీలించాడని అందరూ భావిస్తున్నారు. ఆధునిక విమర్శకుల్లో కొందరు 'మెటఫర్'ని భేదాల్ని ఆధారంగా కూడా పరిశీలించవచ్చని అభిప్రాయపడుతున్నారు.

పూర్వవ్యాసంలో (భారతి, మార్చి 1980) నేను చూపించిన ఉదాహరణల్లో శబ్దానికి- అర్థంలేనిచోట్లు-కాని భావం ఉన్నచోట్లు ప్రదర్శించాను. వాక్కును వ్యంజకంగాగుర్తించడంలో ఇదిసగభాగం మాత్రమే. దీన్ని సాక్షాచ్ఛబ్దనివేదిత శక్తిగా మనం గుర్తించవచ్చు, తక్కిన సగం ఈ వ్యాసంలో చర్చింపబడింది. లక్షణవల్ల కూడా వాక్కు వ్యంజకత్వాన్ని పొందుతుందనే ఆలంకారిక సూత్రానికి (ధ్వన్యాలోక ప్రతిపాదనల్లో ఇదీ ఒకటి) సామంజస్యం ఇక్కడ కనిపిస్తుంది. కాబట్టి లక్షణావృత్తి ప్రధానంగా 'అర్థ' దశకు సంబంధించింది. అర్థాలమధ్య సామ్యాలు ఉన్నాయి. భేదాలు ఉన్నాయి-కాబట్టి 'లక్షణ' పరిశీలనలో రెండు దృష్టులు ప్రధానం.

(2) 'పొడుపుకథ : భాషాసాహిత్య దృష్టి' అనే వ్యాసంలో శ్రీ నారాయణ, నేను అనంత పురమండలంలో వినిపించే ఒక పొడుపు కథను లక్షణావృత్తి నాధారంగా విశ్లేషించడం జరిగింది (చూ. స్రవంతి జనవరి 1980) పాఠకుల అనుకూలంకోసం ఆ పొడుపుకథ నిక్కడ చూపిస్తాను.

(a) 'కట్టింటి పోయే కరి మెకమా ! నిన్ను జూసి మా మెకం మేత నీళ్ళు వదిలింది మేత తినిపిస్తూ రాయే నేత మామికి సిలకా !'

(b) అల్నేరిటి పండరసేల్లో పెట్టోక్క-ని-కసుగాయ మిండేల కన్నే స్తివి కడి నోట్లో పెట్టొక్కరా కసిరి నాబట్టా'

(a) (b) లు సంభాషణ రూపంలో వున్నాయి. దీని కొక సందర్భం - వ్యవహారం వున్నాయి. పైన గీట్లు గీసిన రూపాలకు విశేషార్థాలు ఎలా వుంటాయో ఆ వ్యాసంలో చర్చించాము. రూప ప్రక్రియా ప్రభావ సామ్యాలు మూడూ ఈ పొడుపు కథలో జానపదులు దర్శించారు.

(3) శ్రీ రావుగారు (భారతి, అక్టోబరు, పుట 73) ప్రదర్శించిన అల్‌ఫబెట్, అబాకస్ అన్న రూపాల్ని గురించి ఈ సందర్భంలో ఆలోచించవచ్చు. అల్‌ఫబెట్ - లేఖన పద్ధతికి సంబంధించిన శ్రీ కువర్ణమాలా నిర్దేశం.

| గ్రీకు | హెబ్రూ | అర్థం |
|---|---|---|
| ఆల్ఫా | అలెఫ్ | ఎద్దు |
| బీట్ | బేత్ | ఇల్లు |

పై రూపాల్ని ప్రదర్శించి నిఘంటువు ఇలా వివరించింది :

ది అల్‌ఫబెట్ వాస్ ఎ గ్రీక్ ఇన్‌వెన్షన్ బేస్‌డ్ అపాన్ సెమిటిక్ (ప్రోటో సెమిటిక్) రైటింగ్ విచ్ ఇండికేటెడ్ ఓన్లీ కాన్‌సొనెంట్‌స్, ఎ ప్రొసీజర్ సూటబుల్ ఇనఫ్ ఫార్ ఏ సెమిటిక్ లాంగ్వేజి, బట్ నాట్ ఫార్ యెన్ ఇండో - యూరోపియన్ వన్. ది వర్డ్ ఇట్‌సెల్ఫ్ ఈస్ డిరైవుడు ఫ్రమ్ "ఆల్ఫా" అండ్ "బీటా" (ఆఫ్ సెమిటిక్ ఆరిజిన్)

(ఎన్‌సయిక్లొపేడియా బ్రిటానిక, వాల్యూమ్ 1 పుటలో 662-663)

ఇంగ్లీషులో ఉన్న 'ఎ' కాని. గ్రీకులోని 'ఆల్ఫా' కాని లేఖన సంకేతం. కాబట్టి ఇంగ్లీషులో మూడు ధ్వనుల్ని సూచించడానికి ఒకే సంకేతాన్ని ('ఎ'ను వాడితే) సరిపోతుంది.

man (mxn)
father (father)
take (teyk)

బ్రాకెట్లలో చూపించిన ధ్వని భేదాల్ని (ఎ) అని లేఖన సంకేతంద్వారా వ్యవహారంలో సూచిస్తున్నపుడు "అమ్మ" అన్న

రూపంలోని 'ఎ' అన్న ధ్వనికి సంబంధించిన చర్చలో లేఖన సంబంధి అక్షర చర్చ ఎందుకు ? అదాకస్ విషయం కూడా నిఘంటువులో చూసుకోవచ్చు.

'అక్షర' విషయం – పైన సూచించినట్లుగా అకారం-అంటే ధ్వని/వర్ణాలు ఏవైనా కావచ్చు కాని 'అక్షరం' అంటే భాషాశాస్త్ర పరిభాషలో 'సిలబుల్' అనే సాంకేతికార్థమవుతుంది. సంస్కృతంలో చాలా అర్థాల్లో 'అక్షర' శబ్దం వాడబడుతోంది. ఇందులో న+క్షర, అని, అ నుండి క్ష వరకు అని రెండు ప్రధాన విభాగాల్ని నిఘంటువులు చూపుతున్నాయి. మొదటిది తాత్త్విక పరిభాష. రెండోది వ్యాకరణ పరిభాష. లేఖన చిహ్నమనే అర్థం కూడా చెప్పబడింది. (వివరాలకు చూ. శబ్ద కల్పద్రుమం, పుట 7)

'అంబ' శబ్దానికి కూడా చక్రంలో చోటు చూపించాను. కాని అక్కడి చర్చ శిశుసంబోధన వాచకాల్లోని లచ్, హల్ క్రమంలో 'రెగ్యులారిటీ'కి సంబంధించింది. ఢిల్లీకి దారైనా – ఈ విషయ ప్రస్తావన భిన్న సందర్భంలో చేయబడది. దౌర–సాంఘిక వ్యక్తి, కొడుకు–కుటుంబవ్యక్తి. భాషలోని 'ఎమోటివ్ ఎలిమెంట్' కుటుంబ సంబంధ వాచకాల్లో ఉంటుందని నిరూపించటానికి ఆ సామెత వాడుకొన్నాను. శ్రీ రావుగారు నా ఆలోచనలోని మౌలికమైన విధానాల్ని దయచేసి గమనించాలని కోరిక.

4. భరత, దండి, ఆనందవర్ధన, అభినవులలో మనకు మాధుర్యాన్ని గురించిన చర్చ విపులంగా కనిపిస్తుంది. మాధుర్యాన్ని శబ్దార్థోభయ ముఖంగా నిరూపించిన ఘనత అభినవగుప్తపాదుల వారిదే (చూ. రాఘవన్‌గారి శృంగార ప్రకాశం. పుటలు 269, 73 74 మొ.)

5. అమూర్త పదార్థాల్లో మూర్త పదార్థ లక్షణాల్ని ఆరోపించడం, అచేతన పదార్థాల్లో చేతనత్వ లక్షణాల్ని దర్శించడం– ఉపచార వక్రత గా కుంతకుడు సిద్ధాంతం చేశాడు. (చూ. వక్రోక్తి జీవితం, 2–93, 2–94 కింద వృత్తి:- 'సోఽయం స్వభావ విప్రకర్షో విరుద్ధ ధర్మాధ్యాయాస లక్షణః పదార్థానామ్' (పుటలు 99–100).

రూపంలోను, అర్థంలోను వక్రత (డేవియన్స్) ఎంత ప్రధానమైన అంశమో ఇటీవలి భాషా విజ్ఞాన పరిశోధనలు నిరూపిస్తున్నాయి. శబ్దాన్ని వ్యాపారముఖంగా పరిశీలించడం ఒకటే దీనికి పరిష్కారమని, అంతవరకు ఇప్పుడున్న ప్రమాణాలతో భాషలోని 'మెటఫర్'ని విశ్లేషించడం కష్టమని గుర్తించిన వాళ్లూ ఉన్నారు. (ఉదాహరణకు యు. వెయిన్‌రెయిచ్ 1970).

## రి ఫ రె న్సు లు


ఆనందవర్ధనుడు 'ధ్వన్యాలోకం' పండిత పట్టాభిరామశాస్త్రి (పరిష్కర్త) చౌఖాంబా ప్రచురణ, వారణాసి (1945 ప్రతి) (అభినవుల లోచన వ్యాఖ్యకూడా కలిపి ముద్రింపబడింది)

కుంతకుడు 'వక్రోక్తి జీవితం' ఎస్. కె. డే గారి పరిష్కరణ. ఫర్మా కె. ఎల్. ముఖోపాధ్యాయ్, కలకత్తా (ప్ర) (1961)

గౌతముడు 'న్యాయసూత్రాస్'-మ. మ. సతీష్‌చంద్ర విద్యాభూషణుల ఆంగ్లానువాదం, మున్షీరామ్ మనోహర్‌లాల్ ప్రచురణ, న్యూఢిల్లీ (1975)

తిరుపలరావు, సర్దేశాయి 'శ్రీ బ్రహ్మానంద, శిశుసంబోధనాచక్రం' భారతి, అక్టోబరు (1980)

బ్రహ్మానంద, హెచ్. ఎస్. 'వ్యంజనసూత్రము', శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ స్నాతకోత్తర కేంద్రం,పిహెచ్. డి. సిద్ధాంత వ్యాసం (అముద్రితం) (1979)

బ్రహ్మానంద హెచ్. ఎస్. & నారాయణ,బి. 'పొడుపు కథ ; భాషాసాహిత్య దృష్టి', స్రవంతి, జనవరి, పుటలు 14–19 (1980)

బ్రహ్మానంద హెచ్. ఎస్. 'శిశుసంబోధనాచక్రం', భారతి, జూలై (1980)

భర్తృహరి 'వాక్యపదీయమ్', కె. వి. అభ్యంకర్, వి. వి. లిమాయే (సం) సంస్కృత్ అండ్ ప్రాకృత్ సీరీస్, మెహర్‌చంద్ లక్ష్మణ్‌దాస్ (ప్ర) న్యూఢిల్లీ (1965)

మమ్మటుడు 'కావ్యప్రకాశము', ఆర్. సి. ద్వివేది (ఆంగ్లానువాదం) మోతీలాల్ బనార్సిదాస్ (ప్ర) వారణాసి (1966)

రాఘవన్. వి. 'శృంగార ప్రకాశం' (ఆంగ్లానువాదం) పునర్వసు (ప్ర) మద్రాసు (1963)

రాజారాధాకాంతదేవ్ 'శబ్దకల్పద్రుమమ్' (సం) చౌఖాంబా ప్రచురణ, వారణాసి (1967)

బెంటన్, విలియమ్: 'ఎన్‌సయిక్లోపేడియా బ్రిటానికా', వాల్యూమ్ I (1768) చికాగో (ప్రతి) (1968)

రాజా, కుంజున్ని: ఇండియన్ థియరీస్ అఫ్ మీనింగ్, అడయారు లయిబ్రరీ సీరీస్, మదరాస్, 1963 (1977)

రీడ్, హెర్బర్ట్: 'ఇంగ్లీష్ ప్రోస్ స్టయిల్', లయాల్ బుక్ డిపో, ఇండియన్ (ప్రతి) (1968)

వెయిన్‌రెయిక్, ఉరియెల్: ఎక్స్‌ప్లొరేషన్స్ ఇన్ సెమాంటిక్ థియరీ - ఇన్ కరెంట్ ట్రెండ్స్ ఇన్ లింగ్విస్టిక్స్ పుటలు 395 – 478 (1970).




శ్రీ వేగుంట మోహనప్రసాద్

# బతికిన క్షణాలు - 14

శస్త్రకారుడు బ్లైన్ దారంలాంటి ఆ తెల్లని నరాన్నిచటుక్కున తెంపినపుడు ఇక నొక్కసారిగా జీవన జ్వరాల ఆకలి తీవ్ర తరాల భయాలు తెగిపోతయ్. జన్మని నిరోధించినట్లూ మృత్యువుని జయించినట్లూ 'బేబీ! యు కుడ్ నాట్ బి వార్న్, ఎట్ యు డైడ్!'

ఫ్రెంచ్ కవి రేమాండ్ క్వెనూ 'టెన్ సానెట్స్ ఫ్రమ్ ఎ హండ్రెడ్ థౌజండ్ బిలియన్ పోయమ్స్' అనే కవిత రాసాడుగానీ పాపం వాసెక్టమి చేయించుకొన్నాడో ఏమో ఆ కవిత నూటనలభై పంక్తుల బ్లైన్ దారాల్తో తెగిపోయింది.

అతని అముద్రిత మహాకావ్యం విరచితమయ్యే ఉంటే మనబోటి పాతక పాఠక కోటికి దాన్ని చదవటానికి 19 కోట్ల 25 లక్షల 37 వేల 51 సంవత్సరాలు పట్టుందని క్వెనూ రాసుకున్న మాట నిజమేననటానికి రోణంకి అప్పలస్వామిగారు సాక్ష్యం ఇవ్వాలి బోనెక్కి ఫ్రెంచి వచ్చిన పాపానికి జేక్స్ ప్రెవర్ట్ 'పెరోల్స్' పుస్తకం మీద ఒట్టేసి — ఈ అర్ధానుస్వార బండిరాల పండితుల నాకిన విస్తరాకుల భాషా న్యాయస్థానాల ముందు పెట్రార్కన్ సానెట్‌కీ రొజెట్టీ సానెట్‌కీ మధ్యనున్న అఖాదం నాకు ఫెలిన్నీ తీసిన 'లాస్ట్రాండ్' సినిమా చూసేవరకూ పూడలేదు. ఎట్లా చూస్తాం ఆ మొమెంట్యువస్‌నెస్ ఆఫ్ ది మొమెంట్‌ని? ఎట్లా వింటాం రత్యంతర నిట్టూర్పుల కప్లెట్‌ని ? సముద్ర తరంగాల్లా ముందుకు మూగి వస్తోన్న బీతోవెన్ సింఫనీ అలలు వొచ్చి వొచ్చి చుట్టుముట్టి ఏ నరాల బ్లైన్ దారాన్ని తెంపుతాయో గాని తప్పుకోండి తప్పుకోండి. కన్సర్ట్ హాలంతా ఖాళీ చేయండి చెప్పుల్తొక్కుకుంటూ చేతులమీద నడుస్తూనయినా టోపీలు ఓవర్ కోట్లమాట దేవుడెరుగు ముందు బయటి బయటికి వెళ్ళిపోండి.

కన్నీరోడుతుంది చదవొద్దు ప్రెవర్ట్ కవిత్వం బల్లమీద పరచిన తెల్లగుడ్డమీద రాసుంది ఇంక అన్నం తినబుద్ధికాదు ఆకలా దాహమా వంతలా చింతలా ఆకలే దాహమే వంతలే చింతలే అన్నీ ఒక్కసారే అన్నీగానే వొచ్చి కన్నీరోడుతుంది చదవొద్దు 'రూడీ సీన్'.

అపుడే పుట్టిన జబ్బుపడిన చంటిపాప
గడ్డకట్టిన చలికేడుస్తూ సమాధి మీద
శీతాకాలం స్మశానంలో.
పీర్ నాకు సత్యం చెప్పు
వెళ్ళిపోకు వెళ్ళేముందు
నాకు పూర్తి సత్యం చెప్పు
ఎందుకీ పాప
ఎందుకీ జబ్బు
ఎందుకీ శీతలం
ఈ సమాధి మీద ?

నేను చూచానా ఏమన్నా ప్రెవర్ట్‌లాగ? లడెస్పైర్ ఎస్ట్ అసిస్ సర్ ఆన్‌బంక్' బెంచీమీద కూచున్న నిస్పృహ ?

కొంచెం కొంచెం అయినా ఏవన్నా చూస్తున్నామా బిసెంట్ రోడ్ సెంటర్లోనో ఏలూళ్ళో చిన్న కర్రల వొంతెన దగ్గర్లోనో మాజిక్, తమాషాలు, గారడీలు, జీవనలీలలు, మాయలు మర్మాలు, మర్మాంగాలు, దుర్మార్గాలు, సూర్యోదయాన దుర్గంధాలు, మసక వెన్నెట్లో మృత్యుశీతల వస్త్రాలు, నాందేడ్‌లో మన్మాడ్‌లో, ఔరంగాబాద్‌లో, జేబున్నీసాలో, చిలకలూరిపేటలో, చీపురుపల్లిలో, చాటపర్రులో, చల్లపల్లిలో మనవూ ఏవన్నా కొంచెం కొంచెంగా నయినా చూస్తున్నామా తమాషాలు?

చూచినా కాని వీళ్ళందరూ ఒకటేనని వీళ్ళ మలమూత్ర వలయాలన్నీ జీవన వీర్య విషవలయాలని బెత్లెహామ్ వెళ్ళేదాకానో ఓ బైజాంటియమ్ చేరుకునేదాకానో తెలుసుకోలేం.

కదూ బార్బరా ?

సముద్రంమీంచి కురుస్తోన్న యుద్ధపు గుళ్ళవానకి జడిసి తడిసొచ్చిన నీయింటి గుమ్మంముందు దాక్కున్న ప్రెవర్ట్‌కి ఆశ్రయం ఇచ్చిన బార్బరా అవును కదూ!

* * * *

## బతికిన క్షణాలు 15

ఎప్పుడూ ఒకటే కల. కలలో సత్యం అనే పేరియబుల్ అయి, శాశ్వతం అయి క్షయ క్షీణాలు లేని క్షణమైతే బ్రతుకుతూన్నట్టే కల మళ్ళీ మళ్ళీ వస్తూనే ఉంటే యిక కలకీ ఇలకీ తేడా ఏది ?

ఎన్నిసార్లిలా బతుకుతూండటం ? ఒక్కసారన్నా చనిపోలేక పోవటం? ఎంతసేపూ ట్రూత్‌నుండి ఫాల్స్‌హుడ్‌కి కాకుండ దానికి వ్యతిరిక్తమైన ప్రొఫౌండర్ ట్రూత్‌కి వెళ్ళలేకపోవటం ?

అనంతానికి వేసిన అంచెలంచెల నిచ్చెన్ల మెట్లు జట్లుజట్లుగా పైకెగబ్రాకటం క్రిముల్లాగా కీటకాల్లాగా కాలురాలిపడి పోకుండా ఎవరూ జారిపడిపోకుండా ప్రాకటం క్రీపటం నిలువుల ఎత్తులి అగాధ క్రీనీడ లోతుల్లోకి శూన్యవాతావరణ ఛేదనలోకి తీరా ఎక్కడికి వెళ్ళి రాలిపడలేని భారరహిత స్థితిలోకి నీళ్ళులేని సము ద్రాల కెరటాల శూన్య బాహువుల్లోకి ఊబిలోకి కూరుకున్న చాపలా చంచలించటం నీళ్ళల్లో మునిగిన పక్షిలా రెక్కల అత్తు టపటప ల్లోకి ముడుచుకుపోవటం ఎన్నాళ్ళిట్లా చీకటి అంచుకి అంటుకునే రాత్రి చేలాంచలాల కాంతి రెపరెపల్లోకి కనుపాపలు పాము కోవటం ?

వేశ్య 1
వేశ్య 2
కలిపితే రెండా మూడా ?
కల 1
కల 2
కల గలిపితే రెండా మూడా ?
ఒకటి ఉన్న వేశ్య
రెండు లేని వేశ్య
ఒకటీ రెండవదే
రెండోదీ మొదటిదే
నాలుగు కాళ్ల ఒకే చెయ్యి
నాలుగు చేతులు ఒకే కాలు
కళ్ల మాత్రం శూలాలు

శూలాలు గుచ్చి ఒక్కో నెత్తురు చుక్కను నుదుట చిదుము కొని ఇస్త్రీ బట్టలకు సెంట్ రాసుకొని పరిమళాన్ని చూపుల్తో చిమ్ముతూ ఫౌంటెన్‌లోకి, 'చచ్చిపోతాను మొర్రో' అంటోన్న దుర్గంధ శవాన్ని ఈడ్చి రక్తస్నాన శుభ్రస్నాతను చేయించి మబ్బులతువాళ్ళతో తుడిచి బొగ్గులపొయ్యిమీద మొక్కజొన్న కండెలా వేయించి సిరంజ్‌ని స్టెరిలైజ్‌చేసి స్థనాల దూదితోగాయాల్ని తుడిచి తెల్లని పెళ్ళి పట్టుచీరతో చీలికల బాండేజ్ చుట్టి కుష్టు రోగాన్నలా చుట్ట చుట్టి ఒక తెల్లని కల చీముల కారి రక్తంలా పేరుకట్టి దురద దురదకీ గోక్కోని నిద్ర నిద్రకీ మధ్యలో కత్తిలా కల దూసేసి కలరాయింజెక్షన్ చేసి

చూచావా యింక బతికే ఉన్నావని చెప్పేకల నిజానికి మరణానంతర జీవనక్షణం.

చచ్చినా చావనియ్యని కల.

నిద్ర దారిలో రాలిపడిన పూలు ఏరుకుందామని నేలమీదికి వొంగేవప్పటికి మెలకువ వచ్చేస్తుంది యాత్రికుడా ఓ రాత్రి యాత్రికుడా !

మేలుకోగానే మెలకువ బాంజోడ్రమ్స్ వింటావు. సీల్ డైమండ్ కప్పలా అరుస్తోంటాయి !

* * * *

## బతికిన క్షణాలు 16

కాలుకేవన్నా బోధ వస్తుందా ! బోదకాలయితే కాలేవన్నా బాధపడ్తుందా ? కాలుకేవన్నా ప్రేమాయణమో దోమాయణమో బోధపడ్తుందా ?

హెట్రొజాన్ హెట్రొజాన్ మేరేజాన్ !

తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురంలో ప్రతివాడికీ బోధ పడటమంటే బాధ పడటమే.

చెయ్యి వాచినా ఫర్వాలేదు కాలు చిక్కిపోవాలి. జాపనీస్ చిత్రలేఖనంలోలా ఇకెబానా అంతమృదువుగా కాలు లలితంగా ఉండాలి. కలువపూలని అలంకరించేపుడు ఒక చిన్న సిరంజి తీసుకుని ఆ సిరంజి ద్వారా ఆ కలువ కాడలోకి కాళ్ళలోకి పల్చని తేయాకు సారాన్ని సూదిలోకి దారంలా ఎక్కిస్తే కలువ పూల నరాలు ఎప్పుడూ పక్షవాతంతో తీసుకోవు. ఇకెబానా నేర్చుకొంటే – పూలకి ఐస్, ఆల్కహాల్ కలిసిన ద్రవ దయాజలాన్నిస్తే ఇకనా కలువ ఎపుడూ నిస్తేజంకాదు. కాలిక్యులస్‌లా నిలుస్తుంది.

స్వప్నాల్లోకి అతి సూక్ష్మ సిరంజిల ద్వారా సోడియం బ్రోమైడ్ నరాల్లోకి అందిస్తే అవి సదా సాక్షాత్కరిస్తోనే ఉంటాయి గా మోను.

టెలిఫోన్ తీగలు ముందు అదృశ్యమవాలి. ఆకాశవాణి అశరీరవాణి ఒక్క మూర్కొనీ ఆత్మకేక్షే తీగలుగా లుంగలు చుట్టు కోవాలి.

తూర్పుగోదావరిజిల్లాలో రామచంద్రపురంలో పాదం పెదవిలా ఉండాలి. కూరల్ని చూచి మరీ తినాలి.



శ్రీమతి ఇందిరాగాంధి
ప్రధాన మంత్రి

# స్వాతంత్ర్య సమర యోధులకు మన నివాళులు



శ్రీ టి. అంజయ్య
ముఖ్యమంత్రి

విదేశీ పాలనకు వ్యతిరేకంగా అహింస, సహాయ నిరాకరణలనే ఆయుధాలతో మనం జరిపిన స్వాతంత్ర్య సమరం ప్రపంచ చరిత్రలోనే ప్రప్రథమమైనది. చరిత్రాత్మకమైనది. విదేశీ దాస్యశృంఖలాల నుంచి మాతృదేశాన్ని విముక్తి కలిగించే మహత్తర కార్యానికి అనేక మంది స్వాతంత్ర్య సమర యోధులు ఆత్మ బలిదానం చేశారు. గాంధీజీ, జవహర్లాల్ నెహ్రూ, వల్లభాయ్‌పటేలు, సుభాష్ చంద్రబోస్, ప్రకాశం పంతులు, డాక్టర్ పట్టాభి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, కొండా వెంకటప్పయ్య, కాశీనాధుని నాగేశ్వరరావు, బులుసు సాంబమూర్తి, మాడపాటి హనుమంతరావు, స్వామి రామానందతీర్థ, జమలాపురం కేశవరావు, బూర్గుల రామకృష్ణారావు, కల్లూరి సుబ్బారావు, కొండా వెంకట రంగారెడ్డి లాంటివారు మరి అనేకానేక మంది స్వాతంత్ర్య సమరయోధులు చేసిన త్యాగాన్ని తర తరాలుగా భారతీయులు భక్తిపూర్వకంగా స్మరించుకుంటారు.

ఈ స్వాతంత్ర్య సమరయోధులు దేశానికి చేసిన సేవలు, త్యాగాలు ఈ రోజు స్ఫురణకు తెచ్చుకుంటూ, వారు చూపిన బాటలో ముందుకు సాగిపోతూ, వారికి సరియైన వారసులమని రుజువు చేస్తామని శపథం తీసుకుందాం.

---

సమాచార, పౌరసంబంధశాఖ ప్రకటితము, హైదరాబాదు.

No. 58

DIPR No. 52430/ADA/I/C3/81

ఓ చిన్న కుండ ఉండేది. నిండుగానే ఉండేది ఎపుడూనూ. తాగాలంటే భయం. హైడ్రో ఫోబియా. ఫోబియో ఫోబియా.

ఓ చిన్న దిండు ఉండేది. దాని కిందకి ఓ పెద్ద చాప ఉండేది. దిండు మాత్రం మఖమల్ నునుపుతో ఉండేది. దాని లోపల మొగలి పూలు పండి ఎండిపోయినవి కుక్కేసి ఉండేవి. ఒరబిందో ఆశ్రమ పర్ఫ్యూమ్‌లా. దిండుమీద ఓ మిన్నాగు మనస్సు ముడుచుకు పడుకుండేది. మనసుని దోమలు కుట్టేవి ఎప్పుడూ. ఎందుకేనా మంచిదని కాలుగోక్కునేది చేత్తో.

## బతికిన క్షణాలు 17

ఆ వీధిలోనే నాటక కళాసమితి వాళ్లుండేవాళ్లు. ఔత్సాహిక హార్మణీ పెట్టి ఉండేది. పూర్వజన్మలో తాటాకు బూరలూదుతున్న బిస్మిల్లా ఖాన్ లుండే వాళ్లు.

వాళ్ళకు బాబ్ డైలన్‌ల 'గాట్ట సర్వ్ సంబడీ'లు తెలీవు.

వాళ్ళకు ఆండీ గిబ్‌ల 'డిజైర్'లు రావు. వాళ్ళల్లో జాన్ డెన్వర్ 'ఆటోగ్రాఫ్' పాడడు. వాళ్ళల్లో ఏ ఒక్కడూ పీటర్ ఫ్రాంట్సన్‌లా 'షి డోంట్ రిప్లై' ఏడ్వడు.

నేనొక్కడ్నే జాకెట్ చేతుల అంచుల మామిడి పూపిందెల్ని చూచి దుఃఖంలో నక్కి నక్కి వెక్కి వెక్కి ఏడుస్తాను. పాపం!

శబ్దం నను మేల్కొల్పుతుంది. నిశ్శబ్దం నిద్రపోనివ్వదు. ఆవేళ ప్రపంచ కళ్యాణ మహోత్సవం. ఆ శుభోదయాన విధవ ప్రపంచానికి పునర్వివాహం కమ్మని పేకువతో. రండి అందరూ కిళ్ళీ లేసుకుని గ్లాసొక్క పంచెలు కట్టుకొని. దంతపుబరిణెలలో దంతాలు దాచుకొన్న వాళ్లూ రావచ్చు.

శబ్దాలకు రంగులు పులిమి మెత్తనిదిండు స్పర్శకు వాసనలు పులిమిన ఆ కుండ, ఆ చాప గది ఎవరిదో ఎవరిచ్చారో ఎంతకిచ్చారో యిపుడూ తెలీదు అపుడూ తెలీదు. ఆగది ఎందుకెవరికి ఎన్నాళ్ళు ఎట్లా ఇచ్చారో ఇచ్చిన వాళ్ళకి జ్ఞానమూలేదు పుచ్చుకున్న వాళ్ళకి జ్ఞాపకమూ లేదు.

ఎప్పుడూ ఒకటే ఆకలేసేది. పంచినీళ్ళయ్యేవి. కడుపులో చచ్చిన ఎలుక ప్లేగ్ వాసనేసేది. గొంతులో గరళంలా గ్లాసు గుచ్చు కొనేది. ఎటన్నా పారిపోదామని పించేది. ఆర్టీసీ ఎర్ర ఏనుగుల్ని చుట్టుముట్టి నల్ల దోమలు కుట్టేస్తుండేవి - అల్లారఖా తబలా అంత స్ఫుటంగా ప్రేమగా బీట్ తప్పకుండా రైలింజన్‌లు వేళ తప్ప కుండా బొగ్గుపొడ అక్కర్లేకండా నదీనదాలు పైరుపొలాలు ఏరు లెడారులు స్త్రీ పురుషులు పుణ్య పాపాలు భూమ్యాకాశాలు దాటు కుంటూ దూసుకుంటూ మస్కిటో మస్తిష్కంలోకి ఆత్మని విసిరేసుకొంటూ!

ఎటన్నా పారిపోదామని పించేది. దేహాన్ని దిగవిడిచేసి "ఉంటానిక నువ్వుండిక ఉండు మరి ఉంటానిక వెళ్ళగానే ఉత్తరం రాస్తానే" అని ఆత్మ నెటన్నా పారేసుకోవాలని ఆకలినుండి దాహా న్నుండి దోమల్నుండి పారిపోదామని ఎటన్నా అన్పించేది.

రష్యాలో చేపలకూర ఒండి డాక్టరేట్ పుచ్చుకుంటారుగాని రామచంద్రపురం బెస్తవాడికి కాస్తంత కూడ ఏరపెట్టరు మా ఇంట్లో చేసుకున్న కూర ఇదని.

రవిశంకర్ సితార్‌ని మీటితే దోమలు రాలిపడతాయ్.

'ఎలిఫెంట్స్ ఆర్ కంటేజియస్.'

బోదకాళ్ళు అంటుకొంటాయి.

రాజమండ్రీ మువ్వన్ అంగలు. కాకినాడ కాసిని బారలు యానాం పోనానుగాను అప్పటికీ ఇప్పటికీ, పిఠాపురం పట్టుమని మూరెడులేదు.

ధగిడ ధిగిధ గిడధ
డిగిధ ధాగిధదా
దోమలు పీడల నిశీధుల
ధగిడ ధిగధ గిడధ

డా. రుద్రయ్య చౌదరి ఫ్లాస్కునిండా పొగలు గక్కుతున్న చార్మినార్ కాఫీ పరిమళాలవెలుగులు. కె. ఆర్. కె. రెండు చేతుల్నిండా సోడా కేసులు. ఎవరూ దాహంతో చనిపోరాదనే ఆకాశంలో ఇంద్రధనుస్సు.

మొత్తం ముప్పైయేడు రోజుల్లో సర్వం కనుమరుగవాలి. ఆగలేని కన్నీళ్ళు నార్చుకోవాలి. తీపిగా సలుపుతూన్న గాయా ల్నిండా ఇసుక కూరుకోవాలి.

అంతలోకి ఉదారంగు ఉలిపిరి కాయితం, కొత్తగూడెం రమ్మని.

తీరా అక్కడికెళ్తే కాల్తున్న కణికెల కనులగనుల్లోంచి వెలికి తీసిన అశ్రువజ్రాలు.

అయినా 'బ్లాక్ ఈజ్ బ్యూటిఫుల్'
హెట్రొజాన్ హెట్రొజాన్
చాపలకూర డాక్టరేట్!

శ్రీ యస్. యస్. సుందరేశ్వరరావు

# శివయోగి వేమన

"ఇతని సిద్ధాంతము అద్వైతము. సాధనకు హఠయోగమూలమగు రాజయోగము"-అని రాళ్ళపల్లి, "ఇతడు రాజయోగము శ్రేష్ఠమనును. తానాచరించినది రాజయోగముకాదు శివాద్వైత మనవచ్చునని"వంగూరి. "ఇతడు వీరశైవుడగునా" అని బండారు తమ్మయగారి సందేహం, "సామాన్య వీరశైవ ధర్మముల నతడంతగా పాటించక, విశేషవీరశైవము నాశ్రయించి యుండునని" ఆ సందేహానికి ఆశయం. ఈ రెండింటికీ మధ్య ఉన్న భేదం రాళ్ళపల్లి వారికి అవగాహన కాలేదట. బ్రౌన్ ఏదీ నిర్ణయించుకోలేక పోయాడు. ఈ పాతచరిత్రను వదిలేస్తే వేమనది సూన్యతవాదమని, లోకాయతం అని, హేతువాదమని,శూన్యవాదమని, మానవతావాదమని కొన్ని వాదాలు ఇటీవల బయలుదేరాయి.

"వేయి విధము లమర వేమన పద్యంబు
లర్థమిచ్చు, వాని నరసి చూడ
చూడ జూడ గలుగు చోద్యపుజ్ఞానంబు॥
(117-374)

అని వేమనే తన పద్యాలు చోద్యమైన (ఆశ్చర్యకరం?) జ్ఞానాన్ని కలుగ జేస్తాయని చెప్పాడు. ఈమాట వాస్తవమే. పూర్వం ఇద్దరు ముగ్గురు ఏవో నాలుగు పద్యాలేరుకొని వ్యాఖ్యానాలు రాశారు. ఇప్పుడు భాష్యాలే వెలువడుతున్నాయి. సిద్ధాంత గ్రంథాలు, రాద్ధాంత గ్రంథాలు, సంక్షిప్త వ్యాఖ్యలు చాలా వచ్చాయి. ఇంకా వస్తాయట.

అంతమంది పెద్దలు ముందు ఈ వ్యాసం పెట్టటం జరుగుతోంది. అయితే ఈ వ్యాసరచయిత ప్రధానోద్దేశం వేమన శివయోగి అని నిరూపించడానికి చేసిన తొలి ప్రయత్నం ఇది. మలి ప్రయత్నంలో ఈ విషయాన్నే కాస్త తీరుబాటుగా లోతుగా ఆలోచించి రాయాలనే జ్ఞానం ఈ వ్యాసకర్తకుంది.

## వేమన శివకవి

శివకవి అంటే శైవులలోని కవులు. వీరు భవకవులను కీర్తించరు. బసవ పురాణంలో సోమనాథుడు "శివకవి ప్రవరుల చిత్తంబు లలర" అని పూర్వ కవిస్తుతి చేశాడు. "శివకవుల్ హర్షింప చెప్పెను కవిత" అని పండితారాధ్య చరిత్ర మొదట్లోనే పేర్కొన్నాడు. 'శివకవులు' అనే సంప్రదాయం వీర శైవులలో ఉండబట్టే, వేమన 'శివకవులకు నవకవులకు' ముందుగా వాయెత్తి స్తుతించాడు. ఆ తరవాత

భవదూరుడు, శరభాంకుడు
శివశీలుడు వేయుగోటి సిద్ధేశ్వరుడున్
శివభృత్యుడు వలుమూలుడు
శివచిన్మయుడు సోమశేఖర గురుడున్.

అని శివకవులను పేరు పేరున పేర్కొన్నాడు. భాస్కర భవదూరుని ఎడపాటి ఎర్రన పేర్కొన్నాడు. పైగా అతని పోరుమామిళ్ళ శాసనం (క్రీ. శ 1369) తటాక నిర్మాణ శాస్త్రాన్ని చక్కగా తెలియజేస్తుంది (ఎ. ఆర్. 91/1903). పోరుమామిళ్ళ కడపజిల్లా బద్వేలు తాలూకాలోది (ఆ.క.త. 4 సం. పుట 159). ఇతని కృతులు దొరకలేదు.

శరభాంకలింగశతకం శతకవాఙ్మయంలో ప్రసిద్ధికెక్కిన శతకం. "శ్రీ మద్యజుశ్శాఖాపస్తంబ సూత్ర కౌశిక గోత్ర పవిత్రతవాది వీరశైవ భక్తత్రయాంతర్భూతాయ ప్రతాప రుద్ర పృధివీశ్వర సంస్థాన మంత్రిశేఖర శరభాంక వంశ సంభూతాయ" అని లింగధారణ చంద్రిక చెబుతోంది. (ఆ. క. త. 3 సం. పు 187) "వటమూలమందిరా" అనే మకుటంతో కొన్ని పద్యాలు భారతి (సం. 13 భా 1. పుట 43)లోఅచ్చయ్యాయి. ఇతనిని కవిగా తురగారామన, అయ్యంకి బాలసరస్వతులు నాగరఖండంలో స్తుతించారు. ఇతని పద్యాలను బట్టిచూస్తే అవి శివయోగాన్ని తెలిపేటట్టు కనబడుతున్నాయి [ఆ. క. త. 10 సం. పుట 81]. మల్లికార్జున పండితారాధ్యులు, పాల్కురికి సోమన, యథావాక్కుల అన్నమయ్య, శివయోగసార కృతికర్త కొలని గణపతిదేవుడు. పిడుపర్తికవులు వీరందరూ శివకవులే.

అయినా "అసలు వేమన ఇటువంటి సురుస్తుతి పద్యాలు చెప్పాడని నమ్మకం కలుగ"దట గోపీకి [ప్ర. వే పుట 136].

## వేమన పేరు

వేమనపేరు వేసవెట్టికి ముడిగట్టారు - బండారు తమ్మయ్య, ఒంగోలు వేకట రంగయ్య ఈయన పేరు వెంకట సుబ్బయ్య అంటారు గోపి [ప్ర. వే. పు 102]. తప్పు! బ్రౌన్ సంస్కృత నిఘంటువు చూసి వేమ అందే లూమ్ [మగ్గం] అనే అర్థం చెప్పాడు. వేమ శబ్దం వ్యోమ శబ్దతద్భవం అని కిట్టిల్ పెద్దక్షరంలో అచ్చోసి ఇచ్చాడు.

"విశ్వం వ్యయతి సంవృణోతీతి వ్యోమ"-విశ్వమును వ్యాపించునది అని అమరం.

పరదాచాటునుండి తొంగి చూస్తూనే ఉంది- వేమన రెడ్డి కులస్థుడు అనటానికి ఇష్టంలేనట్లు. "వేమన యోగ మార్గావలంబి. పేరే వేమన యోగి స్థిర పడినది కదా - అతని నిలుకడ కశపట రాజయోగమునందే యున్నది." [వి3-15] అని తెలిసిన వారే వేమన "రైతు బిడ్డ"అని రాయటం సమర్థవంతంగా లేదు. వేమన శివ యోగి. ఋరుల జన్మముల్, ఏరుల జన్మముల్ లాగే వేమన జాతకం చెప్పలేం. అసలు వేమన్న అనే వ్యక్తి ఉన్నాడా అని కొందరు పెద్దలు-వేమన్న పద్యాలు చదివిన వారే అన్నారు. కవిస్తుతులలో వేమన్నని కీర్తించారు కాబట్టి అటువంటి వ్యక్తి లేకుండా ఉండడని మరొకరి సర్దుబాటు.

## వేమన కులం

వేమన రెడ్డికులం వాడని రెడ్లు ఆదరించి ఉత్సవాలు చేసేవారు. 60 ఏళ్ళ క్రితం ఆంధ్రపత్రిక ఎన్నో వార్తలు ప్రచురించింది. ఎడ్డెరెడ్డికులమని వేమన పద్యంలో ఉంది. కలియుగంలోని కాపుకులానికి వేమన తన కీర్తి విక్రయించే నని అతనే మరో పద్యంలో చెప్పుకున్నాడు. బ్రౌనుకి అనుమానం ఎందుకొచ్చిందోకాని వేమన బ్రాహ్మణుడు కాడని రాశాడు. జంగముడని ఒక చోట, రెండూ కాదని ఒక చోట, కాపు లేదా రైతు అని వేరొకచోట, అనవేమా రెడ్డి కుటుంబానికి చెందినవాడని మరోచోటరాసి - ఏదీ నిర్ణయించుకోలేక పోయాడు. "కాబట్టి వేమన తెగని నిర్ణయించడం కష్టం" అని చెబుతూ "ఏ తెగకు చెందినవ్వటికీ వేమన బండారు తమ్మయ్యగారు భావించినట్లు రైతు కుటుంబానికి చెందినవాడు" అనే నిర్ణయాని కొచ్చారు గోపి [ప్ర వే. 107]. ఇకపోతే వేమన సాతెకులం వాడని ఎవరన్నారోకాని వి3- "విశ్వరూప సందర్శన యోగం" అనే చిన్న పుస్తకంలో శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు జట్టల పరిశ్రమ చరిత్రతోబాటు కాపిట జం, సోషలిజం, మార్క్సిజం చెప్పి విశ్వరూపం చూపెట్టి ఆ వాదాన్ని ఖండించారు. వి3-180వ పుటలో తిరిగి వారే ఆ విషయాన్ని ఎత్తుకుని "వేమన (నేటి) రెడ్డికులస్థుడే కావచ్చును. అయినను అది నిరూపణమునింకనునపేక్షించుచున్నది ఇప్పటిదనసంపాదించిన ఆధారములు నిర్ణాయకములుగావు. ఇంక నీవిషయమున పరిశోధన జరుగవలసియేమున్నది. అంతవరకే యాచర్చ ఉద్దేశము. ఇప్పటికాతడు రైతుబిడ్డ- అది తిరుగులేనిమాట" అని శుద్ధగ్రాంథికంలో నిష్కర్షచేశారు. విశ్వరూపసందర్శన యోగం, వి3 (విశ్వదాభిరామ వినురవేమ) గ్రంథానికి శ్రీ వేంకటేశ్వరరావుగారు రాసిన పుటలు ప్రస్తావనవ్యావహారిక భాషలో కదం తొక్కుతూ నడిచాయి. ప్రధానగ్రంథం 213 పుటలు. గోపీ, త్రి. వే. రాలు ఒకే అభిప్రాయానికి రావడం మెచ్చుకో తగిందేకాని ఈవిషయంలో ఏదీ చెప్పక ఇద్దరూ చల్లగా జారిపోయారని అనిపిస్తుంది. కులం నిరూపించలేక పోతే రైతుబిడ్డఅంటే కుదరదు. రైతుబిడ్డలు కులంలేని వాళ్ళా? ప్రతీరైతుకి కులం ఉంటుంది. ఉండితీరుతుంది!ఇదీ తిరుగులేని మాట"ధ్వని మనకు దొడ్డ సిద్ధాంతము"(వి3-139) అని అన్నప్పుడు త్రి.వేం. రావుగారి మాటలలో ధ్వని వేమన్నను ప్రపంచపౌరులు ముందు పెట్టడానికిచేసే ప్రయత్నం మంచి దేకాని, విశ్వదాభిరాముడిసూక్తులు వ్యాఖ్యానం చేసేపట్ల పెద్దలు కించిత్‌సమాలోచనా చిత్తులైఉంటేమంచిది. ఈ కింది ఉదాహరణ చదవండి.

Therefore if thine enemy hunger,
feed him, if he thirst, give him drink;
for in so doing thou shalt heap coals
of fire on his head. (Romors 12:20)

చంపదగినయట్టి శత్రువు తనచేత
జిక్కెనేని కీడు సేయరాదు
పొసగమేలు చేసి పొమ్మనుటే చావు

(వే. ప. 1పుట 23ప)

ఈ "విశ్వదాభిరామ వినుర వేమ" కి మూలం బైబిలులోనే కనబడుతూ ఉండగా దానికి ఏవేవో వ్యాఖ్యానాలు, గజిబిజి రాతలు 33-82 పుటలలో కనబడతాయి. "ఇంతటి ఉన్నత మైనధర్మాన్ని ఏమతాలు బోధించాయి'అని ప్ర.వే (21వపు)లో ప్రశ్నిస్తారు గోపి "బైబిలులోని దేవునివంటి దేవుడాతనికి లేడు. భగవద్గీతచెప్పినదేవుడు నుఅతనికి లేడు. అందుచే ఆగ్రంథములు చెప్పిన చెప్పిన ఇతడు చెప్ప"లేదని రాస్తారు శ్రీ త్రిపురనేనివారు.

## వేమన - కాలం

"అచ్యుత దేవరాయ, మాన్యహిత వర్తనుడు శౌర్య మహితయశుడు, భానతేజుండు రామయ భాస్కరుండు" అని గుంటూరు జిల్లా కొండవీటి కోట ఉత్తరపు ద్వారం ఉడివైపు గోడమీద రాయని బాచయ సీస పద్య శాసనం చెక్కించాడు. అందులో కాలంలేదు. అచ్యుతరాయలు 1530-42 మధ్య రాజ్యం ఏలినవాడు రాయన భాస్కరుడు అప్పటి వాడే. అతని 'ప్రకట ధర్మఖ్యాతి' ఆంధ్రమండలం అంతటా వ్యాపించిందని, "యవనులను గెలిచినాడని" శాసనంలో చెప్పుకన్నాడు (శా.ప.మం. ప్ర.భా. 10వ పుట). గుంటుపల్లి ముత్తామాత్యుడు"మత్తారి రాహుత్తోన్మత్తవజీర వారపరివారోదారసాహో"అని ఒక చాటువు(చా ప.మం. 2వ భాగం పుట 108. 1922) లో వర్ణింపబడటంచేత రాయని భాస్కరుడు, ముత్తయ యవన బలాన్ని ఎదుర్కొని గెలిచి ఉంటార. రాయని బాచడు ఎప్పుడు గతించాడో తెలియదు కాని ముత్తడు క్రీ.శ. 1623 లో దివి కరిగినట్లు కంద పద్యం చెబుతోంది కాబట్టి వేమన అందరూ చెప్పినట్లు 17వ శతాబ్దం వాడే. ఎడపాటి ఎర్రన చెప్పిన కృష్ణరాయలు శ్రీ కృష్ణ దేవరాయలు కాదు. చుండి, వేజెళ్ళ, తెట్టు సంస్థానాధీశ్వరులలోని కృష్ణరాయలు. ఈ వివరాలు గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు "కవిజీవితాల"లో వెన్నెలకంటి వెంకటాచలం "కవియొక్క" చరితలో రాశారు. కృష్ణరాయలు అనగానే రాయలు జ్ఞాపకం రానక్కరలేదు నిన్న మొన్నటి ముట్నూరి కృష్ణారాయడుని తలచుకొంటే చాలు. రాధామాధవ కవి రాధామాధవంలో శ్రీకృష్ణుణ్ని"కృష్ణరాయ అని" ఒక చోట సంబోధించాడు. ఏది ఏమైనా వేమన, ధూర్జటి కవులను స్తుతించినవారు క్రీ.శ. 1530 తరవాత వారు. వేమన స్తుతించిన నిమ్మల లక్ష్మణ కవి 1725 వ ప్రాంతము వాడు. నాగర ఖండంలోని కవిస్తుతిలో వేమన ఉన్నాడు. అతనితో అధర్వణుడు కూడా ఉన్నాడు. 1700 ప్రాంతంలో అహోబలుడు సృష్టించిన ఈ అధర్వణుడు కల్పిత పురుషుడు.

## వేమన - శివయోగం

యోగం నాల్గు విధాలు. మంత్రలయ, హఠ, రాజ యోగాలని ఈ నాల్గింటిని యోగశాస్త్రవేత్తలు, వ్యాఖ్యాతలు రాస్తూ ఉంటారు.

మంత్రాన్ని, ముఖ్యంగా పంచాక్షరిని నిర్విరామంగా జపించేవారు మంత్రయోగులు.

చిత్తాన్ని ప్రపంచ వ్యాపారం నుండి మరలించి అనావృత మహానాదంలోగాని, తాను ధ్యానింప దలచిన స్థలంలో గాని మనస్సుని వాయు మనో యుతంగా లీనం చేసే వారు లయ యోగులు.

ఆసన, బంధ కరణ, ముద్రాభ్యాసంచేకాని, కేవల కుంభకమార్గాన్ని గాని ఎవరికి వాయువు స్వాధీనమవుతుందో అతడు హఠయోగి. మంత్ర లయ, హఠయోగం ద్వారా ఎవరికి బ్రహ్మసాక్షాత్కారం కలుగుతూందో వారు రాజ యోగులు.

---

* "హఠయోగం అంటే-"హ"కారానికి ఊర్ధ్వగతి అయిన ప్రాణవాయువు అని "ఠ"కారానికి అధోగతి అయిన అపాన వాయువు అని అర్థం చెప్పారు. కాని హఠం అంటే పట్టుదల, బలాత్కారం, దౌర్జన్యం, పీడనం, మొండితనం అనే అర్థాలు కూడ ఉన్నాయి" అన్నారు గోపీ (ప్ర.వే.227) అపాన వాయువంటే "పిత్తు" అని ప్రౌఢ్యం." ఇంకొంచెం గౌరవమైన భాషలో ఇదే అర్థంలో సూ.ని పేర్కొన్నాయి. కళింగ ప్రాంతంలో అపాన వాయువు, పిత్తు అని రెండు పదాలు వాడతారు. హఠయోగం అనే సమాసానికి

"హకారః కీర్తితః సూర్యః
ఠ కారశ్చన్ద్ర ఉచ్యతే

సూర్యాచంద్రమసొయోగాత్
హఠయోగోనిగద్యతే"

(సూర్యచంద్రుల సంయోగం చేత హఠయోగం సిద్ధిస్తుంది. ఇడా నాడికి చంద్రుడని, అర్థం దాని చేత ప్రాణ వాయువు పూరించాలి. ఆ తరవాత సూర్యుడనే పింగళానాడి చేత ఆ వాయువుని విడిచిపెట్టాలి- ఇది దీని రహస్యం. హఠ యోగ ప్రదీపిక చదివితే అన్నీ తెలుస్తాయి.)

ఈ రాజయోగం సుళ్ళీ మూడు విధాలు. సాంఖ్యం, తారకం,అమనస్కం. 25 తత్వాల నిజతత్వం తెలుసుకోవటం సాంఖ్యం. బాహ్యముద్రాజ్ఞానం తారకం, అంతర్ముద్ర అమనస్కం. రాజయోగం అనే శిఖరం చేరడానికి హఠ యోగం నిచ్చెన. హఠయోగం కష్టం కదా అని వదిలివేస్తే రాజయోగం ఫలించదు. యోగాలకు రాజువంటిది రాజ యోగం.

## వేమన పద్యాలలో రాజయోగం

మదిలోనిది రాజయోగ మహిమము వేమా (31-206) రాజయోగీంద్రుడాతడె తేజరిల్లు (40-264) రాజయోగి (43-282).

• • •

తాను నింద్రియముల దనర జయించిన
తత్వమరసి చూడ దానయగును
రాజయోగి యిట్లు తేజరిల్లుచునుండు (87-173)

రాజయోగి (136 - 35) ఇంకా ఎన్నో పద్యాలు ఉన్నాయి.

## తారకయోగం

తారకంబు జూచు దారి వేరే కల్దు
సమముగా జూడచక్కబడును
వెర్రిగాను జూడ వెలుగెల్లి పారురా (19-123)
ధర్మమే నృపులకు తారకయోగంబు (24-161)

* * *

తన్ను జూడ జూడ తారక బ్రహ్మంబు (52-344)
తలపుచేతగల్గు తారక బ్రహ్మంబు [52-345]
తనువుందానగుట యోగి తారకమాత్మన్
తను యనుచు పరిణమించిని [54-358].

వేమన పద్యాలలో ఎక్కువగా కన్పించేది యోగ విషయమే. యోగాంతర్గతాలయిన కామక్రోధాదులు, తీర్థ యాత్రలు, విగ్రహారాధన ఖండన మొదలయిన వాటిమీద యథేచ్ఛగా పద్యాలు చెప్పుకుంటూ పోయాడు. అవి అవ హేళనతోను , విమర్శతోను నిండి ఉంటాయి. వేమన జంగం అనే భ్రాంతిని బ్రౌన్‌కి కల్పించినవి వీరశైవ, శివ యోగి పారిభాషిక పదాలతో కూడిన వేమన పద్యాలే.

## ఆత్మలింగ పూజ

వివరనవక మెల్ల వెలిమూసి వాయువుల్
మనసుతోన గూర్చి మర్మ మెరిగి
యాత్మలింగ పూజనంటిన ముక్తిరా (45-296)

• • •

బండె ప్రాళ్ళు దెచ్చి బంధించి కట్టంగ
లింగడెమి దొంగిలించినాడొ
యాత్మలింగమేల నర్చించి చూడరో (120 - 397)

## ఆత్మలింగం అంటే

పరమ మానంద రూపంబు బ్రహ్మంబని
యే మూర్తి జెప్పుదురెల్ల బుధులు
ఐశ్వర్య మహిమకై యాబ్రహ్మ విష్ణ్వాదు
లర్చింతు రేమూర్తి నహ రహంబు
మంత్ర, లయ, హఠ సమాన రాజప్రౌఢి
నొందుదు రేమూర్తి యోగివరులు
తెలియంగ లింగమందె జగత్సర్వమున్
ఘనత యేమూర్తికి గలిగియుండు

నట్టి యాది మధ్యాంత శూన్యైక వర్తి
కలిత వేదాంతశాస్త్ర విఖ్యాత మూర్తి
నద్వయ జ్ఞానమును పరమాత్మమూర్తి
శ్రీ మహాలింగమూర్తి గీర్తింతునెపుడు
(శివయో 1-6)

ఆత్మలింగం అనేది శిలా లింగంకాదు. పరమార్థం ప్రకారం చేతిలోను, ఎదను గట్టిగా దాచుకొనేది కాదు. అది నల్లని మేఘాల మధ్య మెరుపు (నీలతో యద మధ్యస్థా విద్యుల్లేఖేవభాస్వరమ్) సర్వభూత స్వరూపం, ధాన్యపు గింజ మొనకంటె సూక్ష్మాతి సూక్ష్మం శివయోగులకిది శివ స్వరూపంగా సాక్షాత్కరిస్తుంది. జ్యోతికళిక అన్నా ఇదే. బ్రహ్మం అన్నా ఇదే.

పండితారాధ్యులవారు శివతత్త్వసారంలో "ఒడలు గుడి" అన్నా, వేమన్న తనువు గుడి అని చెప్పినా శరీరాన్ని ఆలయంగా చేసి అందులోని ఆత్మలింగసాక్షాత్కారం కోసం ప్రయత్నించమనే అర్థం.

## విగ్రహాలు-పూజ

జలమయములు తీర్థములని
శిల మృద్దార్వాదికములును విశిష్టామరులం
చిల వాని నొల్లరు నియతా
త్ములు శివుడాత్మన్నిజముగ దోచిన పిదపన్

అల్పజ్ఞానులు కొఱకుం
గల్పించిన ప్రతిమలందు గన నొల్లరు సం
కల్ప పరులు యోగీంద్రుల
నల్ప మహిమ జెలగు శివుని నాత్మనె తక్కన్.
[శివయోగసారం 1-24,25]

ఈ భావాన్నే వేమన తిరిగి మరోసారి చెప్పాడు. అతను ఈ క్రింది విధంగా అంటాడు.

శిలను ప్రతిమ జేసి చీకటింటను బెట్టి
మ్రొక్కవలదు వెర్రిమూఢులార
యుల్లమందు బ్రహ్మయుండుట దెలియదు
గట్టు రాళ్ళు దెచ్చి కాళ్ళు చేతుల ద్రొక్కి
కాసె యులుల చేతగాసి జేసి
మొరపరాళ్ళ కెరగు మొప్పెలనేమందు.(164-230) (165-238)

ఇటువంటి భావాలున్న పద్యాలను చర్విత చర్వణంగా చెప్పటం వేమనకు పరిపాటి.

## కులం

కులము గలవారెచట ము
క్తులైరి కులహీనులెల్ల మదినెచటను ము
క్తులుగారె యోగి జనులే
కులజులుగా కితరులేటి కులజులు తలపన్.
[శివ యో. సా. 2-91]

కులంకన్నా గుణం ప్రధానమని, కలిమి ప్రధానమని,మాల మాదిగలను తక్కువగా చూడరాదనే భావం శివయోగులకే ఉంటుంది. యోగి అయిన పిమ్మట సర్వసంగ పరిత్యాగి అయిన శివయోగికి వీటితో ప్రసక్తే లేదు.

## తీర్థయాత్రలు

ఈ క్షితి కాశీక్షేత్ర కు
రుక్షేత్రము లాదిగా, నిరూఢములగు పు
ణ్య క్షేత్రములకు నరుగ న
పేక్షింపు దురాత్మ తీర్థమెరుగని వారల్
[శివయో2-147]

తానెచటికేగినను మరి తానె కాక
యితరుడగ నేర్పునే జనుడేవిధముగ
బుద్ధిజాడంగ భారంబు శుద్ధమైన
నఖిల తీర్థంబులును దనయందలేవె(151)

అరయ నిట్ల యగుట యాత్మ తీర్థము విస
ర్జించి బాహ్య తీర్థ సేవ సేయు
గోరి భ్రమసి తిరుగు కుమతుల నేమన
గలరు దీనిదెలియ వలెదె బుధులు (155)

రమణన్ భక్త సమగ్ర దర్శనము తీర్థక్షేత్రి,తద్గోష్ఠి తీర్థము,తద్దివ్యదయావలోకము తీర్థంబెన్నగా నిట్టి జం

గమ తీర్థాంబుధి నోలలాడక వివేక భ్రష్టులైపోయి లో
కమునం దీర్థములంచు నేరులు సొరంగా నేల
సర్వేశ్వరా. (24)
[అన్నమయ్య-సర్వేశ్వర శతకము]

ప్రాచీన శివ కవులు పై విధంగా చెప్పిన పద్యాలలోని భావాలనే వేమన పదే పదే చెప్పాడు. అతడు కొత్తగా చెబుతున్నాడని కాదు కాని, తను నమ్మిన దానిని గట్టిగా ప్రకటించాడు. ఈ క్రింది వేమన పద్యాలు ఆ కోవలోనివే.

తిరుమలకు బోవ తురక దాసరిగాడు
కాశిబోక లంజ గంతకాదు
కుక్క సింహ మగునె గోదావరికి బోవ [167 - 253]

• • •

కాశి కాశి యనుచు కడు వేడ్కతో బోదు
రందు గలుగు దేవుడిందు లేడె
యిందు నందు గలడు హృదయంబులెస్సైన
[257]

• • •

కాశి, మధుర, కాంచి, గయ, ప్రయాగయు సేతు
వాస తోడ వీటి నాత్మ జూచి
వాసనను దెలియడు వట్టి వెట్టి విధంబు (272)

# వేమన పద్య సంఖ్య

వేమన వేయి పద్యాలు రాసినట్లు చెప్పుకున్నాడు.

శ్రీకర శివతత్వ శీలుడే వేమన
ప్రాకటమగు వేయివద్యములను [39-201]

★ ★ ★

వేయి పద్యముల వివేకియై భక్తితో
పఠన జేసినట్టి [30-202]

★ ★ ★

వేమన పద్యాల ముద్రితా ముద్రిత ప్రతులలోని పద్యాలను లెక్కగట్టి, బ్రౌన్ సేకరించిన ప్రతులలో వేయి పద్యాలకు మించి ఉన్న ప్రతులు చాలా తక్కువ అని డాక్టరు గోపి తమ సిద్ధాంత గ్రంథం (ప్రజాకవి వేమనలో 19వ పుట)రాశారు. ప్రతి నెంబరు 1735 లో 1'16 పద్యాలున్నాయని ఇన్ని పద్యాలు ఏ తాళ ప్రతిలోను లేవని, అసలు ఏతాళ ప్రతిలోని పద్య సంఖ్య వేయిని మించిలేదని కంఠోక్తిగా ఆయన ఉద్ఘాటించారు.

డాక్టరు గోపీ చెప్పింది, వేమన వేయి పద్యాలని చెప్పుకొన్నది చక్కగా అమరాయి. ఆ తరవాత పెరిగిన తుక్కూదూగర ఏకి టాకాలు గట్టిగా వేసే దూదేకుల సిద్ధప్ప దొరికితేగాని వేమన పద్య సంఖ్య నిక్కచ్చిగా వేయికి కుదించలేం.

# వేమన పద్యాల్లో పూర్వకవి కృతాలు

వేమన పద్యాల్లో 1839 నాటి వేమన పద్యాల పునర్ముద్రణ పరిశీలిస్తే పూర్వకవికృతాలు, చాటు పద్యాలు, చాలా చేరాయి. పునరుక్త పద్యాల సంగతి చెప్పనక్కర లేదు.

"పదుగు రాడు మాట పాటియై ధరజెల్లు
నొక్కడాడు మాట యెక్కదెందు
నూరకాడు వాని మాట కూరెల్ల నోవదో"

అనే పద్యం బ్రౌను 1839 ఎడిషన్‌లో 68 వ పుట 40 వ పద్యంగా నమోదయింది. ఇది తాళ్ళపాక పెద తిరుమలాచార్యుని నీతి సీస పద్య శతకంలో ఉండే

పదుగు రాడిన మాట పాటియై ధరజెల్లు
నొక్కడాడినమాట యెక్కనెందు
నుఱక యుండిన వాని కూరెల్ల నోవదు(63)

అనే సీసపద్య భాగమే కదా! ఇక బ్రౌను ఇంగ్లీషు అనువాదంలో సాహిత్య అకాడమీ అచ్చు వేసిన సుమతీ శతకంలోని ఈ క్రింది కంద పద్యాలు 1839 బ్రౌన్ వేమన ఎడిషన్‌లో కనిపిస్తున్నాయి. ఇవి మొత్తం పరనారీ దూరగుండై (3-5), వినవలె నెవ్వరు చెప్పిన (21-143), కాదని యెవ్వరితోడను(32-2'2), వెలయాలివలనకూరిమి (77-102), పేదరికమంత (84-1:2), రతిలేక ముదియు (97 - 240), వెయ్యారు గతులు (19 -391 )

సాహిత్య అకాడమీ వేసిన బ్రౌన్ వేమన పద్యాల పరిష్కరణను విమర్శించిన బెంగోరె యోగి వేమన తెలుగు విజ్ఞాన కేంద్రం ద్వారా బయటపెట్టిన 1839 నాటి ముద్రణలో చేరిన పై సుమతీ శతక పద్యాల సంగతేఎత్తుకోలేము. ఒక్క సుమతీ శతకమేకాదు. ఈ కింది అనుభవసార పద్యాలు (6 ,102) కూడా 1839 బ్రౌన్ ముద్రణలో దూరిపోయేయి. అనుభవసారం పాల్కురికి సోమన కృతి.

ఇంద్రియ పరవశు డధముం
డింద్రియ నిగ్రహుండు భక్తియెడ మధ్యముండౌ
నింద్రియ జయుండు త్తముండు శి
వేంద్రియ సంధానుకుండు మహేశుడు కాడే ?

నిత్యంబు గాని యొడలికిం
బ్రత్యహమును బెద్ద దుఃఖపడవలె నన్నన్
నిత్యపదం బగు భక్తికి
నత్యంతము దుఃఖపడక యగునె మహాత్మా !

పీటికి చివర "వేమా" అనే సంబోధన చేర్చి చదువుతే వేమన పద్యాలవుతాయి.

పరుల దత్తమిట్లు పాలన చేసిన
నిల్వ స్వదత్తమునకు నినుమడించు
నవని పరుల దత్తమపహరించిన స్వద
త్తంబు నిష్ఫలంబు ధరణి వేమ (80-125)

ఈ పద్యం ఈ క్రింది భూమి దాన శ్లోకానికి అనువాదం.

స్వదత్తా ద్విగుణం పుణ్యం
పరదత్తాను పాలనం
పరదాత్తాపహరేణ
స్వదత్తం నిష్ఫలం భవేత్

అట్లాగే

తనదు దాన మవని తనకూతురి సమంబు
తండ్రి దానమెల్ల దనకు తోడు
అన్యులిచ్చు దానమది తల్లి వంటిది (81-126)

అనే పద్యానికి మూలం

స్వదత్తా పుత్రికా ధాత్రీ
పిత్రుర్ దత్తాసహోదరీ
అన్యదత్తా స్వమాతాచ
దత్తాభూమీం పరిత్యజేత్.

ఈ శ్లోకాలు సాధారణంగా అన్ని భూదాన శాసనాంతాల్లోను గోచరిస్తాము.

వేసమరసి చూడ గ్రాసంబు కొరకయా [22-150]
ఉదర నిమిత్తం బహుకృత వేషః [భజగోవింద శ్లోకపాదం]

పరగ రామనికులు బాచన్న ధనమెల్ల [104-288]

ఇది చాటు పద్యమణిమంజరి ప్రథమ భాగంలో 35 పుటలో ఉంది.

ఈ విధంగా బ్రౌన్ 1839 ఎడిషన్ లోనివి, అకాడమీ వారి ఎడిషన్‌లోనివి ముందు ఏరిపారేస్తే తరవాత ఇతర ముద్రిత ప్రతులను పరిశీలించవచ్చు.

డి. 1723 ప్రతిలోనిదని డాక్టరు గోపీ చూపిన

"గట్టిగ నార్గురేడ్గురిని" అనే ఉత్పలమాల పద్యం చివర "వటమూలమందిరా" అని మార్పుతో వటమూల మందిరా శతకంలో ఉంది.

# వెర్రి వేమన

వేమన్న కీ విశేషణం తను పెట్టుకొన్నదే. ఆకార చిత్రణలో కూడా వేమన్న వెర్రివాడు లాగే కనిపిస్తాడు.

"చెరచి మరచినట్లు చేష్టలు చెడి యొద్ది
యైన గుడిచి యెద్దియైన గట్టి
యెచటనైన దిరిగి యెచ్చోటనైనను
నుండు నతడు రాజయోగి వరుడు"

[శివయో. సా 4-294]

చెరుపు మరుపు మాటలాడుతూ పిచ్చిచేష్టలు చేస్తూ ఎవరెంత పెడితే తిని, ఏ గుడ్డముక్కో కట్టుకొని రికామీగా తిరుగుతూ, ఇష్టమొచ్చిన చోట నివసిస్తూ ఉండేవాడు రాజయోగి. వెర్రివేమన్నలోని వెర్రికి ఇదే అర్థం.

## వేమన బొమ్మ

అచ్చుపడ్డ వేమన బొమ్మ చూస్తే నిజంగా వెర్రివాడి లాగే ఉంటాయి ఒకటి, రెండు చిత్రాలు తప్ప ఈ క్రింది రేఖా చిత్రం అందరికీ బాగా పరిచయమైంది.



ఇట్లాగే వేమన కూర్చోడానికి కారణం ఏదో ఉండాలి హఠయోగ ప్రదీపిక అద్వైతయోగం చెబుతుంది. అందులో చెప్పిన ఆసనం కాదాయె ! మళ్ళీ శివయోగసారమే దిక్కయింది. వేమన సుఖాసనాసీనుడై ఉన్నాడు.

తనకెట్లుండిన సుఖమై
యనవరతాభ్యాసమునకు ననుకూలంబై
తనరారునది సుఖాసన
మనదగు శివయోగి జనసమాశ్రయమగుచున్.

(శివయోగ సారం 3-56)

చిత్తమంతస్థమై యుండజేసి బాహ్య
దృష్టి నియమించి తనకు నభీష్టమైన
యాసనంబున నుండి కాయంబు వక్ర
ముగ నొనర్చిన నిది ధ్యానముద్ర విధము (3-20)

ఈ ముద్రయందు నాత్మన
నామయు సర్వగుణు శాంతు నవిచలు నద్వై
తామేయమూర్తి బరశివు
డామగి జింతించు నతడ తగుము ప్రడిలన్(3-218)

ఆనన మనదగు నిష్టసు
ఖాసనమున సంతతంబు నాత్మస్ఫురి యం
దాసన్నత్వము సర్వో
దాసీనత గలిగియున్న తలపును జగతిన్(4-9)

వేమన సుఖాసీనుడై ధ్యానముద్రలో సర్వోదాసీనత భావంతో కూర్చున్నాడని మనం భావించాలి.

## అల్లమప్రభువు - శూన్యవాదం

"వీర శైవులకు తెలుగున తలకట్టు పాల్కురికి సోమన్న. వీరశైవమున శూన్యవాదమున్నదని అతనికి తెలియనే తెలియదు. అల్లమ ప్రభుని గూర్చి చెప్పినప్పుడైన "ద్వైతయోగ క్రియాద్వైత యోగక్రియాతీత యోగ క్రియాన్వితుడని" యన్నాడే కాని అక్కడాతడు ద్వైతాద్వైతయోగముల కతీతమైన యోగమనగా విశిష్టాద్వైత యోగమని కూడ భ్రమపడి యుండవచ్చును. అతడు "శూన్యవాది" యని యనుట ప్రమాదమే కాకపోయినాడు."

(వి3-పుట. 23).

అంతర యోగ నిరంతర యోగ
వంతు డనంత వేదాంత వేద్యుండు
నిశ్శరీరి శరీరి నిర్నామి నామి
నిశ్శబ్ద శబ్ది వినిర్భావిభావి

• • •

పుట్టిన బయలైన మూర్తి సేవౌనగ

అని బసవ పురాణంలోను,

"రతి లింగబాహ్యత్పరం నాస్తియన బాహ్యశూన్యంబ యది యతాశూన్యమనుచు"

అని చతుర్వేద సారంలోను అల్లమ ప్రభుని శూన్యవాదాన్ని గురించి చెప్పబడింది.

"తెనుగున నవనాథ చరిత్ర (గౌరనకృతము) యీ మతమునకు చెందినది. కాని అందులో ఆ మతము సిద్ధాంత విశేషములు పూజ్యము. ప్రాణములేని కట్టెగా నాథమతము ఆ రచనలో దొరుకుచున్నది. అంతే. ఆ మతములో యీ సహజ శూన్యత ఎక్కినది "(వి-వే- 6) సహజశూన్యత అంటే? ఏమిటో వేమనకు నాథ సిద్ధులతో సంబంధమున్నదట! బ్రహ్మ గుడ్డు అనే పద్యం శివయోగానికి చెందిందిగాని బౌద్ధమతం లోని మాధ్యమిక శూన్యవాదానికి చెందిందికాదు. రేవణుడు నవనాథులలో లేడు మరుళ, ఏకో రామ సిద్ధత్రయంలోని వాడు.

ప్రభు దేవర శ్రీశైలంలో గోరక్షలని కలుసుకోవడం ప్రభులింగలీలలో ఉందంటే అంతకు ముందు నవనాథ చరిత్రలో గోరక్షఅల్లమప్రభువుల సమాగమంవమ్మయినట్లా?

అసలు రాజయోగ హఠయోగ రహస్యాలు ఎందుకు చెప్పాలి. నవనాథ సిద్ధులు హఠయోగులు. అల్లమ ప్రభువు కూడా అంతే. పైగా శివయోగి.

అల్లామ ప్రభుదేవశ్చ ఘోడా చోలీచ టింటిణియః

అని హఠయోగ ప్రదీపికలో (1-8) అల్లమ ప్రభువు హఠ యోగిగా పేర్కొబడింది.

హఠ విద్యాపరం గోప్యా యోగినా సిద్ధి మిచ్ఛతా
భవేద్వీర్యవతీ గుప్తా నిర్వీర్యాతు ప్రకాశితా (1-11)

గుప్తంగా ఆ రహస్యంగా ఉంచకపోతే ఆసాధకులు నిర్వీర్యులవుతారు.

అందుకని గౌరనలోని సిద్ధులు హఠయోగ రహస్యాలను వెల్లడించలేదు. స్థూలంగా కొన్ని రాజయోగ రహస్యాలు గౌరన తెలిపాడు.

బౌద్ధంలో శాశ్వతత్వానికి ఉచ్ఛేవాదానికి మధ్య ఒక తాత్త్విక స్థితిని అవలంబించినవారు మాధ్యమికులు. ద్వైతు లయిన వైభాషికులకి బాహ్య- అంతర ప్రపంచాలు రెండూ యథార్థాలే. ఈ యథార్థాన్ని భావాల నాధారంగా చేసుకొని తర్కించలేకపోతే వ్యర్థమని సౌత్రాంతికులు భావాను మేయ వాదాన్ని ప్రతిపాదించారు. యోగాచార్యులు బాహ్య ప్రపంచాన్ని భ్రమగా నిరూపించి, భావాలను యదార్థంగా మాన సాధనం చేసుకొన్నారు. వీరి ఆత్మాశయ భావవాదం. భావం - పదార్థం అవినాభావాలయినప్పుడు, వాటిలో పదార్థం భ్రమ అయినప్పుడు భావంకూడా భ్రమకావలిసిందే. అప్పుడు అంతా శూన్యమే అని మాధ్యమికులు ప్రతిపాదించారు. శూన్యం దృగ్విషయ ప్రపంచాతీతమైన యథార్థాన్ని, పారమార్థిక సత్యాన్ని ప్రతిపాదిస్తుంది. లౌకిక ప్రపంచాన్ని, లౌకికాన భవాలను మాధ్యమికులు కాదనలేదు. అయితే అవి పరమార్థాలు కావు వారికి.

వేమన్నది మత రాహిత్యమైన దృష్టి అని, ఆ దృష్టి నాగార్జునుల శూన్యవాదంతో సాధించవచ్చునని వి-వే వాదం. వేమన్నది మతరాహిత్య దృష్టి అని భావించడం అతని తాత్త్విక చింతను గణనలోకి తీసుకోకపోవడమే కారణం. వేమన్నది నిరీశ్వర సిద్ధాంతమని నిరీశ్వరవాదులు భ్రమ పడటంలో పొరబాటు లేదు. కాని అతని పద్యాలలో సగానికి పైగా శివస్మరణే కనబడుతున్నప్పుడు వాటిని విస్మరించడానికి బలమైన సమర్థన కావాలి. ఆ పద్యాలు స్మరించినా, ముట్టుదున్నా మహా పాపం అన్నట్లు వాదన కుప్రక్రమిస్తే ఆ వాదన పేక మేడలా కూలిపోక తప్పదు. ఏ పద్యాలు వేమనవో, ఏవి కావో నిర్ణయం కానప్పుడు, నకిలీ పద్యాలు ఆధారంగా చేసుకొని వాదాన్ని నడిపే ప్రమాదం వస్తుంది. వేమన చెప్పినట్లు అది చోద్యమైన జ్ఞానం అవుతుంది. వేమన్న ఆర్ధిక ప్రస్థానంకన్నా అతనిలో యోగలక్షణాలు, అందులో ముఖ్యంగా శివయోగి స్వరూపం గోచరిస్తుంది. అదికాదని బుజువైననాడు మాధ్యమిక శూన్యవాదాన్ని, ఆర్ధిక ప్రస్థానాన్ని అంగీకరించడానికి ఎవరికీ అభ్యంతరం ఉండదు.

## అల్లమప్రభువు - శూన్యవాదం దేశాయిగారి తీర్పు

Sunya - This is described by the Buddhists as Sunya and Nirvana. The Virasaivas call it Bayalu or Nirbayalu. But the two concepts are divergent and their contrast is distinct. The former is negative and the latter is positive. Sunya in Buddhism means extinction and non-entity. Sunva of Virasaivism is an entirely different, grand, and sublime entity. This sunya is here equated with Siva, the infinite and supreme soul. It is reminiscent of the upanishadic Brahman. (Sunya Sampadane Vol.I, Karnataka University Publication. Preface P. VIII (1965)

There is no Comparison of Virasaivism which is positive, zealously theistic and robustly optimistic with Buddhism which is negative, atheistic and pessimistic.

Basaveswara and his times - Dr. P. B. Desai (1968. Page 325).

దేశాయిగారు బౌద్ధశూన్య వాదానికి, వీరశైవ (అల్లమ)శూన్యవాదానికి ఏ విధంగా పోలికలేదని చెప్పారు. నిరీశ్వర శూన్యవాదానికి, సేశ్వరశూన్యానికి పొత్తుకుదరదు. పండితారాధ్యుడు క్రీ. శ. 1180-90 ప్రాంతాలలో చంద వోలు వెలనాటి చోడుని ఆస్థానంలో ఇతర సమయవాదులను ఎదుర్కొని చేసిన సవాళ్ళలో.....

బౌద్ధుండ వినుము నీ బౌద్ధంబు శ్రుతి వి
రుద్ధంబు, భవపాశబద్ధంబు, భువి ని
షిద్ధంబు, దుఃఖ సమృద్ధంబు; పాప
బద్ధంబు, మున్న యబద్ధము— అని మొదలు పెట్టి

శూన్యవాదం గురించి ఎత్తుకొని

శివిరి యుత్పత్తి స్థితి విలయ హేతు
వవునె దైవము శూన్యమయ్యే నేనియును
దెలియ నుత్పత్తి స్థితి విలయ హేతు
విల గాని యది దైవమెట్లును గాదు
దలపోయ శూన్యతత్త్వముగల యదియె ?
తలపోయ శూన్యతత్త్వము లేని యదియె ?
కలదేని శూన్యంబు గాద శూన్యంబు
గలుగదేన్ శూన్యంబు గలుగదెట్లనిన
గలదేని శూన్యమన్ పలుకు వా బొంకు
గలుగదేన్ శూన్యమున్ పలుకు వా బొంకు
గాన యహింసా విహీనులు, సత్య
హీనులు, క్రియాపర హీనులు, గర్మ
హీనులు, నిజ దైవ హీనులు, పుణ్య
హీనులునగు బౌద్ధ జైనాదులకును
గలుగునే మోక్ష వికస్వర సుఖము [వాద ప్ర. 586-590]

## వ్యాసం చివరి మాట

"మానవుని నిత్యజీవితమునందు దుఃఖ నివృత్తికిని, సుఖ ప్రాప్తికిని దైవసందర్శనము పరమ సాధనము గ నున్నది. జైన బౌద్ధమతములు సంసారము దుఃఖసాగర, మనియును, సన్న్యాసము సుఖసాధన మనియును నుప దేశించినవి. అద్వైతము సంసారము మాయా కల్పితమని యుపదేశించినది. పండితులు, బ్రాహ్మణులు కర్మలతోను సిద్ధాంతములతోను, సన్న్యాసాశ్రమముతోను గాలయాపనము చేయుచున్నను ప్రజలజ్ఞానాంధకారమగ్నులై దుఃఖ వేదన ననుభవించు చుండిరి. వైరాగ్యము, నిర్లిప్తత్వము, నిర్ల క్ష్యము, నిస్పృహ, నిస్సహాయత్వము పరిపాటియై, భారతీయ చైతన్యము నిర్వీర్యమైనది".

అని దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావుగారు అర్ధ శతాబ్దం కిందట చెప్పిన మాటలలో ప్రత్యక్షరం ఈ నాటి స్థితిగతులకు వర్తిస్తుంది. (1926 లో ఆంధ్ర గ్రంథమాల ప్రచురించిన బసవ పురాణ పీఠిక)

భారత జాతి తాత్త్విక ధోరణులపైనగాని, భిన్న మతాల మహా పురుషులు ప్రతిపాదించిన వాదాలపైకాని, అఖండ భారతావని చారిత్రక, సాంస్కృతిక సమ్మేళనంపై కాని ఇప్పటివారికి సదవగాహన కాని, మౌలికమైన భావం కాని ఏర్పడలేదని, ఆ ఏర్పాటుకి అనువైన పరిస్థితులు కూడా కనపడటం లేదని విచారం వేస్తుంది. సర్వమానవ కల్యాణం ఇంకా ఎంత దూరం ఉందో !



శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం

# సైలెన్స్

ముఖపు తిరగబోతూ టే - ఒక్కసారి - ఎందుకోవెనక్కి తిరిగిచూడాలని మనసు కొట్టుకుంది.

చూశారు.

ఆ యిల్లు - బోసిగా ... దీనంగా.... కళావిహీనంగా.

ఆయనకు మళ్ళీ దుఃఖం వొచ్చింది. అసలే బరువుగా ఉన్న గుండె మరింత భారమైంది. కళ్ళల్లోకి నీళ్ళు వొచ్చాయి-అంతవరకూ అతి కష్టంమీద ఆపుకున్నవి.

భర్తనుకోల్పోయిన స్త్రీ....యజమానిని పోగొట్టుకన్న గృహమూ-బోడిగానూబోసిగానూకాక కిలకిలలాడుతూనూ కల కలలాడుతూనూ ఎలా ఉంటాయి? అందులోనూ రఘుపతిది అకాలమరణమూ, అసహజ మరణమూ.

పైపంచెతో కళ్ళుతుడుచు కున్నారు శ్రీనివాస రావుగారు. రఘుపతి భార్య గోడుగోడున విలపిస్తూ చెప్పిన మాటలే గుండెలో మార్మ్రోగాయి.

"సాయంత్రం - మామూలుగా రోజూలానే సంచీ పట్టుకుని బజారుకి వెళ్లారు,ఆకాకరకాయులు తెస్తానని.అంతే... మరి తిరిగి రాలేదు. లారీకింద పడిపోయారని కబురొచ్చి పడింది పిడుగులా. వారికి చెముడు. మీకు తెలుసుకదా? ఎంతో మొత్తుకున్నాను చెవిలో మిషన్ పెట్టుకోండి. ఏళ్ళ తరబడి తినేస్తూంటే - ఓ పట్టాన ఒప్పుకున్నారుకారు. రేపీ ఘోరం జరుగుతుందనగా, ముందురోజు - ఏకళనున్నారో నా మాటవిని కంపెనీకి కార్డు రాశారు. అది వొచ్చేలోగానే యీ ఘోరం జరిగిపోయింది. లారీ డ్రయివరుది తప్పు లేదుట. హారన్ వేయనే వేశాట్ట. ఈయనకివినపడివుండదు. నాగీత యిలా ఉంటే" .. వలవల ఏడ్చిందామె. ఆ దుఃఖాన్ని చూసి- పరామర్శకు వెళ్ళకపోతేనే బాగుండేదేమో అనిపించింది. ఔను. పరామర్శంటే - మానుతున్న మానసిక గాయాన్ని మరోసారి కెలకడమేగా? కాని-ఎన్నాళ్ళనుంచో అతను స్నేహితుడు. రఘుపతీ తనూ సహోద్యోగులు. వెళ్ళకుండా ఎలా ఉండగలడు ?

పాపాత్ముడు పాముకాటుకి మరణిస్తాడుట. అదేమో కాని ప్రమాదంలో మరణించడం కంటె మరోపాపంలేదేమో! శరీరం నుజ్జునుజ్జు ఐ - బాధతో కొట్టుకుని - భయంకరంగా మరణించడం.... పోలీసులు శవాన్ని దహనాని కివ్వకుండా పోస్టుమార్టమ్ అనీ, స్టేట్‌మెంట్లనీ ప్రాణాలు తియ్యడం.... ఎంత తతంగం అది! పాపం రఘుపతి భార్యా కొడుకూ ఎలా పడ్డారో యీ యాతనంతా. సమయానికి తను ఊళ్ళో లేడు.

మృత్యువు తాలూకు హెచ్చరిక లాటి లారీ హారన్- వినపడక చచ్చిపోవడం- ఎంత విచారించదగిన విషయం! ఎంత దయనీయ మయిన విషయం! రఘుపతి సహృదయుడు. సజ్జనుడు. సన్మార్గుడు. అటువంటి వాడి కిటువంటి దుర్మరణమా! ఉండుండి దేముడికి తిక్క రేగుతుందేమో. సృష్టించ దలచుకుంటే సవ్యమయిన మనుషుల్ని సృష్టించాలి. లేదా, చేతులుముడుచుకు కూర్చోవాలి. అంతేకాని అంధులనే, బధిరులనీ, కుంటివాళ్ళనీ, పొట్టివాళ్ళనీ- అంగవికలురని సృష్టించడం దేనికీ పనిమాల?

"ఏస్కో కోకకోలా....తీస్కో రమ్మా షోడా...."

పులిలా ఉరికింది పాట - మైకులోంచి. శ్రీనివాస రావుగారు ఉలిక్కిపడ్డారు. ఆయన గుండె అతి వేగంగా కొట్టుకుంది. భయంగా ఆయన చేత్తో గుండెపట్టుకుని, నడవడం మాని-నిలబడిపోయారు. ఓ నిముషానికి-స్వస్థత చిక్కింది. అప్పుడు - పాటవేపు చూశారు కోపంగా.

రోడ్డుపక్క - చిన్నపందిరి. అలంకారాలు. గణపతి బొమ్మ. ముందు ప్రమిదెలో దీపం. పక్కన మైకుసెట్టు. మైకులోంచి పాట.... "ఏస్కో కోకకోలా...." గణపతి నవరాత్రులు....అనుకున్నారాయన జ్ఞాపకం వచ్చినట్లు. గణపతి

నవరాత్రులంటే.... మైకులు....రికార్డింగ్ డ్యాన్సులు....సిని మాలు....సందడి.

ఆయన కేదో అర్థమైనట్లనిపించిందొక్కసారి. దేముడు నేడు వక్రసృష్టి, వికృత సృష్టి ఎందుకెక్కువగా చేస్తున్నాడో తెలిసిపోయినట్లనిపించింది. బూతు పాటలతో పూజించే.... బ్లూఫిలిములతో అర్చించే... రమ్ముతో అభిషేకంచేసి- స్త్రీ నగ్న శరీరాన్ని నైవేద్యం పెడుతున్న మానవాళికి దేముడు యింకేమిస్తాడు వక్ర వికృత సృష్టికాక? చేసుకున్న వారికి చేసుకున్నంత మహదేవ అనలేదూ పెద్దలు? బూతుపాటల తోనూ, క్యాబరేడాన్సులతోనూ వినాయకుడికే మనోవైకల్యం తెప్పిస్తున్నారు మన మానవులు. అందుకే కాలం యిలా ఉందేమో.

ఆ పాట తాలూకు హోరువినలేక చెవులు మూసు కున్నారు. అడుగులు పడిగా వేయసాగారు. ఆయాసం వొస్తూంది కానీ, ఆ పాట తప్పుడం మానలేదు. ఇంకా వేగంగా నడవడం ఆయనకి సాధ్యంకావడంలేదు. ఆయన వయస్సు యాభై దాటి రెండుమూడేళ్ళే కాని ఏడాది కిందట ఆయనకి రక్తపుపోటూ గుండెదడా వొచ్చాయి. దానితో- వేగంగా నడవనూలేరు, ఎక్కువ శబ్దం భరించనూలేరు. ఆ పైన-పరామర్శ చేసి వొస్తున్నారేమో మనసు మరీ వికలమైంది. రిక్షాలో వెళ్ళేవారే యింటికి. కాని- యీ రోడ్లు ఆయనకి కొత్తకావు. గోతులుపడి-ఒకటే కుదుపు. ఇటువంటి రోడ్లమీద రిక్షాలో వెళ్తూంటే నరకమే కనపడుతుందడుగడు గునా. అయినా యిల్లు చాలా దూరమూకాదు.

క్లాసులో -ఏ మాత్రం గోలయినా-పాఠం చెప్పడం ఆపేసి-"సైలెన్స్" అని కేకవేస్తారు. ఆయన అరిస్తే- మామూలు మనిషి మాట్లాడినంత. ఉండుండి ఆయన కొక సందేహం వొస్తూంటుంది- "విజ్ఞానమూ నాగరికతా పెంచేసు కుంటున్నాం" అని విర్రవీగుతున్న నేటి మానవుడు నిజంగా ఎక్కడున్నాడు? ఇతనిపడుగు-ముందుకా, వెనక్కా? నిశ్శబ్దం తాలూకు సౌఖ్యమూ విలువా తెలుసుకోలేక-వాతావరణాన్ని మనిషి మెదడునీ కలుషితం చేసి వొదిలే శబ్దంపట్ల వీళ్ళెందు కిలా వెర్రిగా పిచ్చిగా పరుగు పెడుతున్నారు?

గ్రామఫోన్ .... టెలిఫోన్....మైకు....రేడియో....ఉప న్యాసాలు.... అన్నీ శబ్దాన్ని పెంచేవే ప్రపంచాన్ని ప్రశాం తంగా ఉండనివ్వక. చివరకు - సంగీతంలోకూడా శ్రావ్య తనీ సౌమ్యతనీ చంపేశారు-రాక్‌లు, స్టీరియోలు, డిస్కోలు- అంటూ అరుపులూ గోలా మొదలుపెట్టి హద్దుమీరిన శబ్దం- మనిషి మనసుని వికలం చేస్తుందన్న చిన్న విషయాన్ని గ్రహించి ఆచరించలేని యీ మనుషులది-జ్ఞానమా, అజ్ఞా నమా? నాగరికతా, అనాగరికతా? పురోగమనమా, తిరోగమ నమా?

నడుస్తున్నారు-శ్రీనివాసరావ్‌గారు. రోడ్డుపక్క మైకుల గోలలు రోడ్డుమీద జనంగోల. రోడ్డుమధ్య వాహనాల అరు పులు. అన్నీకలసి ఆయన కర్ణభేరిని బ్రద్దలు చేస్తున్నాయి. గుండెలదరగొడుతున్నాయి.ఆయన వేళ్లతో చెవులుమూసు కునినడుస్తున్నారు. పేవ్‌మెంట్లు దుకాణాలతో నిండగా,రోడ్డు వారగా నడుస్తున్నారు. ఆయనకి రఘుపతే గుర్తుకివచ్చాడు. ఒక్కసారాయన ఉలిక్కిపడ్డాడు.నిలువెల్లావొణికిపోయాడు.

రఘుపతి మరణానికి కారకుడు తనుకాదుకదా?

రఘుపతి భార్యకు తెలియదుకాని అతడు హియరింగ్ ఎయిడు పెట్టుకోకుండా ఎప్పటికప్పుడు నిరుత్సాహపరుస్తూ వొచ్చింది తనే.

"చెవిలో చెట్టుమొలిచినట్లు ఆ ఎయిడూ, దానిపైరూ అదో పెద్దతతంగం. తీరాచేస్తే శబ్దం ఎలా ఉండేదలా విని పించదు. పదింతలో పాతికింతలో ఐ- వినిపించి ప్రాణం తీస్తుందట. ఆ హోరు అతి దుర్భరమట. మనది మరీ పెద్ద నగరంకాదు. రోడ్డుమీద హారన్ వేయకూడదనే నిషిద్ధంలేదు సిటీలలోలాగ. లారీలు వరుగెడుతూంటే వొచ్చే శబ్దానికే పాదచారులు ప్రాణభీతితో పరుగెత్తాలి. అటువంటిది- లారీ హారన్ పాతికింతలో పంపరెట్లో ఐనే ఎయిడులో వినిపిస్తే- గుండె ఆగిపోదూ? అయినా-నిశ్శబ్దంలో ఉన్న సుఖం శబ్దంలో ఎక్కడుంది? నిజం చెప్పాలంటే....నిన్ను చూస్తే నా కసూయ. వినపడక-హాయిగా ఉంటున్నావని. నాకే శక్తి ఉంటే-నా చెవులు నీ కిచ్చి నీ చెముడు నేను తీసుకునే వాణ్ణి. అయినా నీది మరీ బ్రహ్మ చెముడేమీకాదుగా. కొంత వినపడుతుందిగా—" అంటూ అతను హియరింగ్ ఎయిడ్ పెట్టుకోకుండా చేశాడు తను. అందువల్లనే ఆకస్మిక మరణం చెందాడేమో ప్రమాదంలో? పరోక్షంగా-రఘుపతిని తనే చంపాడా?

తనకి తానే నేరస్తుడిలా అనిపించి — పశ్చాత్తాపంతో భారమైన హృదయంతో — మెల్లగా నడుస్తున్నారాయన, తుడువాతో కళ్లద్దుకుంటూ. చిన్నటౌన్లలో పేవ్‌మెంట్లు నామమాత్రాలు. కూరల బుట్టలూ.. మిఠాయిబళ్లూ.... చిన్న చిన్న దుకాణాలూ ఉంటాయి పేవ్‌మెంట్లమీద. నడిచే వారికి చోటుండదు. చేతిలో పైసలుపడ్డాక పోలీసులు రూల్సుని మరచిపోతారుమరి.

శబ్దంమీద ద్వేషంతో.... కోపంతో.... నిశబ్దంమీద వల్లమాలిన ప్రీతితో.... అభిమానంతో.... నా ఇష్టాయిష్టాలతో... సిద్ధాంతాలతో.... మిత్రుడివైన నిన్ను నేనే చంపేశానా రఘురాం? నీసమాధికి నేనే పునాది వేశానా? నన్ను క్షమించవూ!" గొణుక్కుంటూ- పరధ్యానంగా నడుస్తున్నారు. ఆయనకి చాలాదుఃఖం వొస్తూంది. మనసు- దేనికో మధన పడుతూంది. పక్కన ఎవరో బిగ్గరగా మాట్లాడేసరికి- యాంత్రికంగా- "సైలెన్స్....నోనాయిస్ ...." అంటూ అరిచారు క్లాస్‌రూమనుకుని. అంతలో వాస్తవం గుర్తించి-అలవాటులో పొరపాటనుకుని-సిగ్గుపడుతూ నాలిక కరుచుకున్నారు. ఇంటి దగ్గరా యింతే ఆయన. ఇల్లాలయినా సరే గట్టిగా మాట్లాడితే యిలాగే— "సైలెన్స్" అనిఅరుస్తారు. అందుకే ఆయనకి- "సైలెన్స్ మాస్టారు" అని నిక్‌నేమ్ పెట్టారు విద్యార్థులు. సైన్స్‌మాస్టారిగా కంటె — "సైలెన్స్ మాస్టారు" గానే ఆయన ఎక్కువ ప్రసిద్ధిచెందారు స్కూల్లో.

శ్రీనివాసరావ్‌మాస్టారి కేక- "సైలెన్స్-" డ్రయివర్ వినిపించిందో లేదో కాని- ఒక్కసారి ఆయన పక్కగా- చెవి దగ్గర.... బిగ్గరగా....కర్కశంగా....దిక్కులుపిక్కటిల్లేలా.... లారీహారన్!

ఆక్షణంలో- ఆయన- కళ్ళుమూసుకుందుకు రెప్పల నిచ్చి రక్షించినదేముడుచెవులుమూసుకుందుకు దొప్పలనెందు కివ్వలేదు మనిషికని ఆలోచిస్తున్నారు. లారీహారన్....ఆయన ముఖం ఎర్రబడి....నిలువెల్లా చెమటలు పట్టి... ఊగిపోయి కూలిపోతూ- "సై...." అన్నారంతే. మాటపూర్తికాలేదు. మనిషి కూలిపోయారు.

జనం- ఆగి- ఆయన చుట్టూ మూగారు. లారీ ఆపి డ్రయివరూ పరుగెత్తుకొచ్చాడు కంగారుగా భయంగా ఆశ్చర్యంగా. "బండికి.... బాడీకి.... మనిషి టచ్చయినా కాలేదే!"

"మనిషి చచ్చి పోయారు-" ఎవరో నిర్ధారించారునాడి చూసి.

"షాక్...."

"హార్ట్ అటాక్...."

ఏదేమయినా- శ్రీనివాసరావ్‌మాస్టారు- శాశ్వతంగా సైలెన్సయిపోయారు.



# కలల పక్షులు

శ్రీ కె. దినకర్

ఉదయాద్రి శిఖరం నుండి
చీకటి లోకంలోకి
ఉరికే అనంతకాంతి స్రవంతి
విసరే కిరణాల తుంపరులకు-
నిద్ర అనే చెట్టు కొమ్మకు
నిశ్చలంగా వ్రేలాడే
కళ్ళ గూళ్ళలోని
కలల పక్షు లెగిరి పోతాయి నిశ్శబ్దంగా
భావాకాశ వీధుల్లోకి
జీవితానుభవాల దిశాంచలాల్లోకి!



# ఆసకోన

## శ్రీ గూడ శ్రీరాములు

పసరు తొడిగిన జీవన కేదారం
అపశ్రుతుల మిడతల దండుల
ఒక్కుమ్మడి దండయాత్రకు
భగ్నావశిష్టమై మూలిగినపుడు
హతవిధి చెక్కిన పిచ్చిగీతల మీద
ఏ నక్షత్ర పటలీ ప్రభలు చల్లదు.

విచ్చలవిడి ఖండాంతరవాసి పక్షి
హిమాలయాల సందులు దాటుతూ
చెలరేగిన మంచు జడిలో చిక్కుకుని
అజ్ఞాతంగా అనంతవాహినిలో
కలిసిపోయినపుడు
ఏకన్నీటిబొట్టూ తుదిసాక్ష్యమై పలకదు.

పెనుగాలికి తాళలేక
నేలకొరిగిన జాలికళ్ళ
ఎడారి బిడారు బరువుల ఒంటె
జీవితేతిహాస అఖాతాన్ని
ఏ ఇసుకతిన్నెల ఎండమావీ కొలవదు.

• •

**భావితరాల జ్ఞాపకాల్లోకి**
పాకిపోలేనంటూ
ఓ గాలిపటం
నేలకేసి టపీమని కొట్టుకోబోయి
పకాలున నవ్వి
దారం తెంచుకుని
ఎగిరిపోయింది
ఆకాశంలోకి ఎత్తుగా.



# పతనం

## శ్రీ కె. గోదావరి శర్మ

జీవితం గాజుపలకలా
చేజారి భళ్ళున పగిలిపోదు.
కోటగోడలా మొండిగా
క్రమంగా కూలిపోతుంది.
మొదట మామూలు ఇబ్బందులు సాలెగూళ్ళలా
గుండెచుట్టూ అల్లుకుంటాయి.
అవమానానికి తడిసి, అవకాశానికి ఎండి
బతుకు బండబారిపోతుంది.
ఏదో అనుమానపుపక్షి ఎగిరొచ్చి
ఓ విషబీజాన్ని రెట్టవేసిపోతుంది.
నాచుపట్టిన మెదడుగోడమీద
ఆకుపచ్చ శత్రువు మొలకెత్తుతుంది.
స్వార్థం, ద్వేషం మనసుపొరల్ని చీల్చి
మానవత్వపు పునాదుల్లోకి వేళ్ళూనుతాయి.
ఎండలా న్యాయం, గాలిలాధర్మం
మెదడులో పరాజయవృక్షాన్ని పెంచిపోషిస్తాయి.
ఆత్మస్థైర్యం బీటలుపడ్డాక
బంధుమిత్రులు గోడలో ఇటుకల్లా
ఒకరొకరే జారుకుంటారు.
గతస్మృతుల శిథిలాలు
తప్ప ఇంకేమీ మిగలదు.

శ్రీ ముట్నూరి కృష్ణరావు

# దేశోద్ధారకుని నిర్యాణము

ఒక మహాజ్యోతి అస్తమించి, దేశమును చీకట్లు క్రమ్మినట్లు దుఃఖించుచున్నాము. కాని పరమపదించినది నాగేశ్వరరావు పంతులు కాని, దేశోద్ధారకుడు కాదు, విశ్వదాత కాదు, కళాప్రపూర్ణుడు కాదు. దేశోద్ధారకుడు దేశములోపల శాశ్వతమైన గుడిని నిర్మించుకొని లోకారాధ్యుడై నాడు. ఇక వానికి చావు ఎక్కడ? ఆంధ్రదేశము యొక్క వర్తమాన కాలము వాని యందు మూర్తీభవించి, నిండు వెలుగును వెలిగినది. ఆవెలుగు అంతకంతకు ప్రకాశవంతమగునదే కాని, క్షీణించునదికాదు. ఆంధ్రమహాజనుల హృదయాంతరమునందలి ఆశాజ్యోతియే ఆ మహావ్యక్తి యందలి ప్రతిభావిశేషము. ఈ దేశోద్ధారకుడు తనువును విడువక పూర్వమే విముక్తదేహుడై ఆంధ్రజీవనమున లీనమైనాడు. నాగేశ్వరరావుపంతులుగారి కంటె మేధావులు దేశమున గలరు, పండితులు కలరు, రాజకీయ నేతలు కలరు, సంఘసంస్కారులు గలరు, ధనాఢ్యులు కలరు, దాతలు గలరు. కాని వారెవరును బొందని ఆంధ్ర జనైక్యత ఒక్క నాగేశ్వరరావుపంతులుగారియందే సిద్ధించినది. ఎందుచేత? కాంగ్రెసు ప్రముఖుడగుటవలననా, కాంగ్రెసు ప్రముఖులింకను ఎందరు లేరు? పత్రికాధిపతులగుటచేతనా, దక్షిణదేశమున ఎక్కువ వ్యాప్తిగల పత్రికలకు అధిపతులైన వారెందరు లేరు? వితరణశీలురగుట వలననా, ఆస్తినంతను దేశసేవలో గోలుపోయిన త్యాగధనులెందరు లేరు? నాగేశ్వరరావుగారు వీరినందరిని మించి దేశమునంతను ఒక్క ముప్పది సంవత్సరములు గుత్తకుదీసికొని ఏకచ్ఛత్రాధిపత్యముగ నేలినమహానుభావుడు. కారణము? నాగేశ్వరరావుపంతులు ఒకవ్యక్తి కాక పోవుట చేతనే. నలుగురు వ్యక్తులలో నొకవ్యక్తి గాక, నలుగురిని మించి, నలుగురిని ఆవరించిన అభివ్యక్తి అయినాడు.

నాగేశ్వరరావుపంతులు మతమిది యనికాని, వారి రాజనీతి యిట్టిదనికాని, వారి విశ్వాసము లివియని కాని ఎవరును ఇదమిత్థమని విస్పష్టపరుపజాలరు. వారిలో నట్టి నిర్వచనము లేదు. అదిబయటకు లోపముగగన్పట్టవచ్చును కాని అదియే నిజముగ వారి గుణవిశేషము వారి మేధయందు మతనిరూపణముచేయు తర్కకాఠిన్యములేదు. వారిరాజనీతియందు స్వపక్ష పరపక్ష స్పర్థలను కల్పించు పౌరుష్యములేదు. వారి యభిరుచులయందు ఒక్క ప్రణాళికకు గాని ఒక్క ప్రమాణతకు గాని బంధించు సంకుచిత భావములేదు. వారిమతము సర్వమతముల నిముడ్చుకొనగల సామరస్యము. వారి రాజనీతి సర్వపక్షములను సహించు విశాల భావము. వారి వాక్కు పారుష్యమెరుగని వినమ్రమంజులపలుకు. వారి వేషభాషలు, వారి మూర్తి, వారి విగ్రహము, వారి భంగిమలు- "సర్వము" నకు దాసోహముచెప్పు ఆత్మవితరణము. సంఘసంస్కర్తలకు ప్రోత్సాహ మొసగుచుండినను, పూర్వాచారపరాయణుల యెడల భక్తి విశ్వాసములను వదలుకొనలేదు. నవీన సాహితీపరుల నాదరించుచుండినను, పూర్వకాలపు పండితులను బూజించుటకు వెనుదీయలేదు. రాజకీయరంగమున అతివాదులతోపాటు ముందంగ వేయుచుండినను, మితవాదులతో చెలిమిని విడనాడలేదు. నిజముగ నాగేశ్వరరావు పంతులుగారిని బోలిన ప్రముఖుడు సమకాలికులలో లేరనిన అతిశయోక్తికాదు. వారి వ్యక్తిత్వము కనబడని వాయువు వలె సర్వత్ర వ్యాపించి, సర్వోద్యమములకు ప్రాణాధారమైనది. ఎవరికంటెనుముందడుగు వేసిక్రొత్త దారులతీయలేదు. ఒకవిద్రోహమునులేవదీసిదేశమును గలవరపరచలేదు. వింత పనులుగావించి లోకమును విస్మయపరచలేదు. కాని నాగేశ్వరరావుగారి యునికిలేనిదిదేశములో నేయుద్యమమును తలయెత్తలేదు, ఏసంస్థయు పెరగలేదు. ఏప్రయత్నమును బలపడలేదు. అన్నిటికిని వెనుకనుండి సేదేని కిని కట్టుబడక, తన 'విశ్వదాతృత్వము'ను స్థిరపరచుకొనినాడు.

వ్యక్తిత్వము లేదని నంతమాత్రమున ప్రతిగాలికిని ఎగిరిపోవు దూది పింజవంటి లఘుమాత్రుడనుకొనవలదు. తర్కబలము లేదనినంతమాత్రమున, వివేచనలేని అస్థిరుడని తలంపజనదు సర్వసహత్వము గలవాడనినంతమాత్రమున దారితెన్నులేని భ్రమ్మరియని భావింపరాదు. నాగేశ్వరరావు పంతులు వెన్నముకలేని నీరసుడెంత మాత్రము కాదు. కాని వానియందు వ్యక్తిత్వముండినను, ఆ వ్యక్తి

త్వమెవరిని బాధించు వ్యక్తిత్వముకాదు. వాని వెలుగు వెన్నెల జిలుగు వంటిది. కన్నులకు మిరుమిట్లు గొలుపదు. కాని హాయినిచ్చు చల్లని చంద్రికవంటిది. వాని నడక ఎదుటి వారి కడ్డగించి పోటీపడు పరుగుకాదు చెలిమికాని సాహచర్యంపు విలాసమువంటిది. వాని వాక్కులో శక్తి కలదు, కాని ఆ శక్తి మృదుమధురము గర్వస్పర్శలేని ఆత్మ గరిమ. వాదబలమును ప్రదర్శింపని యోజనాపటిమ, స్పర్ధను సహింపని స్వపక్షాభిమానము. లాభనష్టములను గుణించని వితరణశీలము, తన్ను తాను మరువని నేతృత్వము, కృపణత్వము నెరుగని వినమ్రత, పాండిత్యప్రకర్షను జూపని జ్ఞాన సంపద, ఆడంబరములేని వేషము, విశ్రాంతిని గోరని కర్మపరతంత్రత, వాని విశేష లక్షణములు. ముందుకు త్రోసుకొనివచ్చు స్వభావము వాని యొద్ద నిసుమంతయు లేదు. కాని ఇతరులు తన నుపయోగించు కొనని యెడల గొంత చింతను దెల్పెడివాడు. వానిభవనములు, వాని ఆతిథ్యము, వాని ధనము ఇతరు లెంత ఉపయోగించుకొనిన వానికంత సంతోషము. గ్రంథాలయము కానిమ్ము, ముద్రాక్షరశాల కానిమ్ము, పుస్తక ముద్రణము కానిమ్ము, హరిజన పాఠశాల కానిమ్ము, స్త్రీ పాఠశాల కానిమ్ము, సాధనాశ్రమము కానిమ్ము, జీర్ణదేవాలయోద్ధరణము కానిమ్ము— వాని సహాయ మపేక్షించని వానిది పాపము. పరోపకారము కొరకేర్పడిన ప్రతిసంస్థయు వాని తోడ్పాటును బొందిననే వానికి సంతృప్తి. ఏ సంస్థయైనను తన తోడ్పాటును గోరదా, తాను దానికి సహాయము చేయులేనంత లోభినా యని చింతించెడివాడు. ఎవరి సహాయము లభించినను, లభించకపోయినను విశ్వదాత సహాయము లభించి తీరునను విశ్వాసమును ఆంధ్రదేశమునందంతట గల్గించినాడు.

వాని దానములలో ఇంకొక విశేషము గలదు. సామాన్యముగ ఆశ్రితులకు ఉపకారము చేయుట సహజము. స్తోత్రములకు లొంగనివారు అరుదు. కాని పంతులుగారి దానములను బరిశీలించిన విచిత్ర సందర్భములు గోచరించును. తనను ఎల్లవేళల తిట్టిపోయు ప్రత్యర్థులు సహితము వానిని సమీపించిన, వారిని ఒక పల్లెత్తు మాటయైన అనక వారికి భూరి దానము లొసగిన నిదర్శనము లెన్నియో కలవు. ఇదంతయు కీర్తిని కాంక్షించి చేసిరందుమా? వారు చేసిన గుప్తదానములకు లెక్కలేదు. అయ్యో, నాకు కళ్ళు మసక గ్రమ్మినవి. నాకు కళ్ళజోడు కొనిపెట్టుము- సరి ఇరువది రూపాయలు జేబులో నుంచి తీసి వానిచేతిలో బడవేయు వలసినదే. బీదబ్రాహ్మణుడను, పిల్లవానికి ఉపనయనము చేయించు బాధ్యత మీది-ఇదిగో తీసుకొనుము నూరు రూపాయల నోటు. నేను కాంగ్రెసుకు బోవలెనని ఉన్నది. టిక్కెట్టు ఇప్పింపుడు. సరియే వెంటనే తనకో టిక్కెట్టు, వానికొక టిక్కెట్టు అయ్యో నా గృహము పడిపోయినది పూరికొంప-తీసికొనుము ఈ మూడు వందలు. పరుల కంట బడకుండ ఇట్లు ఎన్ని ధనరాసులను విరజిమ్మెనో లెక్కలేదు. గ్రంథాలయములకు ఇచ్చినవారి పేర్లు రిపోర్టులలో ఎక్కవచ్చును. పెద్ద యుద్యమముల కిచ్చినది పత్రికలలో ప్రకటింప బడవచ్చును. కాని ఉపనయనాలకు, వివాహాలకు, గృహనిర్మాణములకు, గ్రంథముద్రణాలకు, ఇచ్చిన దానాల పట్టికలను లెక్కించిన వారెక్కడ? తనను ఇతరులుపయోగించుకొనుచున్నారను నదియే వానికి గావలసినది. అయ్యది విచిత్రమైన చిత్తవృత్తి. ఒక మిత్రుడు మాతో నొక మారిట్లనినాడు. పంతులుగారి సహాయము నర్థించకుండ, నీవు ఒకలైబ్రరీనో, ఒక స్కూలునో, ఒక ఆశ్రమమునో, ఒక పండిత సభనో స్థాపించుము. అది చాలును పంతులుగారిని పరిభవించి బాధించుటకు. పరులు తమ సహాయము నపేక్షించరా, పంతులుగారుపడు బాధకు అంతులేదు నా బ్రతుకునకికనిదియా పర్యవసానమని దుఃఖించెడి మహాత్మ.

పంతులుగారి జాతకమట్లునడచినది. వారి కీర్తిలతలు దేశమంతయు గాఢముగ నల్లుకొని పోయినవి. దేశీయుల భక్తిని ఇట్లు దోచుకొనిన బందిపోటుదొంగ మరియొకరు లేరు. నాగేశ్వరరావుగారి చరిత్ర ఆంధ్రదేశ చరిత్రగ రూపాంతరము పొందినది. భక్తుల చరిత్రను హరికథగ నాదరించెదము. అట్లే దేశోద్ధారకుని చరిత్ర దేశకథగ విలసిల్లినది. జీవితముయొక్క చరితార్థతయన నిట్టిది. నాగేశ్వరరావు పంతులు బహుపుణ్యశాలి. వాని సాధ్వీమణి పూర్వజన్మలో జేసికొనిన నోము ఇట్లు ఫలించి యుండనోపు.

"ధన్యమయీ త్వం!"
ధన్యమయీ జననీ!
ధన్యమయీ మాతృభూమి!

—ప్రధానవ్యాసము – కృష్ణాపత్రిక 16-4 38

వి వ ర ణ లు :

1. "దేశోద్ధారక" బిరుదు యిచ్చింది ఆంధ్రమహాసభే తనబెజవాడ సమావేశంలో (1924), అయితే వీటివల్ల "నా స్థితి చాలా హాస్యాస్పదమగుచున్నది" అనేభావం 1930లో తానే వెలిబుచ్చారు. తన పేరు ముందు వాటిని వాడవద్దని తిరుచునాపల్లి జైలునుండి ఒక లేఖ (1930 జనవరి 11)లో స్వయంగా రాశారు.

2. "విశ్వదాత"-ఈపేరు 192 లో గాంధీజీయూనివర్సల్ ప్రొవయిడర్ నుంచి వచ్చినట్లుంది. ఆయన గుప్తదానాల గురించి గాంధీ, మహాదేవదేశాయి రాశారుగాని, 1929 నాటి ఆంధ్రమహాసభయీ బిరుదిచ్చింది.

3. "కళాప్రపూర్ణ" బిరుదాన్నిచ్చింది ఆంధ్ర విశ్వ విద్యాలయము.

[సేకరణ శ్రీ కె. వి. రమణారెడ్డి]

---

# జటాయురివ పర్తితవ్యమ్

## శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి

దశ శిరమ్ములు కలిగిన దానవుండు—
కామవాంఛయె తనువెల్లఁగ్రమ్మికొనగ
అబల సీతనుఁ గొనిపోవు నట్టివేళ
భూమి యెంతగ కంపించిపోయెనొగద!

అతడు మునివరుఁ డనియు; భిక్షార్థియనియు
నమ్మియాతిథ్యమిచ్చెసీతమ్మ - కాని
బూదిపూసిన తుచ్ఛకాముకుడటంచు
తలఁపకున్నదియావెఱ్ఱితల్లి మదిని.

రక్తదఘ్నమైన రాక్షసకామము
పడగలెత్తి విషమువెడలఁ గ్రక్కె.
పుష్పసదృశమైన భూజాతడెందము
అంతలేని ధర్మమట్లు కుమిలె.

దిక్కులదరఁగ సీతమ్మ దీనయౌచు
"రండు! కాపాడు" డంచుఁ బ్రార్థనలుసేయ
ఎవ్వరచ్చట తల్లిరక్షించువారు?
విజన భీకరసాంద్రాటవీస్థలమున!

కదలలేక; పలుకఁ బెదవియైననులేక
ఎందుకిట్టి జన్మమెత్తితిమని
పూలకళ్ళనుండి బొటబొటమకరంద
బాష్పములను రాల్చెవనలతలును!

ఇంతలోనవెవచ్చె పక్షీంద్రుఁ డొకఁడు
కరుణః ధర్మము తనకు రెక్కలుగ నిలువ.
ఆయుదారుని పేరు "జటాయు" వండ్రు
అబల కన్నీటి కాతని యాత్మ కరఁగె.

దనుజ శక్తికంటె తనశక్తి తక్కువ
యనెడు భీతియైన నతడెఱుఁగడు!
కనులముందు పాపకార్యము జరుగుట
సైపజాలనట్టి సదయుఁ డతడు.

భాషరాదు; గొప్పబలమైన కనరాదు
దేనికతఁడు నిట్టి తెగువఁ జేసె!
పడఁతి పరువు నిలుపఁ బ్రాణముండెడిదాఁక
పోరవలయునంచు భువికి తెలుప!

ఆచార్య జి. లలిత

# అలరుఁబోఁడి ఇత్యాది సమాస విచారణ

"అలరుఁ బోఁడి, చిగురుఁ బోఁడి, ననబోఁడి, మెఱుఁగుఁబోఁడి" మొదలైన సమాసాలనుగూర్చి వ్యాకర్తలకు గాని, వ్యాఖ్యాతలకుగాని ఏకాభిప్రాయం కుదరలేదు. ఈ సమాసాలు ఉపమాన పూర్వపద కర్మధారయాలా లేక ఉపమాన గర్భిత బహువ్రీహి సమాసాలా అన్నది మొదటి ప్రశ్న.

ఈ సమాసాలలోని ఉత్తరపదం "పోఁడి"యా లేక "బోఁడి" యా అన్నది రెండవ ప్రశ్న.

చిన్నయ సూరి స్థాన్యాదేశాలకు సాదృశ్యం లేకుండ "మేను"నకు "బోఁడి"ని ఆదేశించి ఉంటాడా అన్నది మూడవ ప్రశ్న. ఈ మూడు ప్రశ్నలు పరిశీలనార్హాలు.

1. ఆంధ్రశబ్ద చింతామణి (11.వ.శ.) అథర్వణ కారికావళి (13.వ.శ.) లక్ష్యరహితాలు గనుక వాటిమతం మనకు తెలియదు. మూల ఘటిక కేతన [1 .వ.శ.] తన ఆంధ్ర భాషా భూషణంలో "పోడియనఁగ నెల్లెడలను నాఁడుం బేళ్ళకును జెల్లును." [ప. 167] అని పోఁడిని స్త్రీవాచక తద్ధిత ప్రత్యయంగ పేర్కొన్నాడు.

పూవుఁబోఁడి మొదలైన సమాసాలు బహువ్రీహు-ని తొలుత పేర్కొన్న వ్యాకర్త విన్నకోట పెద్దన (14 వ.శ). అతని కావ్యాలంకార చూడామణిలో.

గీ. పూవుఁబోఁడి తలిరుఁబోఁడి.... యన బహువ్రీహి పెక్కు విధుల విస్తరిల్లు (9–126) అని ఉదాహరించాడు.

అనంతామాత్యుడు [15. వ.శ] తన ఛందోదర్పణంలో సిద్ధసమాసాలనే గ్రహించాడు గనుక ఈ విషయంలో అతని మతం తెలియదు.

ముద్దరాజు రామన(16వ.శ.)కవిజనసంజీవనిలో "పోడిమి-పోడిమి" అన్న పదాలను రూపాంతరాలుగ ప్రదర్శించాడు.

క. అమరుంబోడిమి యనఁబో, డిమి యన నురువడి యును పఠించియనంగా (క.జ.సం 1–15).

బాలసరస్వతీయంలో (17 వ.శ.) ఈ సమాసాలను గురించి విభిన్న పాఠాలు కన్పిస్తున్నవి. బాలసరస్వతీయానికి ముద్రితమైన ప్రతులు మూడున్నాయి. వావిళ్ళ వారు 1930, 1971 లో ముద్రించిన రెండు ప్రతులు; 1932 లో ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రకటితమైన ప్రతి ఒకటి. వీనిలోని పాఠాలు :—

i అలరు విలుతుఁడు కలకంఠుఁడు మొదలైనవి బహువ్రీహులు– మెఱుగు బోడి, మచ్చెకంటి మొదలైనవి యుపమానములు ; వావిళ్ళ 1930. పుట. 43)

ii మేఘశ్యాముఁడు, పురుష వ్యాఘ్రుఁడు, మెఱుఁగుఁబోఁడి, పాణి పల్లవము– ఇవి యుపమాన సమాసములు (వావిళ్ళ 1971. పుట. 245_246.) ఈ పాఠంలో మెఱుఁగుఁబోడి కర్మధారయ సమాసాల్లో ఉదాహృతం.

iii మెఱుఁగుఁబోఁడి– మచ్చెకంటి – మొదలయినవి యుపమానములు (బాల స. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. 20 వ సంపుటం.)

ఆంధ్ర శబ్దచింతామణి, బాల సరస్వతీయాలనుచేర్చి, అన్వయించి రచించిన "ఆంధ్ర వ్యాకరణ దండాన్వయ"మనే ఒక అముద్రిత గ్రంథం తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది [R. 243] కర్త సుసర్ల సుబ్రహ్మణ్యము. ఇందులో "మెఱుఁగుఁబోఁడి– మచ్చెకంటి– చంద్రముఖి– అని ఉపమాన పూర్వపద బహువ్రీహి." అన్న బాలసరస్వతీయ పాఠమే ఉన్నది కాబట్టి 1971 వ.సం. ముద్రణ పాఠం ప్రక్షిప్తం కావచ్చు. అట్లయితే "మచ్చెకంటి" అనుదాని సాహచర్యం వలన

"మెఱుంగుఁబోఁడి అనేది కూడ ఉపమాన గర్భ బహువ్రీహి అనడమే బాలసరస్వతి అభిమతమని, అందువలననే బహువ్రీహి సమాసాల ప్రస్తావనలో దానిని పేర్కొన్నట్లు విశదమవుతుంది. ఆంధ్రవ్యాకరణ హింసతా సర్వస్వకర్తలైన వజ్ఝల చిన సీతారామశాస్త్రి కూడ ఇలానే అభిప్రాయపడ్డారు. (ఆం వ్యా. సం స పుట 1258 )

గణపవరపు వేంకటకవి (17.వ.శ.) తన ఆంధ్ర కౌముదిలో కేతన విధానాన్నే అనుసరించినా, ఈ సమాసాలను వేంకటకవి బహువ్రీహులుగ పరిగణించినట్లు తెలుస్తుంది.

సీ. పూవుఁ బోఁడి మెఱుఁగుఁ బోడి నా సుకుమార తను మనోహరతను దనరి, రెండు నుపుగ మతుబర్థమున నిపాతములగు... [ఆం. కౌ. పుట 14-15].

పై లక్షణాన్ని బట్టి రమ్యార్థంలో "కలది" అనే మతుబర్థంలో ఈ సమాసాలు ప్రయోగింపబడుతున్నది వేంకటకవి మతం. పూవువంటి సుకుమారతను. మనోహరతను కలది అన్నపుడా సమాసంఅన్యపదార్థప్రధానమైన బహువ్రీహి అవుతుందేకాని ఉత్తర పదార్థ ప్రధానమైన కర్మధారయుంకాదు.

కవి శిరోభూషణకర్త అయిన అహోబలుడు(18.వ.శ.) తనె పూర్వ వ్యాకర్తల మతాలను పరిశీలించి, వాటిని సమన్వయపరచి, "మెఱుంగుఁబోఁడి, తమ్మికంటి ఇత్యాద్యా ఉపమాన గర్భ బహువ్రీహ రుః" [పుట 629. 1973 హైదరాబాదు] అని వీటిని ఉపమాన గర్భబహువ్రీహి సమాసాలుగ పేర్కొన్నాడు. ఉపమాన వాచకాలు పూర్వపదాలుగాగల కర్మధారయాలు సంస్కృతంలో ఉండవు. బహువ్రీహులుంటాయి. "కుసుమాంగి, సుమగాత్రి" వంటి సంస్కృత సమాస సామ్యం వలన తెలుగులో ఇటువంటి సమాసాలేర్పడి ఉంటాయని అహోబలుని భావన కావచ్చు.

మంచెళ్ళ వాసుదేవకవి పైకృత చంద్రికలో [18. వ.శ.] ఈ సమాసం బహువ్రీహి అని స్పష్టపరిచాడు :

సూ॥ మేర్లుక్.

వృ॥ బహువ్రీహేరుత్యేక్వచిన్మేర్ణకస్యలుక్ స్యాత్.

పువ్వుంబోఁడి

(వై. చం. సమాస. సూ 37)

అర్వాచీనమైన ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణః (పుదూరి సీతారామశాస్త్రి. 1834) తెలుఁగు వ్యాకరణము [రావిపాటి గురుమూర్తి శాస్త్రి 1836) లఘు వ్యాకరణము (వేదం వేంకట రమణశాస్త్రి 1856) "పోఁడి" ఉత్తరపదంగాగల సమాసాలను ప్రస్తావించలేదు.

సూరి తన నాలుగు వ్యాకరణాలలోను అలరుంబోడి, పూఁబోడి మొదలైన సమాసాలను బహువ్రీహులుగనే గుర్తించాడు.

"పోఁడి" శబ్దానికి విశేష్యత్వంలో "ఒప్పు" అని, విశేషణత్వంలో "ఒప్పిదము"అని అర్థాలు నిఘంటుసిద్ధాలు. అందుచేత ప్రౌఢవ్యాకర్త (1885) ఈ సమాసాలను ఉపమాన పూర్వపద కర్మధారయాలుగచేసి నుమాగమాన్ని విధించాడు (ప్రౌ. వ్యా సమాస. సూ.19)

సులభ వ్యాకర్త (వావిలికొలను సుబ్బారావు. 1905) ప్రౌఢ వ్యాకర్తృమార్గాన్నే అవలంబించాడు. (సు.వ్యా. సమాస. సూ. 24) ఆంధ్రభాషాను శాసనకర్త (మల్లాది సూర్యనారాయణశాస్త్రి 1926) బాల,ప్రౌఢ వ్యాకర్తల మార్గాలను రెంటిని సంగ్రహించాడు. [ఆం. భా. శా. సమాస. సూ. 70]నారాయణీయాంధ్ర వ్యాకరణం (చర్లనారాయణ శాస్త్రి, గణపతి శాస్త్రి 1937) ప్రౌఢ వ్యాకరణ కృత విషయాలనే సూత్రీకరించింది. (సమాస. 248, 249) వ్యావహారిక భాషావ్యాకరణం కూడ (వజ్ఝ మూడి గోపాలకృష్ణయ్య. 1957) వీటిని ఉపమాన పూర్వపద కర్మధారయాలుగనే నిర్దేశించింది.

వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి "అలరువంటిపోఁడి యనఁగా నొప్పిదము గలది యను చొప్పున నుపమానగర్భ బహువ్రీహి నంగీకరింపవచ్చును. లేదా అలరువలె నొప్పిద

మైనది = యనఁ — మనోజ్ఞురాలగు స్త్రీ అను రీతి నర్థము చేసికొని యీ క్రిందిరీతి త్రిలింగ లక్షణశేషమార్గము నవలంబించుటయేని యుక్తము" [అం. వ్యా. సం. స. 1151. పుట 1240) అని ఉభయమతాలను సమ్మతించారు. వారి బాల వ్యాకరణోద్ద్యోతంలోను [1959] ఉపమాన పూర్వపద కర్మధారయాలుగ సూత్రించి, వివరణలో ఉపమాన పూర్వపద బహువ్రీహిగను గ్రహింపవచ్చునన్నారు. (సమాస సూ. 84)

ముక్తలక్షణ కౌముది (వంతరాం రామకృష్ణారావు 1974) ప్రాచీన వ్యాకర్తల మతాన్నే గ్రహించింది (సమాస. సూ. 32)

కనుక ఈ సమాసాలను గూర్చిన మొదటి ప్రశ్నకు లభించిన సమాధానం :-

సూరికి పూర్వవ్యాకర్తలు, సూరి, అలరుఁబోఁడి మొదలైన వానిని ఉపమాన గర్భబహువ్రీహి సమాసాలుగ పరిగణించారు. అర్వాచీన వ్యాకరణాలలో ఆంధ్ర భాషానుశాసనం, ముక్తలక్షణ కౌముది ఈ మతాన్నే అంగీకరించాయి.

ప్రౌఢవ్యాకర్త వీటిని ఉపమాన పూర్వపదకర్మధారయాలుగ నిర్దేశించాడు. సులభ వ్యాకర్త, నారాయణీయాంధ్ర వ్యాకర్తల అభిప్రాయంకూడ ఇదే.

బాలవ్యాకణోద్ద్యోతకర్త ఉభయమతాలను సమర్థించాడు.

అయితే వీటిని బహువ్రీహి సమాసాలనడమే బహు లాక్షణికాంగీకృతంగ, సర్వసంగతోస్తుంది.

2. గణపవరపు వేంకట కవి లక్షణాన్ని పరిశీలిస్తే పూవుఁబోఁడి మొదలైన సమాసాలలోని ఉత్తర పదం "పోఁడి" అని, దాని రూపాంతరం "పోఁడి" అని వ్యక్తమవుతుంది. "పోఁడి పోఁడిమి" అన్న రూపాలే సమాసాలలోని ఉత్తరపదమన్న వేంకట కవి అభిప్రాయాన్ని నిరూపించడానికి అతని ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాస ప్రయోగం మరొక ఆధారం :-

చిగురాకుఁ బోఁడికి యంబురుహ పాఁడికి (ప. 263. అంత్యాను ప్రాసవలన పోఁడి అన్న రూపం నిర్ధారకం.)

వేంకటకవి రచించిన ద్విరూపకోశం కూడ ఈ విషయాన్ని బలపరుస్తున్నది.

సీ॥... పువ్వారు బోఁడి
పూబోఁడి పువుబోఁడి పువుబోఁడి యన పూ
పుంబోఁడి యనఁగ జెల్వగుఁడలిరుప్పి.

(ప. 113. R. 134 శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం)

అహోబలునికి ఈ సమాసగతోత్తర పదస్వరూపాన్ని గూర్చి ఒక నిశ్చితాభిప్రాయమున్నది. "....పువ్వుఁబోఁడిఁత్యాదౌ డకార ఏవ న ణకార ఇతిజ్ఞేయమ్."(క. శ. భూ. పుట 523). "పువ్వుఁబోఁడి" వంటి ణకార ఘటిత రూపాలను అహోబలుడు నిరసించాడు. "పోఁడిమి, ఉరువడి, నాడెము ఇత్యత్ర పోఁణమి ఇత్యాది రూపాణి ణకారేణాపి సిద్ధాని" (పుట 523) అని పోఁడిమి > పోఁణిమి రూపాలను సమ్మతించాడు. "పోఁడిమి" అనే ప్రత్యేక ప్రయోగసిద్ధమైన పదానికే పోఁణిమి అనే పదం రూపాంతరం అవుతుంది గాని ఉపమాన గర్భ బహువ్రీహి సమాసాలలో "పోఁడి"కి "పోఁణి" రూపాంతరం కానేరదని అహోబలుని అభిప్రాయం కావచ్చు.

మంచెళ్ళ వాసుదేవకవి బహువ్రీహి సమాస ఉత్తర పదం చివరనుండే మి వర్ణకము కొన్నిచోట్ల లోపిస్తుందన్న వృత్తివలన ఈ సమాసగత ఉత్తరపదం ★"పోఁడిమి" అని విశదపరిచాడు.

ఇలా సూరికి పూర్వవ్యాకర్తలు "అలరుఁబోఁడి" మొదలైన సమాసాలలోని ఉత్తరపదం "పోఁడి" లేక పోఁడిమి" గాను నిర్దేశించారు. అహోబలుడు తప్పతక్కిన వ్యాకర్తలు "పోఁణి" అన్న రూపాంతరాన్ని సమ్మతించారు. అయితే ఈ శబ్దంలోని పరుషం సరళమయ్యే ప్రక్రియను గూర్చి వీళ్ళెవ్వరూ స్పష్టంగ తెలుపలేదు.

★ "పోఁడి" అన్నపదానికి చక్కఁదనము, అందము అన్న అర్థాలను నిఘంటువులు పేర్కొన్నాయి. ఇది దేశ్య విశేష్యం. కనుక పోఁడిమి"ని గ్రహించి, మి వర్ణక లోపం చెప్పుకోవలసిన అవశ్యకత లేదు.



1

పై వ్యాకర్తల సిద్ధాంతానికి - అంటే పోఁడి పోఁడిమి, పోఁడి అనే మూడు రూపాలు ఉత్తరపదమనడానికి - ప్రాచీన కవి ప్రయోగాలు ఉపబలకంగి ఉన్నాయి:—

చిగురుటాకుంబోఁడి. (శృంగార నైషధం. 3:165)

అలరుంబోఁడుంలోపల, నలరుంబోఁడుములు (పారిజాతాపహరణం. 1:64. కవి యమకంలో "పోఁడిమి"ని గ్రహించాడు.)

పూవుఁబోండ్లు. (ప్రభావతీ ప్రద్యుమ్నము. 4:54)

సీ. మఱిపియైనను నల మానవపతి। యన్న వలుకుఁదప్ప కలరుఁబోడిమితోద। రాత్తయై.
(హరిశ్చంద్రనలోపాఖ్యానము. 1:29)

పై ప్రయోగం హరిశ్చంద్ర పక్షంగ "అలరున్ + పోఁడిమితో - దరాత్తయై" అని అన్వయం. నలపక్షంగ "అలరుఁబోఁడి- మితోదరాత్తయై" అని అన్వయం. కనుక ఈ సమాసంలోని ఉత్తరపదం "పోఁడి" అనడానికిది నిర్ధారక ప్రయోగం.

క. పూఁబోఁడి-గాఁబయ్యెద-లేఁబొన్న-ఇది। గోఁబుకుపా హ్వయము. (కళాపూర్ణోదయము. 1:36)

పై ప్రయోగంలోని అర్థానుస్వార ప్రాసం "పోఁడి" అన్నపదాన్నే నిరూపిస్తుంది.

సీ. చిగురాకుఁబోఁడి యీ చిగురాకుఁబోఁడిమి....
(కళాపూ. 3:16).

పూఁబోడి....(రాజశేఖర విలాసము. 1:6. డి ప్రాసం. నిర్ధారక ప్రయోగం).

ఇక సూరి "పోఁడి"ని ఆదేశించాడా "బోఁడి" ఆదేశించాడా అన్నది ప్రశ్న. సూరి నాలుగు వ్యాకరణాలలోని సూత్రాలు:-

i ఉపమానం మేను నా స్త్రియామ్ (ఉపమానాన్మేనోర్బోఁడిః స్త్రియాం-పూఁబోఁడి. (సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణము. సమాస పుట. 15.)

ii బహువ్రీహినుపమానంబు మీఁద మేనునకు స్త్రీత్వంబున బోఁడియగు
(ఆంధ్ర శబ్దానుశాసనము. పుట. 33)

iii బహువ్రీహిని స్త్ర్యర్థంబునందుపమానంబు మీఁద మేనునకు బోఁడియగు.
(శబ్దలక్షణ సంగ్రహము 5:126)

iv బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో నుపమానము మీఁది మేనునకు బోఁడియగు.
(బాలవ్యాకరణము సమా. సూ. 26)

పై వ్యాకరణాలలో ఆంధ్రశబ్దానుశాసనం, శబ్దలక్షణ సంగ్రహం, బాలవ్యాకరణాల ఆధారంగ ఈ ప్రత్యయం పోఁడి' యా లేక 'బోఁడి' యా అని నిర్ణయించలేము. సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణ సూత్రంలో "మేనోర్బోఁడి" అని ఉండటంచేతసూరిఆదేశించింది"బోఁడి"అనిసువ్యక్తం. సూరి ప్రాచీనులు స్వీకరించిన "పోఁడి-పోఁడిమి" శబ్దాలను పరిహరించాడు. తీయబోఁడి - ననబోఁడి - విరిబోఁడి సమాసము లందు ద్రుతములేదు. కాని సరళమున్నది. కావున' ఈసమాసములలో సర్వత్రవినఁబడు బకారము సిద్ధించుటకును దానిముందర్ధబిందువు కలుగకుండుటకును, ఉదంతస్థలము లందుఁ బూర్ణబిందువులు వచ్చుటకును,సమాసమునకు 'కోమలమగు శరీరముగలది' అను నర్థము కుదురు పడుటకును, 'మేను' నకు 'బోఁడి' నాదేశించుటయే యనుకూల మార్గముగ సూరి తలంచినట్లు" రమణీయము స్పష్టపరచింది. [రమ. 1970 పుట. 150].

సూరి "బోఁడి" అన్న సబిందుక బకారాది పదాన్నే ఆదేశించాడనడానికిమరొక ప్రమాణం సంస్కృతసూత్రాంధ్ర వ్యాకరణంలోనే ఉన్నది. సమానపదంబునందు సంయోగంబు పరంబగునపుడెల్లచో ఖండబిందువునకుఁబూర్ణంబగు అనే సందర్భంలో సర్వత్ర సిద్ధస్య సంయోగే నిత్యమ్-సార్వత్రికస్య సిద్ధస్య ఖండస్య సంయోగే పరే నిత్యం పూర్ణబిందుస్స్యాత్-తాఁడి-తాఁడ్లు; పనఁటి-పనంట్లు....ఏఁడు తోఁడి, తేఁటి, బోఁటి, బోఁడి' వాఁడి, వేఁడి, పోఁడి కాఁడి, దోఁటి, గోఁటి, దాఁటు. [సం. సూ. ఆం.వ్యా పుట. 20].

ఈ గణంలో సూరి బోఁటి, బోఁడి, పోఁడి అన్న మూడు రూపాలను ప్రత్యేకంగా ఉదహరించాడు. మేను అనే అర్థంలో సార్ధబిందుక మైన "బోఁడి" పదాన్ని సూరి ఏకోశంలోనైనా చూచాడేమో! ఏమైనా పై గణంలో ఉదహరింప బడినవి సూరి "బోఁడి" అన్న పదాన్నే ఆదేశించాడనటాన్ని నిస్కృష్టంగా నిరూపిస్తుంది. స్త్రీ వాచ్యార్థంలోగాని, మేను అనే అర్థంలోగాని "బోఁడి" అన్నపదం

తెలుగు మాండలికాలలోగాని, ఇతర ద్రావిడ భాషలలోగాని ఉన్నదేమో పరిశీలనార్హం.

సార్ధబిందుకమయిన 'బోండి' శబ్దం అప్రసిద్ధమని కాబోలు ప్రౌఢవ్యాకర్త ప్రాచీనవ్యాకర్తలననుసరించి 'పోండి' శబ్దాన్నే గ్రహించాడు.

కనుక సూరి ఒక్కడు తప్ప వ్యాకర్తలందరు ఈసమాసగతోత్తర పదాన్ని 'పోండి'గ నిర్దేశించారు. సూరి మాత్రం 'మేను' స్థానంలో 'బోండి'ని విధించాడు. నేటివరకు వ్యాఖ్యాతలు భావించినట్లు "బోండి" అర్థరహితమైన ప్రత్యయం కాదుకాని అర్థవంతమైనపదమనిసూరి సంస్కృతసూత్రాంధ్ర వ్యాకరణం * వల్ల తెల్లమవుతోంది. ప్రాచీన వ్యాకర్తలు "పోండి", 'బోండి'గ మారడానికి ప్రక్రియను తెలుపలేదు. ప్రౌఢవ్యాకరణాది అర్వాచీన వ్యాకరణాలు నుగాగమాన్ని విధించి సరళాదేశాన్ని సాధించినాయి.

3. ప్రాచీన వ్యాకరణాలలో కొఱపడిన ప్రక్రియను పూరిస్తూ సూరి "మేను" నకు "బోండి" అనే పదాన్ని ఆదేశించాడు. ఈ స్థాన్యాదేశాలకు శబ్దసాదృశ్యం లేదు. "సాదృశ్యము కుదురు పడుట యభిలషణీయమేగాని కుదుర్పక తప్పదను నిర్బంధము చారిత్రక వ్యాకరణములకుఁగాని ప్రక్రియా వ్యాకరణములకుండదు." అని దువ్వూరి వేంకట రమణశాస్త్రి సమర్థనం. (రమణీయము 1970 పుట 350)

ఇలా అర్థరహిత ప్రత్యయాన్ని ఆదేశించడం వ్యాకరణ సంప్రదాయానుకూలమే. అర్థమున్న పదము నాదేశముగా విధించిన యెడల వానికాయర్థమే యుండును. ఇచ్చట "స్థాని"యొక్క యర్థమునే యాదేశముగా వచ్చిన శబ్దముకూడా బోధింప వలయును" అని శ్రీ భాస్కరరావు గారి వివరణ. [బాలప్రౌఢవ్యాకరణ సర్వస్వము ద్వి సం. 970 పుట 236]

"మేను" స్థానంలో "బోండి" శబ్దాన్ని నిలిపే విధానానికి సూరికి మార్గదర్శకుడు అతని పూర్వుడైన మడ లక్ష్మీ నరసింహకవి [18 వ శ] అతని త్రిలింగ శబ్దానుశాసనంలో [అముద్రితం డి. 1423 మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం]

"అథ దేశ్యనామాని" అనే ప్రకరణంలో సప్రశాస్త్రార్థాలైన సాంస్కృతి కాచ్ఛిక సమాసాలను పెక్కింటిని ఉదహరించాడు:

"తీగెబోండి॥ లతాంగి॥ పూఁబోండి॥ కుసుమగాత్రి॥ తలిరుఁబోండి। పల్లవగాత్రి॥ మెఱుఁగుఁబోండి॥ శంపాంగి॥ చిగురాకుఁబోండి॥ బాలకిసలయగాత్రి॥"

ఆచ్ఛిక సమాసాలకు ఇచ్చిన సిద్ధసమాసాలు వ్యాకర్తృకల్పితాలు. ఆచ్ఛిక సమాసాలలోని "పోండి, బోండి" స్థానంలో సిద్ధ సమాసాలలో "అంగి, గాత్రి" శబ్దాలను నిలుపటంచేత లక్ష్మీనరసింహ కవి "మేను" అనే అర్థంలో "పోండి బోండి" శబ్దాలను ఉద్దేశించినట్లు వ్యక్తమవుతోంది. కాబట్టి 'మేను' స్థానంలో "పోండి"ని ఆదేశించిన పద్ధతి పూర్వలాక్షణిక మత విరుద్ధంకాదని దీనినిబట్టి తెలుస్తున్నది. ఈ పద్ధతి పూర్వలాక్షణిక మతవిరుద్ధమని ఘంటాపద వ్యాఖ్యాతలు శ్రీ వంతరాం రామకృష్ణారావుగారి అభిప్రాయం. (ప్రౌఢ వ్యాకరణ ఘంటాపథ వ్యాఖ్యానుబంధం పుట 283) లక్ష్మీనరసింహకవి 'పూఁబోండి, మొదలైన ఏ సమాసాలన్న విషయాన్ని నిరూపించలేదు కాని, మేను స్థానంలో "పోండి బోండి"ని ఆదేశించాడన్నది మాత్రం సువిదితం.

స్థాన్యాదేశాలకు సాదృశ్యం ఉండాలన్న నిర్బంధం చారిత్రక వ్యాకరణాలకే కాని ప్రక్రియా వ్యాకరణాలకులేదు. లక్ష్మీనరసింహకవి, సూరి 'మేను స్థానంలో "పోండి బోండి" శబ్దాన్ని ఆదేశించారనడంలో విప్రతిపత్తిలేదు.

---

* సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణ వ్రాతప్రతి కాకినాడలోని ఎ. ఎస్. పి. మ్యూసియమ్ ఎండ్ రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్ లో ఉన్నది. వ్రాతప్రతిలోకూడ "బోండి" పదమే ప్రయుక్తం.



# గ్రంథ విమర్శలు

## సరోజినీ నాయుడు

[రచయిత్రి : పద్మినీసేన్‌గుప్త. మూల్యం : 2-50, ప్రచురణ : సాహిత్య అకాడెమీ, పుటలు-136]

"భారతీయ సాహిత్య నిర్మాతలు" అన్న పేరుతో సాహిత్య అకాడమీ ప్రచురించిన పుస్తకాలలో ఇది ఒకటి. శ్రీమతి సరోజినీదేవి నాయుడు జీవితాన్ని గురించిన గ్రంథమిది.

1879 ఫిబ్రవరిలో జన్మించిన సరోజినీదేవి, ఎనిమిది మంది సంతానంలో పెద్దది. 1877 లోనే ఇంగ్లాండ్‌పోయి, 1878లో హైదరాబాద్‌లో స్థిరపడిన అఘోరనాధుని సంతానమీమె. తెలుగు, బెంగాలీ, హిందూస్థానీలు ఇంట్లో వాడుక భాషలయ్యాయి.

13-15 సంవత్సరాల వయస్సులోనే కవితలల్లిన సరోజినిదేవి, 16 సంవత్సరాలవయస్సులో ఇంగ్లాండ్‌పోయి 19 సంవత్సరాల వయస్సులో తిరిగివచ్చి, తనకంటె 10 సంవత్సరాలు పెద్దఅయినా రెండవ వివాహానికికూడా అంగీకరించి, తను ప్రేమించిన డాక్టరు నాయుడుని వివాహమాడింది. మద్రాసులో 1898లో జరిగిన ఈ వర్ణాంతర రాష్ట్రాంతర వివాహం, వీరేశలింగం పంతులుగారి పౌరోహిత్యంలో జరిగింది.

తరువాత తరువాత గోపాలకృష్ణగోఖలే తోటి పరిచయం, సాన్నిహిత్యం, 1919లో మహాత్ముని ఆహ్వానం మీద సబర్మతీ ఆశ్రమం సందర్శించి, సత్యాగ్రహి ప్రతిజ్ఞ పాత్రంమీద సంతకం చేయటంతో క్రియాశీల రాజకీయాలు ప్రారంభమయ్యాయి. అప్పటికి ఆమెవయస్సు 40 సంవత్సరాలు, నలుగురు పిల్లల తల్లి.

భారతదేశం మీద దుష్ప్రచారానికి రాయబడ్డ "మదర్ ఇండియా"కు వ్యతిరేకంగా, 1929లో గాంధీజీ పనుపున, అమెరికాకు వరాధీన భారత రాయబారిగా వెళ్ళింది. అప్పటికే ఆమె కాంగ్రెసు అధ్యక్షురాలుగా కూడా పనిచేసిఉంది.

అదే సమయంలో దీనబంధు ఆండ్రూస్‌కూడా అమెరికా పర్యటన జరిపాడు. స్నేహితులంటే చెవికోసుకునే ఈమె,వారిలో ఏ ఒక్కరు మరణించినా శోకభారాన్ని తట్టుకోలేక పోయేది. గోపాలకృష్ణగోఖలే, మోతీలాల్‌నెహ్రూ మహదేవ దేశాయ్‌ల మరణాలు ఆమెమీద తీవ్ర అఘాతాన్ని కలుగజేశాయి. మహాత్ముని మరణం చెప్పనే అక్కరలేదు.

అయితే ఆమె రాజకీయ జీవితాన్ని గురించిన వివరణ ఈ గ్రంథంలో తృప్తిగాలేదు. కేవలం అది 12 పుటలలోనే ముగించబడింది. ఈ దేశానికి ఆమె కాంగ్రెసు అధ్యక్షురాలిగా, స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖపాత్ర వహించిన విదుషీమణిగా తెలిసినంతగా, కవయిత్రిగా తెలియదు, తెలియవలసిన అవసరంకూడాలేదు. అలాంటి చరిత్రను 12 పుటలలోనే ముగించటం ఈగ్రంథంలోని వెలితిఅనిపిస్తుంది.

స్వరాజ్యం వచ్చిన తరువాత ఉత్తరప్రదేశ్ గవర్నరు పదవిని నిర్వహించి, 1949 ఫిబ్రవరి 18న మరణించింది. నాటికి ఆమె వయస్సు 70 సంవత్సరాలు నిండి 5 రోజులయింది.

ఆ మహితాత్మ జీవితగాథ ఇది. ఆమె ఆంగ్ల కవితా వ్యాసంగాన్ని గురించి ప్రత్యేక ప్రకరణ ముండటం ముదావహం.

శ్రీ కాకుమాను తారానాధ్

## మెదడు వాపు

(హయిడ్రో సెఫాలస్)

హోమియో పతితో నివారణ. రచన-డాక్టరు డి. ఎల్. హెచ్. ఎమ్. బి. యస్. వెల. రు. 1-50. ప్రతులకు. జయ హోమియో హోమ్, చౌత్రా, గుంటూరు-522003)

హోమియోపతి వైద్య విధానం చాలా ప్రయోజనకరమయినదే. అల్లోపతి మందులు పనిచేయని వ్యాధులలో

చాలా వ్యాధులు హోమియో వైద్యం వల్ల నయమవుతున్నా యని, బ్రిటన్, అమెరికా, ఫ్రాన్స్, జర్మన్ వంటి దేశాలలోని శాస్త్రజ్ఞులు అంగీకరించారు. ఈ వైద్యవిధానానికి డాక్టరు శామ్యూల్ హానిమన్ వ్రాసిన ఆర్గనాన్ ప్రాతిపదిక. ఈ గ్రంథమంతా సూత్రాత్మకం. వాటిని అర్థం చేసుకొన డానికి శరీర శాస్త్రం, శరీర నిర్మాణ శాస్త్రం, అవయవాలు పనిచేసే తీరును విశదంచేసే శాస్త్రం, మందులను తయారు చేసే శాస్త్రం, వస్తుగుణ దీపిక, రసాయన శాస్త్రం వంటి వాటితోపాటు కొంత ప్రపంచజ్ఞానం కూడా వుండడమవసరం. ఈ వైద్య శాస్త్రం ఎంతసులభంగా కనిపిస్తుందో అంత క్లిష్ట మైనదికూడా. ఈ వైద్యశాస్త్రంలో "మెదడు వాపు వ్యాధి"కి చాలా ప్రయోజన కరమైన మందులున్నాయి. వ్యాధి రాకుండా చేయడానికీ, వ్యాధి వచ్చిన తర్వాత దాన్ని సత్వరం నిర్మూలించడానికి కూడా ఈ వైద్య శాస్త్రంలో శక్తివంతమైన మందులున్నాయి. ప్రతి వ్యాధికి ఉన్నట్లే యీ వ్యాధికి కూడా ప్రారంభదశ, దీర్ఘకాలిక దశలతోపాటు సూచనల దశకూడా ఉన్నది. డాక్టర్ పి.యల్., ఆయా అంశాలను యీ చిన్న పుస్తకంలో [16 పుటలు] వివరించి, ఆయా దశలలో చికిత్సకు ఉప యోగపడే మందులను కూడా సూచించారు. అలా సూచించ డానికి తనకు ఉపయోగపడిన గ్రంథాల పట్టికను కూడా వివ రించారు. ఈ వ్యాధిని గురించి హోమియో శాస్త్రజ్ఞులు ఇంకా పరిశోధనలు జరపడమవసరం. అన్యదేశాలలో ఒక వ్యాధికి చికిత్సకు ఉపయోగపడిన ఒకమందు యీ దేశంలో, యీ వాతావరణంలో, ఇక్కడి అలవాట్లవల్ల అదే వ్యాధి వచ్చిన రోగికి చికిత్స చేయడానికి ఉపయోగపడకపోవచ్చు గదా! అదీగాక ఒక వ్యాధికి చికిత్సకు ఒక మందు ఉప యోగపడుతుందని సూచించేప్పుడు ఎంత పొటెన్సీలో ఎన్ని మోతాదులు వాడాలో కూడా సూచించడం చాలా అవసరమని చాలామంది హోమియో నిపుణుల అభిప్రాయం. అలాంటి సూచనలు ఈ పుస్తకంలో లేవు. లక్షణాలన్నింటినీ తొల గించినా వ్యాధిని తొలగించినట్లు అర్థం కాకపోవచ్చు. కాబట్టి కేవలం లక్షణాలు ఆధారంగా వైద్యంచేయడం సమంజసం అనగలమా? హానిమన్ ఆర్గనాన్ వ్రాసినతర్వాత హోమియో వైద్య శాస్త్రం వివిధ దేశాలలోనూ చాలా అభివృద్ధి చెంది నది. ఆ అభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని చూస్తే "రిమువల్ ఆఫ్ టొటాలిటీ ఆఫ్ సింప్టమ్స్ క్విక్‌లీ అండ్ పర్మనెంట్‌లీ" అనే సూత్రం, హోమియో పుస్తకాలు తెలుగులో వ్రాసే వారిలో ఎంతమందికి అర్థమయినదో!

శ్రీ వి. ఎస్. అవధాని.

# బాల వ్యాకరణోద్ద్యోతము

[కళాప్రపూర్ణ- శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి విరచితము, డెమ్మిసైజు 32 + 484పుటలు. వెల 12 రూ.లు. ప్రకాశకులు - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు.]

రచయిత ఆంధ్ర వైయాకరణ సార్వభౌములు. వైయాకరణ పారిజాతము, ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము మున్నగు ఉద్గ్రంథములను రచించి విఖ్యాతిని గడించిన విద్వాంసులు విజయనగర మహారాజా సంస్కృత కళాశాలలో ప్రధానాంధ్రాధ్యాపకులుగా ఉండి దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారివంటి మహావిద్వాంసులను తయారు చేసి కీర్తిగడించినవారు. తర్వాత మద్రాసు విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థలోను, ఆ పైని ఆంధ్ర విశ్వకళా పరిషత్తులోనుపనిచేసి సమగ్రంగావ్యాకరణ పరిశోధనలుచేసి, తత్ఫలితములను గ్రంథరూపంగావిద్వల్లోకానికి అందించారు. వీరు ప్రాచీన సంప్రదాయానికిచెందినవారైనా నవీనపద్ధతి ననుసరించి భాషా శాస్త్ర దృష్ట్యా వ్యాకరణ పరిశోధన చేసినవారు శ్రీ శాస్త్రిగారు.

తెలుగు వ్యాకరణం అభ్యసించేవారికి ఈ శతాబ్ది ప్రారంభం నుంచీ చిన్నయసూరి బాలవ్యాకరణం, బహుజన పల్లి సీతారామాచార్యులుగారి ప్రౌఢ వ్యాకరణం శరణ్యా లుగా ఉన్నవి. ఆ వ్యాకరణాలు లోపభూయిష్ఠంగా ఉన్న

వని గ్రహించి, సప్రమాణంగా వాటిని వివరిస్తూ వ్యాకరణ జిజ్ఞాసువులకుపయోగకరంగా ఈ గ్రంథాన్ని ఆయన రచించారు. పేరుకు ఇది బాలవ్యాకరణొద్ద్యోతమయినా-సమగ్ర సంగ్రహ వ్యాకరణమనియే చెప్ప వలసియున్నది.

రచయిత విజ్ఞప్తిలో "లక్షణ విరోధములును, అపసిద్ధాంతములును విఖ్యాతుల విమ్మనములందు నాటుకొనుట మిక్కిలి ప్రమాదకరము కానసందలి అపసిద్ధాంతములను లక్షణ విరోధములను తొలగించి, బాలవ్యాకరణ, ప్రౌఢ వ్యాకరణములందుఁ జేర్పఁగాని బడని లక్షణ విశేషములను జేర్చి మిగిలిన బాల వ్యాకరణ విషయములను నిల్పి రచించుట విద్యార్థుల కత్యంతోపకారక మగునని తలచి యీ బాల వ్యాకరణొద్ద్యోతమును రచించితిని" అని తెలిపియున్నారు.

తెలుగు భాషలో చాలా భాగం సంస్కృతపదభూయిష్ట మయి ఉన్నది. సంస్కృత భాషలో ప్రవేశం లేకపోతే తెలుగు వాఙ్మయాన్ని అర్థం చేసుకోవడమే అసాధ్యం. అలాగే తెలుగు వ్యాకరణాలలో కూడా సంస్కృత వ్యాకరణ పరభాషలే చాలా ఉపయోగించబడి ఉన్నవి. అందువల్ల ఆంధ్ర వ్యాకరణ జిజ్ఞాసువులకు సంస్కృత వ్యాకరణంలో కూడా ప్రవేశం ఉండాలి. సంధులు, సమాసాలు, కారకాలూ పూర్తిగా గ్రహించడానికి నాటి సంస్కృత లక్షణాలు కూడా తెలిసి ఉండాలి. ఈ విషయాన్ని బాగా గుర్తించిన శ్రీ శాస్త్రిగారు, వేరే సంస్కృత వ్యాకరణాలు చదవనక్కర లేకుండా, ఆ లక్షణాలను ఆ యా సందర్భాలలో సోదాహరణంగా ఇందులో చేర్చారు. తెలుగులోని బాలవ్యాకరణ, ప్రౌఢ వ్యాకరణాలనుగాని, సంస్కృత వ్యాకరణాలనుగాని చదవ నక్కర్లేకుండా, ఆంధ్ర వ్యాకరణ జిజ్ఞాసువులు దాన్ని క్షుణ్ణంగా చదివినట్లయితే వ్యాకరణ విషయాలనన్నింటినీ తెలుసుకోగలుగుతారు. ఇందులో విషయాలన్నీ స్పష్టంగా బోధపడే సరళమైన భాషలో వివరింపబడి ఉన్నవి.

ఇందలి విషయ విభాగం బాలవ్యాకరణ పద్ధతిననుసరించే ఉన్నది. సంజ్ఞా పరిచ్ఛేదం మొదలుకొని కృదంత పరిచ్ఛేదం వరకూ ఉన్న పరిచ్ఛేదాలలో తెలుగు లక్షణోదాహరణాలతో పాటు సంస్కృత లక్షణోదాహరణాలు కూడా ఈయబడి ఉన్నవి. ఇందలి విషయాల సూచికయే పద్నాలుగు పుటలు ఉన్నది. ఇందులో ఎన్ని విషయాలు ఉన్నదీ దీని వల్లనే తెలుసు కోవచ్చును.

ఆంధ్ర వ్యాకరణ జిజ్ఞాసువులకు అత్యంతోపయుక్తమైన యీ గ్రంథాన్ని శ్రీ శాస్త్రిగారే 1959లో తొలిసారి ప్రకటించారు. ఆ ప్రతులు చెల్లి పోయి, తిరిగి ముద్రించవలసిన స్థితి ఏర్పడింది. తర్వాత శ్రీ శాస్త్రిగారి కుమారుని కోరికపయి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారు దీని పునర్ముద్రణభారాన్ని వహించి చక్కగా ముద్రింపించి దీనిని ప్రకటించారు. ఇది మెచ్చుకోదగిన విషయం.

ఈ ఉత్తమ వ్యాకరణ గ్రంథం డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారికి కృతి యీయబడినది.

- శ్రీ బులుసు వేంకట రమణయ్య.

# వ్యాస రచనల సూచి

(1875 నుండి 1972 వరకు) [తెలుగు పత్రికల నుండి• సంకలనకర్త : నే. శ్రీ కృష్ణమూర్తి. ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు-4, పుటలు : 1663 ; వెల : రూ. 100-00.]

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు ఆంధ్ర పరిశోధకుల కొనర్చిన మహోపకారములలో ఇదొకటి. తెలుగు దేశంలో 1875 నుండి సుమారు 300 పైగా అనేక పత్రికలు కొన్ని దిన పత్రికలు, కొన్ని వార పత్రికలు, కొన్ని మాస పత్రికలు వెలువడుతూ వస్తున్నాయి. దిన పత్రికలు విడిస్తే, వారపత్రికలు, మాస పత్రికలు అనేక విషయాల్లో విమర్శక వ్యాసాలు వేల సంఖ్యలో వెలువడ్డాయి. దిన పత్రికల ఆదివార సంచికల్లోను, ఉగాది సంచికల్లోను మ కొన్ని విశేష సంచికల్లోను కొన్ని అదనపు పుటల్లో అనుబంధంగా అనేక

వ్యాసాలు ప్రచురిస్తారు. వాటిలో సాహిత్యం, కళ, చరిత్ర మొదలైన పరిశోధక వ్యాసాలేగాకుండ కథానికలు కూడ అప్పుడప్పుడు చదువుకోవాలనిపించే రచనలుంటాయి. కనుక ఇట్లాంటి వాఙ్మయాన్ని గ్రంథాలయాల్లోనైనా భద్రం చేయుటం అవసరమనిపిస్తుంది. అది వారి విధిగానే భావించి కొన్ని గ్రంథాలయాలవారు అట్లాచేస్తున్నారు కూడా. కాని మన దేశంలో ఇట్లాంటి విషయాల్లో కొద్దిలోపాలుకూడ జరుగుతుంటాయి. కొత్తవి తత్వంలో ఆదరించబడాలంటే ముందు పాతవి అదృశ్యం కావాలనే సిద్ధాంతం, ప్రస్తుతం చదువరుల కంతగా ఉపయోగించవని పాతవాటిని నిర్లక్ష్యంగా ఒక మూల కుప్పగావడవేయుటం మొదలైనకారణాలవల్ల యాభై అరవై యేండ్ల నుండి పనిచేస్తున్న గ్రంథాలయాల్లో కూడ భారతిలాంటి మాసపత్రికలు అన్ని సంచికలు దొరకవు. చదువర్ల హస్తలాఘవంతో కూడ కొన్ని అదృశ్యమవుతవి. ఇట్టి ఉపద్రవాలవల్ల అన్ని గ్రంథాలయాల్లోను అన్ని పత్రికల సంచికలు దొరక్కపోయినా కొన్నిట్లోనైనా కొన్ని దొరకుతవనే ఆశ వుంటుంది. వీటినైనా సరిగా వినియోగించుకోవాలంటే వాటికి సంబంధించిన వ్యాస సూచి అత్యవసరం. తనకు కావలసిన వ్యాసం ఒకానొక పత్రికలో ఒకప్పుడు ప్రచురింపబడిందని తెలిస్తే ఆ పత్రిక తనున్నచోట లేకపోయినా తిరుపతిలోనో, విజయనగరంలోనో, మద్రాసులోనో ప్రాచీన గ్రంథాలయాల్లో గలదేమోనని తెలుసుకొని ఆ వూళ్ళన్నీ తిరగకుండా పోష్టుద్వారా పని పూర్తిచేసుకోవచ్చు. ఈ సదుపాయం ఈ సూచివలన ఇప్పటికైనా సమకూరటం ఆంధ్ర పరిశోధక విద్యార్థుల అదృష్టం. ఆయా విషయాల్లో వ్రాయబడే థీసిసు పరీక్షకులకు కూడా ఈ సూచి అవసరం బాగా ఉంటుంది.

ఇట్లాంటి సూచి తయారుచేయటంలో సమస్యలనేకం వస్తుంటాయి. వ్యాసం పేరుతో విషయం తేలికగా సూచింపబడుతుందా ? లేక రచయిత పేరుతోనా ? నిజానికి రెండూ అవసరమే. వ్యాసం పేరు చూట్టానికి బాగున్నా రచయిత ప్రామాణికుడు కాకపోతే ఆ వ్యాసంకోసం పెద్దగా శ్రమ పడక్కర్లేదు. దాంట్లోవుండే విషయం తన పరిశోధనకంతగా ఉపయోగించదని ముందుగానే తెలుసుకుంటాడు పరిశోధక విద్యార్థి. ఒకే విషయం పైన సాహిత్యం లోను, చరిత్రలోను, కథానికలోను, కవితలోను వ్యాసాలు, పద్యాలు ప్రచురిస్తారు. ఇట్లాంటప్పుడు విద్యార్థికి వ్యాస శీర్షికతో బాటు రచయిత పేరు ప్రక్కనే కనిపించాలి. అట్లాగని సూచిలో రెండూ చేర్చక తప్పదు. మరి క్రమంలో వ్యాస శీర్షిక ననుసరించాలా లేక రచయిత పేరు ననుసరించాలా. ఇట్లాంటిదే పత్రికల సంపుట క్రమంగా సూచిని తయారు చేయాలా లేక విషయ విభాగాన్ననుసరిస్తూనా ? ఆయా పత్రికలవారు తమ పత్రికల సంపుటాల క్రమంలో సూచీలప్పుడప్పుడు ప్రచురిస్తుంటారు. ఈ మధ్య ఎపిగ్రాఫియా ఇండికాకు 34 సంపుటాలవరకు వ్యాస సూచీ, రచయితల సూచీ, స్థల సూచీ, రాజుల సూచీ, వంశసూచిఅని తయారు చేశారు. కాని ప్రస్తుతమున్న సూచీ గ్రంథంలో అట్లాంటి సూచీలు కావాలంటే ఒక్కొక్కదాని కింత ప్రత్యేక గ్రంథం కావాలి. నిజానికి అకాడమీ వారట్లాంటి ప్రత్యేక సూచీలు చేయించి ప్రచురిస్తే మంచిదే. ప్రస్తుతం ఇందులో చేయబడ్డ విషయవిభాగంతో వ్యాసము-రచయిత-ప్రకటిత పత్రిక సంఖ్య పద్ధతి బాగానే వుంది. వ్యాస శీర్షికలు అర్థ బోధకములుగాలేనపుడు వాటికి వివరణముగూడనిచ్చిరి. ఉదాహరణకు 1-4 పుటలో 21 వ వ్యాస శీర్షికలో "కడిత" అనే పదముంది. దీని అర్థం కావాలంటే యేశబ్ద రత్నాకరమో చూడనవసరం లేకుండ అక్కడే "జిగురుతో కలిపిన మసిని సరిమి పుస్తక రూపమున మడిచి వ్రాతకై ఉపయోగపడెచెడి వస్త్రసంపుటికే కడిత అని పేరు" అని వ్రాశారు. ఇట్లా సూచీని తయారు చేయటం విద్యార్థులకెంతో సహాయం.

ఇందు గ్రహించిన విషయాలు – అర్థశాస్త్రము; కళ, (చిత్రకళ, శిల్పకళ, నాట్యము, సంగీతముమున్నగునవి); చరిత్ర-భారతదేశము; చరిత్ర-ఆంధ్రులు: జీవితములు; జ్యోతిషము; పత్రికలు; పురావస్తు పరిశోధన; భాష-చారిత్రక శాసనములు; భాష ; భాష-వ్యాకరణము; భాష-శాబ్దికచర్చ;

భాష-ఛందస్సు; భాష-నిఘంటువులు; భూగోళము; హిందూ మతము; యుద్ధము; రాజకీయములు, ప్రపంచ, భారత దేశము, పాశ్చాత్య దేశాలు, రాజకీయము-ఆంధ్ర; లా; విజ్ఞానం, గణితశాస్త్రము, ఖగోళ శాస్త్రము, జంతుశాస్త్రము, ప్రకృతిశాస్త్రము. వృక్షశాస్త్రము, భూగర్భశాస్త్ర, భౌతిక శాస్త్రము, రసాయన శాస్త్రము. మనస్తత్వ శాస్త్రము, సామాన్య విజ్ఞాన శాస్త్రము: విద్య-పాఠ్యగ్రంథాలు; ఉపాధ్యాయులు; పాశ్చాత్యవిద్య; బాలవిద్య; భారతదేశ విద్యా విధానము; వేదాంతము; వైద్యము; సంఘము; సంఘము స్త్రీలు; సాహిత్యము (దీనిలో అక్షరాను క్రమణికలో ననేక విభాగములుగలవు) ఉప విభాగములతో గూడ ఈ విషయములు మొత్తము 72 వీటిపైన 1875 - నుండి 1972 వరకు సుమారొక శతాబ్దిలో వెలువడిన కొన్ని వేల వ్యాసముల సూచిని యీ గ్రంథము తెలుపుచున్నది. ప్రతి విభాగము లోను సాధ్యమైనంత మటుకు అకారాది క్రమాన్ని పాటించారు. కాని అచ్చటచట ఈ క్రమాన్ని పాటించడం వారికి వీలుకాలేదు. ఉదాహరణకి "ఆదిభరతుడు" అను వ్యాసాన్ని చూపి తరువాత "భరతాచార్యుడు", "నాట్యవేదము" అనే వ్యాసాల శీర్షికలను విషయ ప్రాధాన్యాన్ని బట్టి సూచించక తప్పలేదు. ఇట్లా చాలా విషయాల్లో అకారాది క్రమం పోయింది. వారు చెప్పినట్లు రాబోవు ముద్రణలో ఇట్లాంటి లోపాలను సర్దుకోవచ్చు.

సాహిత్యవేత్తలకు, చరిత్రపరిశోధకులకు, కళాజిజ్ఞాసువులకు, భాషాపరిశోధకులకు, తెలుగుదేశమున మనకంటెపూర్వులు క్రిందటి శతాబ్దిలో పరిశోధనలో ఏ విధమయిన ప్రగతి సాధించారో తెలుసుకొనుటకై ఆయావ్యాసములెచ్చటెచ్చట లభించునో సూచించుటలో నీ సంకలన కర్తనన శ్రీ. కృష్ణమూర్తిగారు ఆంధ్ర విద్యార్థులకేగాక, పరిశోధకులకు, పంక్తులకుమహోపకారమొనర్చి యెంతో ప్రశంసాపాత్రులైనారు. ఈబృహత్కార్యాన్ని ప్రోత్సహించి ప్రచురించి ఆం. ప్ర సాహిత్య అకాడమీ వారు ఈమేరకు కృతకృత్యులైనారు. ఈసంకలనము 1972నాటివ్యాసములవరకే జరిగింది. తర్వాత ఇంకో దశాబ్ది గడుస్తోంది. ఈ పదేళ్ళలో అనేక నూతన వ్యాసాలు ప్రచురించబడెను. వాటిని కూడా పరిశోధకులకు తెలుపుటకై సంపూరక (సప్లిమెంటరీ) సూచీని తయారు జేయించుచో బాగుండును ప్రతి దశాబ్దికి ఒక్కొక్క సంపూరక సూచిని దీనికి అనుబంధములుగా జేర్పించుట యెంతో అవసరం. కనుక ఆం. ప్ర. సాహిత్య అకాడమీవారు దీనినొక శాశ్వత కార్యక్రమంగా స్వీకరించి పరిశోధకులకు మేలుచేయగలరు. ఇట్టి సూచీ గ్రంథములకు ఇతర దేశములలోగూడ పదేళ్ళకొక సంపూరకమును సంకలన మొనర్చుచుందురు. ఆ సంప్రదాయాన్ని మన అకాడమీ వారుగూడ అనుసరిస్తారని ఆశిద్దాము.

పరిశోధకులందరికి అందుబాటుగ ఉండగలందులకై ఈ సూచిగ్రంథాన్ని మన రాష్ట్రంలోని అన్ని గ్రంథాలయాల్లోను దీనిని కొనవలసిన అవసరమెంతైనా ఉంది. గ్రంథాలయాధికారులు ఈ విషయంలో శ్రద్ధవహిస్తారనికూడా ఆశిద్దాము.

శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

# జగ్గమాంబ ప్రచురణలు

[రెండుపుస్తకాలు (1) భారతం, (2) భావదీపికలు. రచయిత : వసునందన్ ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతి రోడ్, సికిందరాబాదు-3]

## 1 భారతం

శ్రీరాముని తమ్ముడైన భరతుని ధార్మికత్వంలో అగ్రజునిగా భావించి రచించిన పద్యకావ్యమిది. అభినవ పోతనానవమాములై వరదాచార్యుల వారికీ గ్రంథం అంకితం. రచయిత వయసులో చిన్నయైనా భావనాబలంలో మిన్న.

కావ్యం ప్రాచీన ఫక్కిలో రచింప బడింది. అయోధ్య, కైక, కౌశికుడు, సుమంత్రుడు, మంధర, దశరథుడు, గుహుడు భరతుడు, శత్రుఘ్నుడు, మాండవి-శ్రుతకీర్తి, లక్ష్మణుడు, శూర్పణఖ, హిరణ్యకురంగం. జటాయువు, రావణుడు, సీత, శబరి, సుగ్రీవుడు, పావని, విభీషణుడు, లంక-ఈ వరసలో శీర్షికలున్నాయి.

భరతుని సత్యపరాక్రమత రచయిత నాకర్షించింది. రాముని గొప్పతనానికి భరతుడేకారకుడని రచయిత ఉద్దేశం.

వాల్మీకి రామాయణ పరమార్థం "భరతుడు రామభక్తుడుకాడు, సనాతన ధర్మభక్తుడు" అని ఈ రచయిత నమ్మకం. "భరతుడు ఉన్నంతమేరా గట్టిగా పట్టిచూస్తే – శ్రీరామ భద్రుడు నిలవడం చాలా కష్టం" అంటాడు రచయిత.

ప్రాచీన కావ్యాల్లో కొన్ని పాత్రలకి అట్టే ప్రాధాన్యం కనబడదు. అవి చదువుతున్నప్పుడు ఫలానా పాత్ర చరిత్ర విపులంగాచెప్పకుండాకవిఎందుకువదిలేశాడేఅనికొందరికిఅనిపించడం కద్దు·ఉదాహరణకి రామాయణంలో ఊర్మిళపాత్ర. కొందరికీ పాత్రపై గొప్పసానుభూతి. నిజానికి ఇలాటి పాత్రలింకా ఉంటాయి. అన్నిటినీ వర్ణిస్తూపోతే అసలు కథ ఎప్పటికి తెమిలేటట్లు? అప్రధాన పాత్రలను మహాకవులు పాఠకుల ఊహకే వదిలేస్తారు.

ప్రాచీన కవుల పద్యాల పోకడలు ఈ పుస్తకంలో కనబడతాయి. రచయిత శైలి కొకపద్యం-

"వండ నలయుడు వేవురు వచ్చిరేని
అన్నపూర్ణకు నుద్దియౌ నమృత మూర్తి
కాల భయద హాలాహల కీలశీత
మయ్యె వైదేహిపతి భక్తి నాత్మనెంచి"

భరత చరితమ్ము దెంత భాస్కరమొ! దాని
వివిధ భాషా మహాకవుల్ విడుచుటెల్ల
కోటి జన్మలదైన నా మేటి పుణ్య
సత్ఫలమని వారలకు సాష్టాంగ మిడుచు-

అని రచయిత ఆవిష్కృతిలో చెప్పారు. ప్రతిమా నాటకంలో భరతునికున్న ప్రాముఖ్యం జగద్విదితమే!

నూట అరవై పేజీల కావ్యం వెల పదిరూపాయలు.

## 2. భావదీపికలు

సాహిత్య వ్యాసాల సంపుటం ఇది. మనస్సు, రసం, కవిత్వం, శిల్పం, పాత్ర, ధ్వని, అర్థం, గుణం, ఆత్మ-అనే శీర్షికలున్నాయి. ప్రతి శీర్షికకు ఒక ఉపశీర్షిక ఉంటుంది మనస్సుకి కర్పూరవసంతరాయలు- స్వప్నశిల్పం అనేది ఉపశీర్షిక. ఆధునిక కావ్యాల్లో సినారెగారి కర్పూరవసంత రాయలుఒకటి. ఫ్రాయిడ్ ప్రఖ్యాతమనశ్శాస్త్రవేత్త. కర్పూర వసంతరాయలు కావ్యంలో స్వల్ప శిల్పాన్ని వసునందన్‌గారు ఫ్రాయిడ్‌సిద్ధాంతాలకు ముడిపెడతారు.

విజ్ఞానశాస్త్ర విషయాలు అనేకం ఇప్పటికీ బాల్యావస్థలో ఉన్నాయి. అందులో "మనస్సు"కు సంబంధించిన శాస్త్రం మరీ ముఖ్యమైంది అది మనసో, మెదడో ఏదైతే అది- దాని సంగతి శాస్త్రజ్ఞులకు పూర్తిగా ఈ నాటికీ తెలియదు. స్వప్నాలను గూర్చినశాస్త్రాలు చాలా వరకు ఊహాజనితాలు. అనేకం రుజువుకావు. కవులు తమ రచనలను ఎప్పటికప్పుడు నవ్యతరం చేయడానికి అనేకమైన ఊహలు చేస్తారు. వాటన్నిటిని పట్టుకొని శాస్త్ర సమ్మతాలని రుజువుచేయబూనడం హాస్యాస్పదంగా ఉంటుంది. ప్రతి స్వప్న విషయాన్నీ లైంగికంగా వివరింపబూనడం హాస్యాస్పదంగా గోచరిస్తుంది.

ఆ తరువాత వ్యాసం వాల్మీకం-ధర్మవీరం. రామాయణంలో ఉన్నది కరుణం గాదనీ,ధర్మవీరమనీ నిరూపించారు. ఉత్తమ కవిత నాడు నేడు అనే వ్యాసంలో కొటేషన్లు గుప్పించారు. యూనివర్శిటీ నోట్సులు గుర్తుకు వస్తాయి.

ఈ పుస్తకంలో ఉత్తమ వ్యాసంగాచెప్పదగింది ఏక వీర-విశ్వనాథ" రచయిత నిశితపరిశీలనకు ఇదిఉదాహరణ. సత్యాకృష్ణులు-తిమ్మన అనే ఉపశీర్షిక తరువాత పోతనగారి వామనుని గూర్చి వసునందన్‌గారు వ్రాస్తూ ఆ ఘట్టంలో నిక్షిప్తమైన ధ్వని భేదాలను సోదాహరణంగా వివరించారు. వానమామలై వరదాచార్యులవారి పోతన చరిత్రలోని వాత్సల్య భక్తిని గూర్చి ఒక వ్యాసం వ్రాశారు. గీత గోవిందంలోని మాధుర్యాన్ని గూర్చి ఇంకోవ్యాసం. తెలుగు భాగవతం-పోతన మతం అనేది చివరి వ్యాసం పరమేశ్వర-మహేశ్వర శబ్దాలను విష్ణుపరంగా అర్థం చెప్పి ఈ రచయిత చక్కని సమన్వయం చేశారు.

ఈ రచయితలో "రెండు పొరలు" "ఏమయ్యా" ఎక్కువగా కనిపిస్తున్నాయి.

శైలికి ఉదాహరణగా కొన్ని వాక్యాలు:

"మధురభక్తి సిద్ధాంతమని ఒక టున్నది. జీవుడు దేవుడ్ని పతిగా భావించి సర్వభావసమర్పణం చేసేవిధానం. ఆ మధుర భక్తిలోని రెండు పొరలకు ప్రతీకలే ఈ కావ్యం

లోని రాధాకృష్ణులు. ఒక పాత్రమరోదానికి పరిపోషకం. ఒకటి లేక రెండోది లేదు. ఈ భావాలకు తగినట్లుగా జయదేవుని పాత్రపోషణ ప్రతి పద మధురమై విలసిల్లింది. ఎత్తి చూపవలసిన పనిలేదు. చూపడం ప్రారంభిస్తే కావ్యమంతా ఉదహరించాలి." నూట పద్నాలుగు పేజీలపుస్తకంవెల అయిదు రూపాయలు.

శ్రీ పులిచెర్ల సాంబశివరావు

# ముట్నూరి కృష్ణారావు వ్యాసాలు

[పరిష్కర్త-డాక్టర్ రావూరు వెంకట సత్యనారాయణ రావు. మూల్యము : రూ. 9-50. ప్రచురణ - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-4.]

కీర్తిశేషుడు ముట్నూరి కృష్ణారావుగారు "కృష్ణాపత్రిక"లో వ్రాసిన వ్యాసాలు ఈ శతాబ్దంలోతెలుగుదేశాన్ని జాగృతం చేశాయి. కృష్ణాపత్రిక సంపాదకుడుగా ఆయన వ్రాసిన వ్యాసాలు తెలుగు వారికి మార్గదర్శకత్వాలయినాయి. రాజకీయంగానూ, సాంస్కృతికంగానూ మాత్రమే కాకుండా చారిత్రికంగాకూడా ఆ సంపాదకీయాలకొక ప్రాధాన్యత వున్నది. ఆయన స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న త్యాగమూర్తి, మేధావి విజ్ఞాని. ఆయన వ్రాసిన వ్యాసాలతో యీ తరం రచయితలకూ సంపాదకులకూ అంత పరిచయం వుండక పోవచ్చు వారి సౌకర్యానికి ఆయనవ్రాసిన సంపాదకీయాలు 66 వ్యాసాలను యీ 366 పుటలగ్రంథంలో పొందు పరిచారు.

ఆయన పరిశీలనా దృష్టి నిశితమైనది. వాదనా పటిమ తర్కబద్ధమైనది. "దేశభాష-మతభేదములు" అనేవ్యాసంలో ఆయన వ్రాసిన అంశాలు యీ నాడుకూడా చెల్లుతాయి. ఇందుకు నిదర్శనగా "దేశభాషలు-మతభేదములు", "శ్రీనివాస శాస్త్రి", "వివాహ సంస్కారము" వంటి వ్యాసాలలో కృష్ణారావుగారు చేసినతర్కాన్ని ఉదహరించవచ్చు. వివాహ సంస్కారము అనేవ్యాసంలో ఆయన ఇలా వాదించారు :

"ప్రతి మానవుడును తన మతమునందు, తన జాతియందు, తనవర్ణమునందు, తన యాచార విచారములందు, తన ఆహారవిహారములయందు సుస్థిరుడై యుండవచ్చును. కాని, తక్కిన మతస్థులతో, తక్కినజాతులతో తక్కినవర్ణస్థులతో కలసి నివసించుటకు సమిష్టి జీవనమున పాల్గొనుటకు సమాన ప్రతిపత్తితో మెలంగుటకు ఎట్టిప్రతిబంధకమునుండ కూడదు" ఇది హేతువాదం కాదనగలమా?

అదేవ్యాసంలో "భారతవర్షము విశ్వరంగ మధ్యమున సమానప్రతిపత్తితో నిలువఁగలుగుటకై స్వాతంత్ర్యము నభిలషించుచున్నది" అన్నారు కృష్ణారావుగారు. అంతటితో ఆగక "పూర్వాచారములను మేము నిందింపము. కాని దాని యవసరము తీరినది. అవియిప్పుడుపాషాణప్రాయములై జాతీయ జీవనమును ప్రతిబంధించుచున్నవి. వానిని సడలించవలసిన తరుణమాసన్నమైనది" అన్నారు ఆయన. ఈ అంశాలను గురించి హేతువాదులమనిచెప్పుకునేవారు నేడయినా ఇంత కంటెఎక్కువ మరేమి వ్రాయగలరు? గాంధి, రవీంద్రనాథ్ ఠాగూర్, ఆండ్రూస్‌ల చిత్తరువు గురించి భావక శక్తి అనే వ్యాసంలో శ్రీ కృష్ణారావుగారు వ్రాసిన అంశాలను గురించి మేధావులు బాగా జిజ్ఞాసచేయటం చాలా అవసరం. ఇందు గమనింపదగిన అంశాలలో కొన్ని : "ఆత్మవితరణ శక్తి ఏ కొలది మంది పండితుల మథనమునందో యుండునది కాదు........ఆధునిక యుగము జ్ఞాన యుగము ...."

"జేబున్నీసా నాటకము" అనే వ్యాసాలలో కృష్ణారావుగారు ప్రకటించిన భావాలు నేటి రాజకీయ వాదులకు, కుల మత వాదులకు శిరోధార్యాలు. ఇదేవిధంగా "తెలగమహాసభ" అనే వ్యాసంలో 1923 లోనే కృష్ణారావుగారు వర్తమానకాలంలో అనుసరించి అమలు జరుపదగు భావాలనూ, సూచనలనూ వ్యక్తం చేశారంటే ఆయన ఎంత దూరదృష్టిగల నాయకుడో విదిత

మవుతుంది. "కస్తూరి రంగయ్యగారు" అనే వ్యాసంలో కృష్ణారావుగారు వ్రాసిన అంశాలు చాలా ప్రధానమయినవి, అనుశీలనచేయదగినవి, ఆయన వైజ్ఞానిక దృష్టిని చాటు నట్టివి. "చేతిమగ్గములు", "బలబలి", "మహాత్ముని అవతార రహస్యము", "ఇంగ్లాండులో ఇండియాబిల్యము" "సంస్కృతదౌర్బల్యము", "ఆ బానిసవ్యాపారము" వంటి వ్యాసాలు ఈ సంకలనంలోఆణిముత్యాలు. కృష్ణారావుగారివ్యాసాలలో సంఘ దృష్టి వ్యక్తమవుతుంది. జాతినిమేలుకొల్పడం ఆయన రచనల లక్ష్యం. కాబట్టి ఈ వ్యాసాలలో శైలికంటె భావలకు అధిక ప్రాధాన్యతకనిపిస్తుంది.

ఈ వ్యాసాలలోని అంశాలనుగురించి ఇంతకంటేబాగా వ్రాసిన రచయితలుంటే ఉండవచ్చును గానీ తనరచనల ఆకాలంలో ఎక్కువమంది గ్రామీణుల చేత కూడ చదివించిన, ఒకరు చదవగా కొంతమంది గ్రామీణులు చేరివిన్న ఘనత నిశ్చయుంగా కృష్ణారావుగారిదే, ఇదేవిధంగా రచనలద్వారా ప్రజలను ప్రభావితులను చేసిన ఘనతకూడా కృష్ణారావు గారిదే. ఆయన వ్యాసాలలో కనిపించేది భాషా సోయగం కాదు ప్రపంచజ్ఞానం. ఆయన రచనలు పండితులను మాత్రమే దృష్టిలో పెట్టుకుని వ్రాసినవికావు. పామరులలో, చాలామందికి కూడా అర్థంకావాలని వ్రాసిన వ్యాసాలు అంటే క్లిష్టమైన పదాలు, అలంకారాల వంటివేమీ లేకుండా స్పష్టంగా వ్రాసిన వ్యాసాలు. స్పష్టత యీనాడుకూడా రచయితలందరకూ చాలా అవసరం కదా!

ఇవన్నీ 1920 జూన్‌నుంచి 1925 మార్చి 15 వరకూ వ్రాసిన వ్యాసాలు. అయినా వాటిలోకొన్నింటికి కాలదోషంపట్టలేదు. అనగా ఆవ్యాసాలలో వ్యక్తంచేసినభావాలు యీ కాలానికి పనికిరాకుండాపోలేదు. మరికొన్నిభావాలు శాశ్వతంగా నిలిచివుండేవి. అయితే ఇన్నిసంవత్సరాల తర్వాత యీ వ్యాసాలను గురించి మదింపు చేయాలంటే కొంచెం కష్టంగానేవుంటుంది. ఎందుకనంటే కృష్ణారావుగారి వాక్యాలలోని కొన్నిమాటలు తమాషాగా వుంటాయి. ఇంగ్లీషు మాటలను తెలుగు మాటలులాగా ఆయన వ్రాయడం, అల్లా వ్రాయడం తప్పని తెలియక కాదు. అదొక శిష్ట వ్యావహారిక భాష ఆ రోజులలో. ఉదాహరణకు 60 వ పేజీలో "ప్రపంచాదోళన" అని వున్నది. అది "ప్రపంచాందోళన" అయివుండొచ్చు 63 వ పేజీలో "జాగంట" అని వున్నది. ఇది "జేగంట" అయివుంటుందేమో? 183వపుటలో "అస్పృయిలమా", "193వ పుటలు లెగూను స్విమ్మింగ్ పూల్" లాంటిపదములు అటనట కానవగును. ఇవి లోపాలు కావు. అదొక పద్ధతి. అదొక చమత్కారము. జాతీయోద్యమానికి తెలుగు దేశంలో అసాధి కార ప్రచారకర్త అయిన కృష్ణారావుగారి సంపర్కాన్ని బట్టి కాంగ్రెసును విమర్శించడానికైనా వెనుదీయలేదు. ఆయన నిజమైన పత్రికా రచయిత,సంపాదకుడు అనడానికి అదే కారణం.

## సంఖ్యావాచక పదకోశము

[సంకలన కర్త-బి. అనంతరామ. వెల : రు. 75. ప్రచురణ – శ్రీ మహాలక్ష్మీ బుక్ ఎంటర్ ప్రైజెస్, మ్యూజియమ్ రోడ్, గవర్నరుపేట, విజయవాడ - 2]

విద్యా ప్రమాణాలు ముందున్నంత పాటవంగా యీ నాడుండడం లేదనే విమర్శ తరచు వినిపిస్తూంటుంది. ఈ విమర్శకు ప్రతిస్పందనంగా ప్రభుత్వం పెక్కు పరిశీలక సంఘాలనూ, అనుశీలన సంఘాలనూనియమించిన సంగతి, ఆయా సంఘాలు చేసిన సిఫారసుల కనుగుణంగా విద్యా సంస్కరణలు అమలుజరుగుతున్న సంగతికూడా విజ్ఞులకు తెలిసినదే. ఇంతవరకూ విద్యారంగంలో విశేషించి ఆంధ్ర ప్రదేశ్‌లో విద్యారంగంలో జరిగిన కృషి ఆశించిన ఫలితాలను ఇచ్చినదని అనగలవారు అంత ఎక్కువమందిఉండరు. దీనికి ప్రధానకారణాలలో ఒకటి యీ కృషి అంతా నేలవిడచిన సాముగా జరగడమని చాలా కొలదిమంది గ్రహించడమేమో!

పెద్ద బాలశిక్షతో విద్యాశిక్షణ నారంభించినవారు యీ తరంలో ఎంతమంది ఉన్నారు? అఖిలభారత స్థాయిలో జరిగే పోటీ పరీక్షలలో ప్రతి సంవత్సరం ఎంతమంది ఆంధ్ర ప్రదేశ్ అభ్యర్థులు నెగ్గుతున్నారు. దీనికి కారణం పునాది అన దగిన ప్రాథమిక విద్యాశిక్షణ సరిగ్గాలేకపోవడం

"కామన్ సెన్స్" అని ఇంగ్లీషులో అంటారే ఆ ప్రపంచజ్ఞానం అరుదైపోయి "అన్ కామన్ సెన్స్" కావడం.

ఇలాంటి విద్యాతృష్ణ గల వారందరికీ ఈ సంఖ్యా వాచక పదకోశము చక్కగా ఉపయోగ పడుతుంది. గణిత శాస్త్రం లెక్కలకు సంబంధించినదే అయినా, దానికి మూలములైన సంఖ్యలు మనసాహిత్యంలో చాలా ప్రాముఖ్యం వహిస్తున్నాయి ఈ రచయిత సంఖ్యలను నూటఎనిమిది వరకూ చూపించి ఆ సంఖ్యలకు అనువైన పదముల నెన్నుకొని యీ పదకోశమును 25 సంవత్సరాలలో సంకలనం చేశారు. అందుకు ఆయన ఎంత శ్రమించారో? ఎంత సహనం అవసరమైనదో?

ప్రథమ సంఖ్య అనే శీర్షికన ఇచ్చిన పదములు "ఏకోనారాయణ" తో అంత్యమైనవి మరికొన్ని పదములను ఇందుచేర్చే అవకాశంలేకపోలేదు. అలాగే "ద్విప్రాణాయామములు" అనగా "1. సగర్భము, 2. అగర్భము" అని అర్థం యివ్వడంతో పాటు మరికొంత వివరణకూడా అవసరము. "ద్వివిధకళలు" అనగా 1. లలిత కళలు, 2. సలిత కళలు" అనే అర్థం గురించి చాలా చర్చించవలసి వున్నది. అయితే యీ అర్థం లౌక్యప్రపంచానికి, వర్తమానానికి సరిపోయేది కావచ్చు. ద్వివిధకాంతి రూపులు అనే మాటకు 1. సూర్యుడు 2. చంద్రుడు అని అర్థం చెప్పడం ఎంతవరకూ సమంజసం? పౌర్ణమి, అమావాస్యలను కాంతులు తిథులుగా ప్రామాణిక గ్రంథాలు అంగీకరిస్తాయా? ద్వివిధ జాతులు అనే మాటక రెండు అర్థాలు ఇవ్వడం బాగానే వున్నదికానీ "జాతులు" ఇంకా చాలా వున్నాయని గమనించనక్కరలేదా?

ఏయే ప్రామాణిక గ్రంథాల నుంచి ఆయా సంఖ్యా వాచక పదములకు అర్థం ఇస్తున్నది అక్కడికక్కడనే వివరించడం యిలాంటి పదకోశములను తయారుచేసేవారు గమనించ దగిన ముఖ్యాంశాలలో ఒకటి. ద్వివిధ ప్రకాశములు అన్నప్పుడు దీపము, నేత్రము అన్న వివరణ ఒక ఆలోచన సరళ ప్రకారం సరయినదే కావచ్చు ఆ ఆలోచనా సరళిని అక్కడికక్కడే ఉదహరిస్తే పాఠకులకు మరింత ప్రయోజనకరంగా వుంటుంది. ఇలా యిందులోని ప్రతి సంఖ్యా పదం వివరణలోనూ మరొక అభిప్రాయానికి ఆస్కారం కనిపించుతున్నది.

అయినప్పటికి ఇది చాలా ప్రయోజనకరమైన గ్రంథము రచయితలకూ, శాస్త్రజ్ఞులకూ, పత్రికా రచయితలకూ, జ్యోతిష్కులకూ, నటులకూ, జిజ్ఞాసాహితులందరకూ ఉపయోగపడే ఉద్గ్రంథమిది. తెలుగులో ఇలాంటి గ్రంథం ఇంతవరకూ రాలేదేమో! విశ్వ విద్యాలయాలలోని విద్యార్థులకుమాత్రమే కాక అధ్యాపకులకుకూడా ఇది చాలా ఉపయోగపడుతుంది ఉదాహరణకు ద్వాదశ రాసుల మిత్ర క్షేత్రముల గ్రహము లేమి? అని ప్రశ్నించితే ఎంతమందిపట్టభద్రులు సమాధానం చెప్పగలరు. అలాగే ద్వాదశరాసుల దిశలను గురించిన వివరణకూడా బాగున్నది. ద్వాదశ రాసుల నేలదశగ్రహములంటూ వున్నాయని జోతిష్యులలో ఎంతమందికి తెలుసునో కానీ సామాన్య విద్యావంతులలో చాలా మందికి తెలియక పోవచ్చు.

షోడశ మిత్రులు (వాత్సాయన) గురించి, ఈ గ్రంథంలో యిచ్చిన వివరణ గురించి విజ్ఞులు పరిశీలించడమవసరం. షోడశ శాలా పురోభాగ విన్యాసములు (వాస్తు శాస్త్రం ప్రకారం), షోడశ శాలా మధ్యభాగ విన్యాసములను గురించికూడా భిన్నాభిప్రాయాలున్నాయి.

పంచ త్రింశతి సంగీత తాళములనుగురించి, సంగీత మృదంగ తాళములను గురించి యీ రచయిత యిచ్చిన వివరణ బాగున్నది. సంగీతశాస్త్రం, తత్వ శాస్త్రం, స్మార్తక విధానాలకు సంబంధించిన సంఖ్యా వాచక పదాలకు యీ రచయిత యిచ్చిన వివరణ బాగున్నది. పంచ చత్వారింశతి భారతదేశ కవులకు యీ గ్రంథకర్త యిచ్చిన వివరణ పరిశీలనార్హము. యోగదీక్షలు ఎన్ని? నలుబది నాలుగా ఇంకా ఎక్కువా? తక్కువా?

ఏకోనాశితి సంఖ్య అనే శీర్షిక కింద యీ గ్రంథకర్త యిచ్చిన వివరణలన్నీ బాగున్నాయి.

విమర్శయే లక్ష్యంగా పెట్టుకుని పరిశీలించితే యీ పదకోశంలో చాలా తప్పులని అనిపించేవికనిపించవచ్చు. కానీ సామాన్యులందరకూ కాకపోయినా విజ్ఞులకూ, విద్యావంతులకూ, ఉపయోగపడే మంచి పదకోశాలలో ఇదొకటి. సంఖ్యా వాచక పదకోశములలో మొదటిది. విశ్వవిద్యాలయాలు, గ్రంథాలయాలవంటివాటిలో తప్పక ఉండవలసిన గ్రంథము. ఈ రచయిత కృషికి జోహార్లు.

శ్రీ వి. ఎస్. అవధాని

## కవితా కదంబము

(కవితా సంకలనం)

[వెల: రు. ?-00లు. వివిధకవులు. ప్రతులకు:-అభ్యుదయ భారతి, సారస్వత సమితి, నరసరావు పేట ]

సాహిత్య పరంగా ఆధునిక కాలచైతన్యం సహస్రము జీవమై విజృంభిస్తోంది. గతంలో ఏనాడూ లేనన్ని సాహిత్య సంస్థలు ఆవిర్భవిస్తున్నాయి. సాహిత్యంద్వారా సమాజాన్ని జాగృతం చెయ్యడానికి తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నాయి. ఈ వ్యవస్థ పట్ల, దీని గమనంపట్ల ప్రతిపౌరునికి అసంతృప్తి ఉన్నట్లుగానే, ప్రతి కవికి అసంతృప్తి ఉంది. సమాదాన్ని గురించి సామాన్య మానవుణ్ణి గురించి ఈ కవులు పడుతున్న తపన, వేదన అనేక కవితా సంకలనా లుగా రూపు కడుతోంది. అట్లాంటి సంకలనాల్లో కవితా కదంబ మొకటి. ఉగాది మీద రాసినా, మరొక దానిపై రాసినా ఈ సంకలనం లోని కవులందరికీ సామాజిక సంక్షోభం ఇతివృత్తం కావడం హర్షించదగిన విషయం.

"సంవత్సరం మారినా సమాజం మారిందా ?
ఉగాది వచ్చినా ఉల్లి పాయ రేటు తగ్గిందా?
మేడి పండు స్వరాజ్యంలో మేకలను మ్రింగె తోడేళ్ళు
స్వేచ్ఛా విహారం మానుకున్నాయా ?"

అంటూ ఈ దోపిడీ వ్యవస్థను ప్రశ్నిస్తున్నాడు ముప్పాళ మధుసూధనరావుగారు. ఈ సంకలనంలోని కవులంతా పురోగామి దృక్పథం కలవారే. ఈ వ్యవస్థమారాలని ఆశించేవారె అయితే పలుకుబడిలో పదును, శాబ్దిక ప్రయోగంలో ఔచిత్యం, అర్థాన్ని అందివ్వడంలో, చాకచక్యం అలవరచు కొన వలసిన అవసరం ఉంది. వచనకవితాభిమానులు ఆదరించ తగ్గ సంకలనం ఇది. చివరిలో అనిశెట్టి అముద్రిత గేయం సంకలనానికి నిండుదనాన్ని ప్రసాదించింది. అభ్యుదయ భారతి భవిష్యత్తులో ఇంకా ఇంకా ఉత్తమ కవితా సంకలనాలను అందిస్తుందని ఆశింపవచ్చు.

## ఉషస్సు

(వచన కవితా సంకలనం)

[వెల :రు. 1-10పై వివిధ కవులు. సంకలనకర్త శ్రీ వాసవ్య. ప్రతులకు : వివేక్ న్యూస్ అకాడమీ, నూజివీడు-521201.]

ఈ సంకలనాన్ని ఆవిష్కరించినది శ్రీ దుర్గానంద్. వారి పేరుకు ముందు మహాకవి అనే బిరుదు కూడా ఉంది. "మరో మలుపు"అనే ముందుమాట శ్రీ వాసవ్యగారు రాశారు. శ్రీయుతులు కె. వి. నరశింహారావుగారు, డి. లక్ష్మణరావు గారు, సంజీవ దేవ్.గారు, డాక్టర్ వి వి. యల్ నరశింహా రావుగారు, పోతుకూచి సాంబశివరావుగారు ఇంకా అనేకుల శుభాకాంక్షలు ఈ సంకలనంలో ఉన్నాయి.

"కూటిది ఏ కులం ? నీటిది ఏ మతం ?
కామానిది ఏ శాఖ ? క్రోధానిది ఏ గోత్రం ?
కళలది ఏ కులం ? కన్నీటిది ఏ మతం ?
కులం నీటి బుడగ మతం గాలిమేడ"

ఇత్యాదులైన కవితా పాదాలు ఈ సంకలనంలో చాలా తక్కువగా ఉన్నాయి. అయినా ఈ కవులందరికీ ఏదో చెప్పాలనే తపన, చెప్పలేక పోతున్నామనే దిగులు ఉన్నట్లుగా ఈ సంకలనం చెబుతుంది. ఆరంభ ప్రయత్నం ఫలింకపోయినా మరో ప్రయత్నం సఫలీకృతం కాగలదని భావించవచ్చు.

## ఎక్స్-రే-పి. సుదర్శన్-టేకుమాల్ లక్ష్మణ

వెల :- రు. 2-00 లు ప్రతులకు : కేకలు ; తెలుగు వీక్లీ ; వీక్లీ బజార్, నిజామబాద్.

ఇది యిద్దరు యువ కవుల కవితా సంకలనం. "ఈ సమాజం అడుగడుగున కనబడుచున్న నగ్న సత్యాలను చూసిన తరువాత మాలో కల్గిన హృదయ స్పందనే" ఈ కవితా సంకలనంగా కవులు చెప్పుకున్నారు. ఈ అసభ్య సమాజపు పరువును వారి కవిత్వం ద్వారా బయట పెడు

తున్నంమస ఈ యిద్దరు యువకవులకు స్వాగతం పలికారు శ్రీశ్రీ.

మొక్కలకంటె, జంతువులకంటె ఈనాటి నాయకుడు ఎంత అధికుడో 'ఓటేస్తే' అనే గేయంలో టీకేమాల్ లక్ష్మణ గారు సూటిగానూ, శక్తివంతంగానూ చెప్పారు.

"మొక్కకు నీళ్ళోస్తే పూలస్తది
కుక్కకు కూడేస్తే ఇంటిని కాస్తది
ఆవుకు గడ్డేస్తే పాలిస్తది
మరి
నాయకునికి ఓటేస్తే ఊరు దోస్తడు"

అంతర్యంలో కుళ్ళిపోయి బయటకుమాత్రం ప్రగతిని సాధిస్తున్నట్లుగా కనబడుతున్న ఈ సమాజంలో రాబోతున్న తిరుగుబాటును దర్శనీయం చేస్తున్నారు. పి.సుదర్శన్‌గారు నగ్నసత్యం గేయంలో.

"బలం ధనం
రంగుల రాజసయోలు
రాత్రుల కౌగిళ్ళలో.. ....
ధాత్రంతా నీరవ నిశీదంలో మునిగి
పైకి మాత్రం నియాన్ కాంతితో
నిగనిగలాడి పోతున్నది
లోలోపల ఎక్కడో ఒక డొక్కలో
తిరుగుబాటు వేదాంతం"

ఎక్స్-రే సంకలనం ద్వారా ఈ సమాజ శరీరంలోని రోగ గ్రస్త భాగాలను ఈయువ కవులిద్దరూ తమ కవిత్వ కెమెరాలో చక్కగా ప్రదర్శించారు.

# పూలదోసిళ్ళు

కన్నెకంటి రాజమల్లాచారి. వెల : రు. 4-00 లు, ప్రతులకు : శ్రీ రామదాస్ అమరనాథ్, కవితా కుటీరం, 12-14-8, ప్రకాశ్ నగర్, నియర్ రైల్వేస్టేషన్, నరసరావు పేట, గుంటూరుజిల్లా.

రాజమల్లాచారిగారు పార్వతీభక్తులు ఈ కావ్యమంతా ఆదిశక్తి ఆవాహనకు అంకితమైంది. భక్తులంతా చదివి తరించడానికి ఈ కావ్యం ఉపకరిస్తుంది. కాళీదేవి లేదని భావించే వాళ్ళంతా దుర్మార్గులని వారిని సన్మార్గులుగా కాళిమాతచెయ్యాలని ఆచారిగారు ఆశిస్తున్నారు. వారి భూత దయను కొనియాడవలసిందే. ఈనాటి నాగరికతను భరిస్తున్న శంకరుణ్ణి ఇంతప్రేమకు మాటలమీద తగదని ఆచారి గారు హెచ్చరిస్తున్నారు. వారి హెచ్చరిక ఆ శంకరుడు (ఉంటే) వింటాడని ఆశిస్తాను.

# ఆకలి నృత్యం

(కవితా సంపుటి)

[శీలా సుభద్రాదేవి. వెల:- రు. 4-00 లు ప్రతులకు: కథాసాహితి, 3-5-43/1, రాంకోట్ హైదరాబాదు.]

ఎక్కువమంది రచయిత్రులు కథలు, నవలలు రాస్తూ (అదికూడాసామాజిక వాస్తవికతకు అతిదూరంగా విహాయస వీధుల్లో విహరించే ఒకానొక అతి నవ్య కాల్పనిక మాదక ద్రవంతో నిండినది) డబ్బు చేసుకొంటున్న ఈ రోజుల్లో సమిష్టి వేదనను తన వేదనగా చేసుకొని శీలా సుభద్రాదేవిగారు కవిత్వం రాయడం హర్షించవలసిన విషయమే. "స్వకీయమైంది కాక, చుట్టూ ఉన్న జన జీవితాన్ని గూర్చి ఆలోచించటం - ఆవేదన పడటం - ఆగ్రహ పడటం-వివేచించటం - విశ్లేషించటం - సుభద్రాదేవిగారి ప్రత్యేకత" అన్న కె.శివారెడ్డిగారి మాటల్లో సత్యం ఉంది. స్త్రీ సాధించిన స్వాతంత్ర్యాన్నిగూర్చి ఆమె ఇలా అంటారు:

స్వేచ్ఛకోశం పెనుగులాటలో
సంప్రదాయపు తాళ్ళు తెగిపడ్డాయి
కట్టుబాట్ల కట్టు కొయ్య
మొదలంటా ఊడిపడింది
నివురు గప్పిన నిప్పుల్లా ఉన్నామిన్నాళ్ళూ

చైతన్యోత్సాహంలో ఎగిసిపడే
మా గుండె ఊపిరుల ప్రభంజనంతో
నివురు ఎగఃగొట్టేస్తాం
ఈ అగ్ని ఇంతలో చల్లారదు
అడ్డుపడితే నిన్ను దహించకా మానదు"

ఆర్థిక అసమానత మనిషి నుంచి మనిషిని ఎంత దూరం చేస్తుందో, మనిషికి-మనిషికి ఎంత భేదంఉంటుందో చక్కగా కవితాత్మకంగా చెప్పారు కవయిత్రి.

"అవే పాదాలు
కలవారి ఇంటిలో ఉండే కలువపూలై
కదిలితే కందుతాయని
కార్లలోనే తిరిగేవేమో-
కనీసం మధ్య తరగతి మందార పాదాలైతే
మామూలు చెప్పులైనా
ఆ పాదాలను కౌగలించేవేమో -
ముందే దరిద్రం కౌగలించుకుందేమో
నిప్పుతొక్కిన కోతిలా
మండుటెండలో కదం తొక్కుతున్నాయి."

సుభద్రాదేవిగారు భవిష్యత్తులో ఇంతకంటె సాంద్రంగా, ఉత్తమంగా సామాజికానుభూతిని తమ కవిత్వంలో వినిపిస్తారని ఆశ.

## మౌనం నా సందేశం

[కల్లూరి భాస్కర్, వెల :- రు.4-00 లు, ప్రతులకు మిత్రసాహితి: పక్కిలంక-534341, ప.గో.జిల్లా ఆం. ప్ర ]

ఈ ప్రాపంచిక బీభత్సానికి మౌనం పరిష్కార మార్గమని తమ అమూల్య సందేశాన్ని ఈ కావ్యం ద్వారా అందించారు భాస్కర్‌గారు. అహం హద్దుమీరితే దాపురించే అపస్మారక స్థితికి ఈ కావ్యం చక్కని ఉదాహరణ "మనిషి సమస్యలకు పరిష్కారం కమ్యూనిజంలోనో, సోషలిజంలోనో, మరో ఇజంలోనో ఉందనుకోడం అజ్ఞానంలో భాగమే. మనిషి సమస్యలకుపరిష్కారం మౌనంగా పడుండడంలోనే ఉంది" అనే వీరి అభిప్రాయంకన్నా ప్రపంచంలో మరో అజ్ఞానం ఉండదు. కవిగారి మనస్సు రుణగ్రస్తమవడంవల్ల "కవి కవితా కన్యను తుపాకి గొట్టానికి ఉరేస్తున్నాడు. రాజకీయంలోనే అంతా ఉందని సాంకేతిక,శాస్త్రీయ విజ్ఞాన వికసనం కూడా అభివృద్ధి అనీ, సాహిత్యవేత్త సైతం భావిస్తున్నాడు. ఈనాడు అభివృద్ధిగా బాధించబడేదేది అభివృద్ధి కాదు భ్రమ" అనుకునేటువంటి స్థితికి దిగజారడం జరిగింది. "నిన్న శూన్యం - నేడుశూన్యం - కాకపోదా రేపు శూన్యం ?-అందుకే మౌనమేశరణ్యం." అనే భాస్కర్‌గారు కవిత్వం రాయకపోతేమాత్రం వచ్చే నష్టమేముంది గనుక.

"ఏమిటి కవిత్వం ?
అందని అవధులకు బారలు చాచే
ఉత్తేజం చైతన్యం
ఒక ఆనందం ఒక అశాంతి....
నిజానికి అది చెప్పేదేమీ లేదు
సాధించేదీలేదు-"

అనుకుంటూనే "కళంకం లేని తెల్లకాగితాన్ని ఖరాబు" చెయ్యడం దేనికి ? అంతా మిథ్య - వికసించిన విజ్ఞానం, చరిత్ర ప్రగతి- యావత్తు ఒక స్వప్నం అనుకునేవారికి కావ్యం ముగింపులో వారే చెప్పినట్లుగా "హాయిగా మామూలుగా- జంతువులా మౌనంగా పడుండడం మేలు."

శ్రీ టి. ఎల్. కాంతారావు.

## దేవస్వామికృత ఆశ్వలాయన గృహ్య సూత్ర భాష్యమ్

[విమర్శనాత్మక సంపాదకత్వము, పరిష్కరణ, ఉపోద్ఘాతము : పండిట్ కే. పి. ఐథల్. సైజు : డెమ్మీ. పుటలు : ఆంగ్ల ఉపోద్ఘాతముతో (29 + 324). ప్రచురణ, ది అడయార్ లైబ్రరీ అండ్ రీసర్చ్ సెంటర్, మదరాసు:

1980 ; వెల : 70 రూపాయలు, భారత దేశమున ఏజెంట్లు : థియొసాఫికల్ పబ్లిషింగ్ హౌస్, అడయార్, మదరాసు-600 020]

భారతీయుల యాధ్యాత్మిక జీవనమునకు మూలాధారము లైనవి వేదములు. వీటికి శ్రుతులనిపేరు. ఇవి యపౌరుషేయములు. వేదములలో మంత్రములు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు అను విభాగములు కలవు. వేదముల నధ్యయనము చేయుటయందును, వానినర్థము చేసికొనుటయందును శిక్ష, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము, కల్పము అను ఆరు వేదాంగము లుపకరించును. బ్రాహ్మణములలో చెప్పబడినయజ్ఞయాగాదుల ప్రయోగ విధులు, ఆచార విధులు కల్పము (లేక కల్ప సూత్రముల)లలో క్రమబద్ధము చేయబడినవి వైదిక కర్మకాండ పెరిగిపోవుచుండగ దాని సారమును గుర్తించుకొనుటకు వీలుగ వైదిక ఋషులు సూత్రరూపమున కల్ప సూత్రములను వెలయించిరి. విషయమును సంగ్రహముగ, సందిగ్ధము లేక సారమును మాత్రము చెప్పునవి సూత్రములు.

అల్పాక్షరమ సందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్.
అస్తోభమనవద్యంచ సూత్రం సూత్రవిధో విదుః॥

అని సూత్ర లక్షణము. ఇటువంటి సూత్రములుకల గ్రంథమునకు కూడ సూత్రమని పేరు. వేదాంగములలో కల్పము, జ్యోతిషము అనునవి యజ్ఞములు చేయుటకు తగిన పరిజ్ఞానము కలుగజేయుట కొఱకు, శిక్ష, ఛందస్సు వేదములను చదువుటకు సహాయకారులగను, నిరుక్తము, వ్యాకరణము వేదములనర్థము చేసికొనుటయందును ఉపయోగించును.

శ్రుతికి సంబంధించి,సామూహికముగ బహుళ ప్రజోపకారి యగు జ్యోతిష్టోమ-అగ్నిష్టోమ - అశ్వమేధ యాగాదులను వివరించు శ్రౌత సూత్రముల కంటెను భిన్నమైనవి స్మార్త సూత్రములు. ఇవి స్మృతులనాధారముగ చేసికొని రచింపబడినవి. వైయక్తికముగ వ్యక్తులు ఆయా కలములలో, దశలలో చేయదగిన కర్మకాండ వీటిలో పేర్కొనబడినది. ఇవి. (1) గృహ్యసూత్రములు (గృహస్థుల విభిన్న దశలలో ఆచరింపవలసిన యాచార కాండను వర్ణించునవి.) (2) సమయాచార సూత్రములు (సాంప్రదాయకమైన యాచారములు, నిత్యాచారములనుగ్గదించునవి) అని రెండు విధములు.

గృహ్య సూత్రములనగానేమి యని విచారింతము. "గృహే భవాని కర్మాణి గృహ్యాణి. తత్రయం గృహశబ్దస్త్రిష్వర్థేషు వర్తతే, భార్యాయాంశాలాయాం ఆశ్రమఇతి...."1. గృహమునందు చేయునవి లేక పుట్టునవి గృహ్యకర్మలు. గృహశబ్దము భార్య, శాల (ఇల్లు), (గృహస్థాశ్రమము మొదలగు)ఆశ్రమము అను మూడర్థములలో నుపయోగింపబడును:గృహ్యకర్మలను భార్యతో కలసియున్నవాడే అనగా గృహస్థు మాత్రమే చేయుటకు అర్హుడు. గృహనిమిత్తమైన అగ్నికి గృహ్యమనిపేరు. గృహ్యాగ్నినుపాసించుటకుచేయు కర్మలకు గృహ్యకర్మలని పేరు 2. వీటిని వివరించునవి గృహ్య సూత్రములు.

గృహ్యసూత్రములలో గృహస్థుడైనవాడు ప్రతిదినము ఆచరింపవలసిన పంచయజ్ఞములు వివరింపబడును. ఇవి బ్రాహ్మణులకు మాత్రమే పరిమితము చేయబడినవి ఇవికాక బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకుకూడ సాధారణముగవర్తించు గర్భాధాన, పుంసవన,సీమంతోన్నయన,జాతకర్మ,నామకరణ, నిష్క్రమణ, అన్నప్రాశన, చూడకర్మ (చౌల), ఉపనయన, కేశఖండన, సమావర్తన, వివాహములనెడి సంస్కారములు కూడ గృహ్య సూత్రములలో చెప్పబడియున్నవి.

(అశ్వలాయన) గృహ్యసూత్రములను శౌనక శిష్యుడైన అశ్వలాయనుడు రచించెనందురు. ఈయన క్రీస్తు పూర్వము 500-350 నాటి వాడని చెప్పుదురు. అశ్వలాయన గృహ్యసూత్రము ఋగ్వేదమునకు సంబంధించినది. ఇందు నాలుగధ్యాయములు కలవు ప్రతి అధ్యాయము ఖండములుగ విభజింపబడినవి. ఖండములలో సూత్రములు కలవు. ప్రతి అధ్యాయములోని ఖండములు, సూత్రములు సమా

నముగ నుండక విషమముగనున్నవి. పాక యజ్ఞములు, గృహ్యాగ్ని నుపాసించు విధానము, అమావాస్య - పౌర్ణమి తిథులలోచేయదగిన దర్శ-పౌర్ణమాసములనెడి యాగములు, పశుకల్పము, చైత్య యాగము, అగ్ని - ఇంద్ర-వరుణ-సోమాదిదేవతలకు బలిహరణము నిచ్చుట, వివాహము దాని విధములు,గర్భాధాన-పుంసవన జాతకర్మ-నామకరణ-అన్న ప్రాశన - చౌలకర్మ - గోదాన - ఉపనయనముల ప్రథమాధ్యాయమునందును; శ్రవణకర్మ, సర్వబలి, ప్రత్యవరోహణ అష్టకకర్మ, అన్వష్టక్యశ్రద్ధ, రథారోహణవిధి, వాస్తులక్షణ, వాస్తుపరీక్షాదులు ద్వితీయాధ్యాయమునందును; పంచయజ్ఞములు, స్వాధ్యాయవిధి, స్వాధ్యాయాధ్యయనము, దేవర్షి పితృ తర్పణము, ఉత్సర్జనము, సంధ్యోపాసన, స్నాతక వ్రతము మొదలైన తృతీయాధ్యాయము నందును; మానవుడు చనిపోయిన తరువాత అతని కాచరింపవలసిన ఔర్ధ్వ దైహిక కర్మలు, పార్వణాదిశ్రద్ధ విధులు చతుర్థాధ్యాయము నందును వివరింపబడినవి.

"అశ్వలాయన గృహ్య సూత్రము" నకు సద్గురు శిష్యుని"అభ్యుదయప్రద", అజ్ఞాత కర్త విరచితమగు భాష్య మొక్కటి, "ప్రయోగవృత్తి" యనెడి యజ్ఞాతకర్త వృత్తి, అగ్ని శర్మోపాధ్యాయ విరచిత వ్యాఖ్యానము, ఆనందరాయ విరచిత "ఆనంద చంద్రిక"యనెడి వ్యాఖ్యానము, గదాధర కృత వ్యాఖ్యానము, గోపాలకృతవ్యాఖ్యానము, జయంతుని "విమలోదయమాల" యనెడి వ్యాఖ్య, దామోదరభట్టు యొక్క "తత్పర్య వ్యాఖ్య", దేవస్వామి కృత భాష్యము, నారాయణుని "వృత్తి" యను పదునొకండు వ్యాఖ్యానము లున్నట్లు తెలియుచున్నది.(3). వీటిలో జయంతుని "విమలోదయమాల", నారాయణుని "వృత్తి", దేవస్వామి భాష్యము ముద్రితములైనవి.

ప్రస్తుత భాష్యమును రచించిన దేవస్వామి జీవిత కాలములను గురించి ఏమియు తెలియరాకున్నది. కాని విమర్శకులు ఇతడు దక్షిణాత్యుడనియు క్రీ త.1000 - 1050 కాలములోని వాడనియు చెప్పుచురు(4). ఇతడు గృహ్య, శ్రౌత సూత్రములందేకాక మీమాంసా-ధర్మ శాస్త్రములందు కూడ విశిష్ట పాండిత్యము కలవాడు. ఇతనిగ్రంథములనేకాక అశ్వలాయన శ్రౌత సూత్రమునకు, బోధాయన శ్రౌత సూత్రమునకు, జైమిని మీమాంసాసూత్రమునకు,సంస్కార కాండకు భాష్యములు, "అగ్నిష్టోమ పద్ధతి", "అగ్నిష్టోమ ప్రయోగము" "అగ్నిష్టోమ విధి"యను స్వతంత్ర గ్రంథములు రచించెనని తెలియుచున్నది.(5)

దేవస్వామి విరచిత భాష్యము నాలుగవ అధ్యాయాంతము నందు కొంత నష్టమైనట్లు కన్పించుచున్నది. ఇతని భాష్యము పాండిత్య స్ఫోరకముగను, బహు విషయ యుక్తముగను, సమగ్రముగను నుండుటచేమిక్కిలి ప్రశస్తి బడసినది. కావుననేదేవణ్ణభట్టు,హేమాద్రి,మాధవుడు మొదలగు వారతని భాష్యమును తమ గ్రంథములలో పెక్కు తావులలో నుదహరించిరి. నైధ్రువ నారాయణుడు "అశ్వలాయన గృహ్య సూత్ర వృత్తి" వ్రాయుచు అద్యంతములలో దేవస్వామి భాష్యమునసుసరించి తన గ్రంథమును వ్రాసి కృతకృత్యుడనైతినని చెప్పుకొనెను.(6) దేవస్వామి భాష్యములోని భాష సరళముగను. సుబోధకముగను. సంభాషణ శైలిలోనుండి శ్రీ శంకరుల బ్రహ్మ సూత్ర భాష్యము వలె చదువుటకింపుగా నుండును.

ఈ భాష్యమున కింత ప్రశస్తికలదు కావుననే వైదిక, లౌకిక వాఙ్మయమునకు సంబంధించిన పెక్కు సంస్కృత గ్రంథములను విమర్శక దృష్టితో, పాఠభేదములతో, దీర్ఘ

(1) ప్రస్తుత భాష్యము, పుటలు 1-2
(2) అశ్వలాయన గృహ్య సూత్ర భాష్యమ్ (నైధ్రువనారాయణుని వృత్తి సహితము) పుట. 1.
(3) ప్రస్తుత భాష్యము, ఉపోద్ఘాతము, పుట 14
(4) అచ్చటనే, పుట 19.
(5) అచ్చటనే, పుటలు 20-21.

పీఠికలతో, ఆంగ్ల వ్యాఖ్యాసములలో ప్రకటించిన దిఅడయార్ లైబ్రరీ అం.డ్ రీసెర్చి సెంటర్, మద్రాసువారు ఆశ్వలాయన గృహ్యసూత్రమును 7. దేవస్వామి భాష్యముతో ప్రకటించి పండిత లోకమునకు, వైదిక వాఙ్మయ జిజ్ఞాసువులకు మహోపకారం మొనర్చిరి. ఇందు మొదటి యధ్యాయము ప్రప్రథమముగా 1937 నుండి 1941 వ సంవత్సరము వరకు ది అడయార్ లైబ్రరీ బుల్లెటన్ లో సీరియల్‌గా ప్రకటింపబడి, 1944లో ది అడయార్ లైబ్రరీ సీరీస్ లో నొక గ్రంథముగ ప్రకటింపబడెను. తరువాత 1962-70 వరకు అడయార్ లైబ్రరీలో నుద్యోగించిన పండిట్ కే. పి. ఐథల్ గారు ఎన్నో తాళపత్రగ్రంథములను, మైక్రోఫిల్మ్ కాపీలను సేకరించి పెక్కు శ్రమలకోర్చి 1980 లో కేంద్ర ప్రభుత్వ విద్య-సాంఘిక సంక్షేమ శాఖవారి ఆర్థిక సహాయముచే నీ గ్రంథమును ప్రకటించిరి.

ఈ గ్రంథములో విషయ సూచిక, ఆంగ్లములో 29 పుటల విమర్శనాత్మకమగు ఉపోద్ఘాతము, 277 పుటలలో దేవనాగరలిపిలో గృహ్య సూత్రములు వాటికి దేవస్వామి భాష్యము, భాష్యోదాహృత ఋగ్వేద మంత్రముల యను క్రమణిక, సూత్రములలో నుదహరింపబడిన మంత్రముల యనుక్రమణిక, సూత్రములందుదాహృతములైన ఋగ్వేదాదన్య వాక్యములయనుక్రమణిక, భాష్యములో నుదహరింపబడిన వేదవాక్యముల యనుక్రమణిక, ఆశ్వలాయన గృహ్య పరిశిష్టము కలవు. ఆంగ్లోపోద్ఘాతమున సంపాదకులు తామీ గ్రంథమును పరిష్కరించి ప్రకటించుటకు సేకరించిన తాళపత్రప్రతులు, వాటివివరములు, నారాయణుని వృత్తిననుసరించి, ఈభాష్యమునసుసరించి విశేషముగా దోచు కొన్నిపాఠ భేదములు, ఈ గృహ్యసూత్రమునకు గల వ్యాఖ్యానములు, దేవస్వామి కాలము, ఇతర గ్రంథములు, దేవస్వామిని తమ గ్రంథములలోనుదహరించిన అర్వాచీన గ్రంథకర్తల పేర్లు, దేవస్వామి భాష్య వైశిష్ట్యము, ఈ గ్రంథ రచనలో తోడ్పడినవారికి కృతజ్ఞతలు కలవు.

ఈ గ్రంథములో సుళువుగా గుర్తించుటకనువుగా సూత్రములు పెద్ద అచ్చులోను, భాష్యము చిన్న అచ్చులోను అందముగా చక్కని తెల్లని కాగితముపై ముద్రింపబడినవి. పెక్కు తాళపత్రములననుసరించిసూత్ర, భాష్యముల లోని పాఠభేదములు, పుటలకు అథోభాగమున నివ్వబడినవి. భాష్యమున నచ్చటచ్చట నుదహరింపబడిన ఋగ్వేద మంత్రములకుఅచ్చటనేఆకరములివ్వబడినవి. అన్నిటికన్నను ముఖ్యమైనది ఏసూత్రము, ఏ అధ్యాయములో, ఖండములో, పుటలో నున్నదో తెలియజేయు సూత్రములయనుక్రమణిక. దీనివలన ఏ సూత్రము కావలసిన వారా సూత్రమును మాత్రము అనాయాసముగా వెదకి చదివి అర్థము చేసికొనగలరు. అదే విధముగా సూత్రోదాహృత ఋగ్వేదమంత్రముల యనుక్రమణికలో ఏ మంత్రము ఏ సూత్రములో నుదహరింపబడినదో తెలుపబడినది. భాష్యోదాహృత వాక్యములకు ఆకరములివ్వబడిన యనుక్రమణిక పరిశోధకులకు మిక్కిలి యుపయోగము. పొరబాటున దొర్లిన, వేళ్ళమీద లెక్కింపదగిన అచ్చుతప్పులకు శోధన పట్టిక ఇవ్వబడినది. గృహ్య సూత్రమును చక్కగా నధ్యయనము చేయదలచినవారికిది వరప్రసాదము వంటిది దీనికి కొంత ఆంగ్ల వివరణముండిన యెడల మరింతబాగుండెడిది. ఇంత చక్కని గ్రంథమును నిర్దుష్టముగ, అందముగ ముద్రించి ప్రకటించి పాఠకలోకమునకందజేసిన ది అడయార్ లైబ్రరీ అండ్ రీసెర్చి సెంటర్ వారు మిక్కిలి అభినంద్యులు. వీరి వాఙ్మయసేవ ఇతోధికమగుగాక ! పండితులు, పరిశోధకులు వీరికృషిని గుర్తించి వీరినాదరింతురు గాక !

డాక్టర్ కాశీభట్ల సేతు రామేశ్వర దత్త.

---

(6) ఆశ్వలాయనమాచార్యం ప్రణిపత్య జగద్గురుమ్,
దేవస్వామి ప్రసాదేన క్రియతే వృత్తిరీదృశీ॥ (నారాయణుని "వృత్తి" ప్రారంభ శ్లోకము.)

(7) ఆశ్వలాయన గృహ్యస్యభాష్యం భగవతాకృతమ్,
దేవస్వామి సమాఖ్యేన విస్తీర్ణం తత్ప్రసాదతః॥ అదే గ్రంథము, చివర శ్లోకము.

# తిరువాయ్ మొళి అను శ్రీ శఠకోప వాక్సుధ

## (తృతీయ శతకము)

["శ్రీ చరణ రేణువు" సమకూర్చిన సుధామాధురి అను లఘు వ్యాఖ్యతో. ప్రకాశకులు : శ్రీ గోదా గ్రంథ మాల, ముసునూరు-521 207, 124 పుటలు. వెల : పది రూపాయలు.]

వైష్ణవ సంఘానికి శ్రీ గోదా గ్రంథమాల చేస్తున్న సేవ నిరుపమానం. పవిత్ర గ్రంథాల నెన్నిటినో ఈ సంస్థ ప్రచురించింది. ఆ వరుసలోదే ఈ పుస్తకం. తమిళ గ్రంథాన్ని తెలుగు లిపిలో ప్రచురించి, దానికి సరియైన అర్థాన్ను, సంక్షిప్త వ్యాఖ్యానాన్ని శ్రీ చరణరేణువు సమకూర్చారు. మధ్యమధ్యలో ఆ సందర్భానికితగినసంస్కృతాంధ్ర పద్యాల నుదహరించారు. అవన్నీ భక్తులకు పరమానందాన్ని కల్గిస్తాయి.

ఈ గ్రంథానికి ముందు ఉన్న శ్రీమాన్ న. చ. శ్రీనివాసతాతాచార్యులుగారి భగవద్విషయమాధురి ఒక ప్రత్యేకాకర్షణ.

వైష్ణవలక్షణాలకు ఆళ్వారులే మార్గదర్శకులు. తాము అజ్ఞులమని ఆళ్వార్లుచెప్పుకుంటారు. నైచ్యానుసంధానం శ్రీ వైష్ణవులకు ఉండవలసిన ప్రధానలక్షణం. నిజానికి అజ్ఞులమని చెప్పుకోవడం ప్రాజ్ఞులలక్షణం. శ్రీవైష్ణవరహస్యాలెన్నో ఈ గ్రంథంలో నిక్షిప్తమై ఉన్నాయి.

దశకములనే పేరుతో మొత్తం పది పరిచ్ఛేదాలున్నాయి ఇందులో. ప్రథమ దశకంలో దేవుని సుందర రూపం వర్ణింపబడుతుంది. స్వామి రూప గుణ సంపదను అనుభవింపలేనందుకు ఆళ్వారు దుఃఖిస్తుండగా సర్వేశ్వరుడే తెంచి వేంకటాద్రికి వారిని ఆహ్వానించడం రెండవదశక విషయం. కైంకర్యము చేయవలెనని పలుకుట తృతీయ దశకము. స్వామి రూప గుణాదులను చూచి స్తబ్ధులై వానినన్నిటి నొకే పర్యాయమనుభవించు ఆళ్వారులు చతుర్థ దశకంలో గోచరిస్తారు దేవుని గుణములను ఆస్వాదింపనివారు వ్యర్థులని, ఆస్వాదించే వారే ధన్యాత్ములనీ ఆళ్వారులు పంచమ దశకంలో స్పష్టంచేస్తారు భగవంతుని విస్మరించే వారికి ఉపదేశాలు ఆరవ దశకము. కమలాక్షునర్చించే భాగవతులు మనకు పరమ పూజ్యులని. చెప్పడం ఏడవ దశకంలో గోచరిస్తుంది. సర్వేశ్వరుని దివ్య మంగళవిగ్రహ మాధుర్యాన్ని తనివి తీర గ్రోల లేకపోయినందుకు ఆళ్వారులు దుఃఖిస్తారు- ఎనిమిదవ దశకంలో. తమ బాధను వినే వారెవరైనా ఉన్నారా అని చూస్తే ఎవరూ కనబడరు. ఎవరికి పట్టింది భక్తుల సంగతి? దేవుణ్ణి విస్మరిస్తున్నారు ప్రజలు. వారికి హితం చెబడం తొమ్మిదవ దశకం. పరమ పురుషునిపై కవిత చెప్పగలిగినందుకు మురిసిపోతున్న ఆళ్వారులు పదవ దశకంలో కనబడతారు. ఇందలి పాశురాల్లో మాధుర్యానికి మచ్చుతునకగా ఒకదాని భావం-

"సర్వలోకముల యోగ క్షేమములు చింతించుచు క్షీరసాగరమున శేషాహిపై యోగనిద్రాముద్రితుడై యుండి గూడ స్వామి ఆశ్రితులకేమి యాపత్తు కలుగునో వారిని రక్షింప నెప్పుడు పోవలసి వచ్చునోయని యప్రమత్తతతో నుండును. శత్రువిదళనముచే రక్తపర్ణముతోమిక్కిలి శోభించుచున్న నాసికాగ్రముగల గరుత్మంతుడు గూడసర్వదాస్వామిని తనపై వేంచేపు చేసికొని హుటాహుటిగాపోవుటకు సంసిద్ధుడై యుండును. విరోధి నిరసనశీలుడగునట్టి సర్వేశ్వరుని యొక్క కళ్యాణ గుణ సంపదలు కీర్తించి పాడుచు నృత్యము చేయుచుండు. నేను అవ్యాహతముగా భగవద్గుణాను భవానందముతో నొడలు మరచి యున్నాను."

శ్రీ పులిచెర్ల సాంబశివరావు



# లేఖలు

## తెలుగు - ఇంగ్లీషులలో సమాన అర్థ, సమాన ధ్వనికల పదములు

(రెండవ భాగము)

సెప్టెంబరు 1980 భారతిలో, తెలుగు, ఇంగ్లీషులలో సమాన అర్థము, సమాన ధ్వనికల పదముల నిచ్చియుంటిని. ఇప్పుడు మరికొన్ని ఇచ్చుచున్నాను.

| తెలుగు | ఇంగ్లీషు |
|---|---|
| కత్తెర | కట్టర్ |
| గవి | కేవ్ |
| తనకలి | టాంగిల్ |
| పాలి | పేల్ |
| ప్రాపు | ప్రాప్ |
| పీకు, పిక్కు | పిక్ |
| బొరియ | బర్రో |
| రుబ్బు | రబ్ |
| రేచు, రేగు | రేజ్ |
| వ్రాత | రైట్ |

"త్రి"

1981 డిసెంబరు "భారతి" సంచికలో శ్రీ సర్దేశాయి తిరుమలరావుగారు "తెలుగులోని ప్రతిధ్వని పదముల" ను గూర్చి వివరించిరి. వారిచ్చిన "పరిపూర్ణ ప్రతిధ్వని పదములు" చదివి యీ లేఖ వ్రాయుచున్నాను.

శ్రీ తిరుమలరావుగారు "పదమును ఒకసారి ఉచ్చరించినప్పు డర్థమీయక, రెండవసారి యన్నప్పుడే నిర్దిష్టార్థము వచ్చిన ఆ పదముల జంటను ప్రతిధ్వని పదమన వచ్చును" అని నిర్వచించి "ఈ నియమము ప్రకారము చెంగుచెంగు, టివ్వుటివ్వు, టింగుటింగు, రివ్వురివ్వు, జివ్వు జివ్వు, బిక్కుబిక్కులు ప్రతిధ్వని పదములు కాజాలవు" అని స్పష్టపరచి మరల వాటినే తమ, "పరిపూర్ణ ప్రతిధ్వని పదముల పట్టికలో చేర్చినారు. పై పదములలోను పట్టికలోని మరికొన్ని పదములలోను "ప్రతిధ్వనితమున్నను ఒక్క పదమే అర్థమీయ గలదు" గనుక ఇటువంటి పదములను ప్రత్యేకముగా చూపిన బాగుండెడిది.

శ్రీ రావుగారు నిఘంటువులుఆధారముగా ఈ పట్టికను రూపొందించుటచేత ప్రాచీన కవి ప్రయోగములు కొన్ని యిందు కన్పించవు. ఉదాహరణకు నాచనసోముని ఉత్తర హరివంశములోని యీ క్రింది పదములు.

పొరిపొరి : పట్టుఁడిట్టుఁ బొరిబొరి రోఁదున్ 6-103

బడిబడి : నిముం, దొడి తెమ్మనెమారా; జదె
బడిజడి వచ్చెదఁ వేగ పని వినుమనినన్ 1-55

ముఱుముఱు : ముఱుముఱు చీకటితో.... 4-272

అప్పకవి హల్లులలో వర్గద్వితీయ, చతుర్థవర్ణాలు, జ, ఞ, శ, ష,లు తెలుగులో లేవని చెపుతూనే ఢాక, ఠకారాది పదములు కొన్ని తెలుగు లోనివని పేర్కొన్నాడు. ఈ విషయమై శ్రీ గిడుగువారు "శుద్ధాంధ్ర దేశభాషా పదములలో వర్గద్వితీయ చతుర్థ వర్ణములు లేవని చెప్పరాదు". అని వ్రాసిరి. (అప్పకవీయమునకువారి ఉపోద్ఘాతము, వావిళ్ళ ప్రతి 1962. పుట 42) శ్రీ రావుగారు "ఖ, ఖ, ఛ, ఠ, ఢ, థ, ఫ, భ, శ, ష లతో ప్రారంభించు పదములు దేశ్య తెలుగులో లేకుండుటచేత...." అని వ్రాయుట వింత. వారిచ్చిన "ఠవఠవ" శబ్దము శబ్దరత్నాకరమున దేశ్యముగా చూపించబడినది. "నిగనిగ" దేశ్యముగా "నైగనిగ్యము" సంస్కృతముగా శబ్దరత్నాకరముకూడా చూపించినది. చకచక - చాకచక్యము పదములుకూడ ఇటువంటివే.

ద్విరుక్తిలేని ధ్వన్యనుకరణ శబ్దములు కొన్నిగలవు. ఉదా॥ హుమ్. వీకన్మేను వొంగంగ, హు
మ్మని జాడించిన....(ఉత్తర హరివంశము 1-150)

మూడక్షరముల ప్రతిధ్వని పదములలో కొన్నిటికి రూపాంతరములు కన్పించు చున్నవి.

ఉదా: 'మినుకుమినుకు' కు 'మినుమినుకు'. ఇదికూడా నాచన సోముని ప్రయోగమే.

"సంస్కృత భాషలోను ప్రతిధ్వని పదములు విన బడవు" అని శ్రీ రావుగారి వ్రాత. వారుదహరించిన "ఘుమ ఘుమ" సంస్కృత శబ్దమే గదా! "ధమధమ" "ఝళఝళ" "ఝణఝణ" వంటి వాద్యానుకరణ శబ్దములు సంస్కృత శబ్దములు కావా?

శ్రీ తిరుమలరావుగారు, వారు సేకరించిన ప్రతి పద మునకు ప్రయోగమునుకూడా చూపిఉంటే వ్యాసం విస్తృత మైనా అధిక ప్రయోజనకరముగా ఉండెడిది.

సూర్యదేవర రవి కుమార్
దుత్తలూరు

# స్వర్ణ లేఖిని

"సారస్వతపరిషత్" పేర ఏర్పాటుచేయనున్న trustకు సంబంధించిన "స్వర్ణలేఖిని" బహుమతిని ప్రవేశపెట్టే ప్రయత్నంలో కవితాభిమానుల, సహృదయుల హార్దిక ఆర్థిక ప్రోత్సాహంకావాలి. ప్రతిఉగాదికిజరిగే ఈసంబరంలో వర్ధమానకవిని-కృతిని సన్మానించటంజరుగుతుంది. వివరాల కోసం ఈ చిరునామాకు వ్రాయండి.

సాంధ్యశ్రీ
సారస్వతపరిషత్-స్వర్ణలేఖిని, దంతలూరు
వయా నందివెలుగు. 522 297

# బొట్టు

డిసెంబరు 1980 "భారతి"లో శ్రీ రావి రంగారావుగారి "తొలి వచనకవిత" అనే వివరణ వ్యాసాన్ని చదివాను. అందులో వారు, తొలి వచన కవితకు కూడా ఆద్యుడు శ్రీ గురజాడ అప్పారావుగారేనని, అందుకు ఉదాహరణంగా విశాలాంధ్రప్రచురణాలయంవారు ప్రచురించిన "గురజాడ ముత్యాల సరాలు"(1965) 70వ పుటలోఉన్న "బొట్టు" అనే కవితను ఉటంకించారు. సుమారు నాలుగు దశాబ్దాల క్రితం ఒకరోజున శ్రీ ఆరుద్ర నానోటుబుక్కులో శ్రీ శ్రీ 'దేనికొరకు' 'నిజంగానే?' గురజాడ వారి బొట్టుగేయాలనిరాసిచదవండని వెళ్ళిపోయారు. ఈ బొట్టు గేయాన్ని అంత్యప్రాసకుమంచి ఉదాహరణగా ఆరోజుల్లో తీసికునేవారం. ఆ నోటుపుస్తకం 1968 లో చదలపాలైపోయింది. ఇహా జ్ఞాపకం ఉన్నంతమట్టుకు అది ఇలా ఉండేది.

బొట్టు

నూగు మీసపు కట్టు
నోటాన సిగరెట్టు
కచ్చ పైకలుకట్టు
కాసరానీబొట్టు
ఉంగరాలాజుట్టు
కోటునిండాకుట్టు
జిలుగునిండేకిట్టు
చేకట్ల చైజుట్టు
కొనుచు దక్షణగట్టు
నిలిచె వైష్ణవభట్టు........

మనసుమర్మముగుట్టు
మడుగు పరచియుట్టు
నీలినగములచుట్టు
సంధ్యచీకటి పుట్టు.

పై రచన వచన కవితగా కనిపించదు. పదిమాత్రలు గల చరణాలతో "ట్ట" కార అంత్య ప్రాసతో రాసింది. ఈ గేయం వ్యక్తిగతమవడం చేతనో, ఇంకా ఏ మన్నా ఇత రేతర కారణాలవల్లనో పూర్తి పాఠాన్ని ప్రచురించక పోవచ్చు. అదీకాక గురజాడవారు సరదాకి వ్రాసి ఉండ వచ్చు, ఇందులో విజయనగరం హైకోనేరు ప్రసక్తికూడా ఉండేది. విశాలాంధ్ర ప్రచురణాలయం వారు కాని, శ్రీ ఆరుద్ర కాని దీని అసలు ప్రతిని ప్రచురించేవరకు, "బొట్టు" అనే కవితను గురజాడవారి వచన కవితగా తీసికో నవసరం లేదు. గురజాడవారు ఆంధ్ర సాహిత్యంలో వివిధ మైన ప్రక్రియలకి ఆద్యులు! మహాకవి! అతనిని తొలి వచన కవిగా పేర్కొన్నంత మాత్రాన అతనికి ఏదీ ఒరిగేది లేదు. కనుక సందేహాస్పదమైన ఆద్యత్వం అతనికి ఇవ్వనవసరం లేదనుకుంటాను.

ప సం మూర్తి
హైదరాబాదు

Printed and Published for Nageswara Rao Estate(Prtvate) Ltd., by S. Radha Krishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S.Radha Krishna; Vijayawada. Phones: 75667 & 61247

BC

“సాంప్రదాయ సిద్ధమయిన భారతీయ ఔషధాలకి ప్రత్యేకమయిన శక్తివుంది.
ఉదాహరణకి,
అమృతాంజన్.”




ప్రకృతిలో లభించే అత్యంత శక్తివంతమయిన పది మూల ఔషధాలతో అమృతాంజన్ తయారు చేయబడుతోంది. అంటే అమృతాంజన్ చాలా శక్తివంతమయినది.

అందుచేత అమృతాంజన్ తలనొప్పులకు, జలుబులకు, వంటినొప్పులకు, బెణుకులకు శీఘ్రంగానూ, నిశ్చయంగానూ ఉపశమనం కలిగిస్తుంది. అంతేకాదు అమృతాంజన్ సురక్షితమయిన బాధా నివారిణి.

అమృతాంజన్ :
80 సంవత్సరాలకు పైబడిన నమ్మకమైన దివ్య ఔషధము

AM-2148

# అమృతాంజన్

తలనొప్పులకు .జలుబులకు.
వంటినొప్పులకు.బెణుకులకు





మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M172 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Manasa |
| పేజీలు విడదీసినది | Sirish |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | amrutba |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |